# అపరాధ పరిశోధన

రూ.7 జులై '86



అపరాధ పరిశోధన అనుబంధం—151

# తెలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

30/6/86 Ranga Rao

## ఆరాధన
రచన: వసుంధర

## టెంపోరావ్ జీవిత చరిత్ర
రచన: డాక్టర్ వి. సుభద్ర

## రాకాసి చేప
రచన: నీలూ

## కుంభాకార కటకం
రచన: చంద్రశేఖర అజాద్

అన్వేషణ - మొదటి భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 151
జూలై, 1986
వెల: రు. 7-00
ఏడాది చందా: 84 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్‌రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64343

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# ఆరాధన

వసుంధర

"రండి—కూర్చోండి—" అంది సీతమ్మ.

"డిటెక్టివ్ గారు సరిగ్గా అయిదు నిముషాల్లో వస్తారు. టైము వేస్టు కాకూడదనుకుంటే మీరు మాకు విశేషాలు చెప్పుకోవచ్చు—" అంది రాజమ్మ.

అతడికి నలభై యేళ్ళుంటాయి. మరీ పొట్టి కాదు. పొడవూ కాదు. మరీ లావూ కాదు. సన్నంకాదు. మరీ తెలుపూ కాదు. నలుపూ కాదు.

మనిషి మాత్రం ధనికుడిలా వున్నాడు. ముఖం గంభీరంగా వుంది.

అతడు కూర్చోలేదు. రాజమ్మవంక చురుగ్గా చూసి—"మీతో విశేషాలు చెప్పుకునే వయసు కాదు నాది—" అన్నాడు.

"నే నన్నది కేసుకు సంబంధించి!" అన్నదామె వెంటనే.

"మీతో నా సమస్యలు చెప్పుకుంటే అది సమయం

వృధా చేయడం కిందే వస్తుంది. డిటెక్టివ్ వెంకన్నగారి కోసం యెంతసేపైనా యెదురుచూస్తాను—" అన్నాడతడు.

రాజమ్మ చిన్నబుచ్చుకున్న ముఖంతో—"మావయసు తక్కువ కావచ్చు. కానీ అనుభవం తక్కువ కాదు—...." అంది.

"చూడమ్మా! అందమైన అమ్మాయిలు అనుభవం తక్కువంటేనే వినడానికి సొంపుగా వుంటుంది—" అన్నాడతడు.

అతడి మాటలకు రాజమ్మకూ, సీతమ్మకూ కూడా కోపం వచ్చింది. కానీ ఇద్దరూ మాట్లాడలేదు. క్లయింట్ వెళ్ళిపోతే—అందుకోపం కారణమైతే—జాన్‌కు నచ్చినా నచ్చకపోయినా—అతడంటే అభిమానమున్న ఆ అసిస్టెంట్లిద్దరికీ నచ్చదు.

ఒక్క నిముషమాగి—"చూడమ్మా! అయిదు నిమిషాలూ అయిపోయాయి. డిటెక్టివుల కక్కడా టైము విలువుండదా?" అన్నాడాయన.

అప్పుడు వెంకన్న ఇంట్లోనే వున్నాడు. అతణ్ణి భార్య ఫోన్ చేసి వంటింట్లోకి పిలిచింది. వెంకన్న భార్య పద్మావతి సాధారణంగా ఆఫీసుగదికి రాదు. అతణ్ని పిలవడానికి వంటింటికీ—ఆఫీసుగదికీ ఫోను. అయితే ఫోను అవసరం లేకుండానే ఆఫీసులో జరిగే విషయాలన్నీ ఆమెకు వినిపిస్తూనే వుంటాయి.

పద్మావతి ఎంత మంచిదో అంత గంభీరంగానూ వుంటుంది. అసిస్టెంట్సిద్దరికీ వెంకన్నదగ్గర ఎంత చనువో-పద్మావతంటే అంత భయం.

వెంకన్న యింకా రావడంలేదని సీతమ్మ వంటింట్లోకి

ఫోన్ చేసింది. అతతల గొంతు వినగానే భయంగా రిసీవర్ రాజమ్మ కందించింది. రాజమ్మ ఫోన్ అప్రయత్నంగానే అందుకుంది కానీ సీతమ్మెందుకు భయపడిందో ఆమె కర్థం కాకపోలేదు.

"హలో! యెవరూ మాట్లాడరేం?" అంది పద్మావతి గొంతు మరోసారి.

"ఒక క్లయింట్ వచ్చారు...." అంది రాజమ్మ.

"వస్తే కూర్చోమనండి... "

"అన్నామండి, కానీ ఆయన నిలబడే వున్నారు... "

"అవసరంపడి వచ్చిన వాళ్ళు కాసేపైనా చూడాలి."

"చాలా సేపట్నుంచి ఎదురు చూస్తున్నారండి...."

"సరే—ఇంకో అయిదు నిమిషాల్లో వస్తానని చెప్పు" అని ఫోన్ పెట్టేసింది పద్మావతి.

"ఇంకో అయిదు నిమిషాల్లో వస్తారుట—...." అంది రాజమ్మ.

"ఎవరూ—వెంకన్నగారేనా మాట్లాడట...."

"కాదండి—వారి శ్రీమతి. ఆమెతో మాట్లాడే ధైర్యం ఈ ఆఫీసులో నాకు మాత్రమే వుంది—...." అంది రాజమ్మ గర్వంగా.

సీతమ్మ మూతి మూడు వంకర్లు తిప్పింది.

ఆ అసిస్టెంట్లిద్దరూ ఒకరి మీదొకరు అధికృత చూపించుకోవాలని ప్రయత్నిస్తూంటారు. వచ్చిన అవకాశాన్నిద్దరూ వదులుకోరు.

"ఆయన భార్య అయిదు నిమిషాలన్నదా? అయితే కూర్చుంటాను—" అని అతడు కుర్చీలో కూర్చున్నాడు.

# 2

ఫోన్ వచ్చే సమయానికి వెంకన్న పచ్చడి రుబ్బు తున్నాడు.

ఆ యింట్లో మిక్సీ, వెట్ గ్రైండర్ వగైరా ఆధునిక సామగ్రులన్నీ వున్నాయి. పనిమనుషులూ వున్నారు.

అయినప్పటికీ భార్య భర్తపై ప్రేమను చూపించు కునేందుకు—అప్పుడప్పుడు తనే అన్ని పనులూ చేస్తూం డాలన్నది పద్మావతి సిద్ధాంతం. అందుకోరోజు ఎన్ను కుని—ఆ రోజు పనిమనుషులకు సెలవిచ్చేస్తుంది. యంత్ర సామగ్రికీ సెలవిచ్చేస్తుంది. ఆ రోజు ఇల్లూడ్చడం దగ్గ ర్నుంచి, బట్టలుతకడం దగ్గర్నుంచి—అన్ని పనులూ తనే స్వయంగా చేస్తుందామె.

ఆ రోజు ఈ రోజు.

భర్తకిష్టమైన పెసరపచ్చడి రుబ్బురోట్లో వేసి రుబ్బు తోందామె. సగంలో ఆమెకు చేయి బెణికింది. ఫోన్ చేసి భర్తను పిలిచింది.

వెంకన్న వెళ్ళాడు. పరిస్థితి విని తనే రుబ్బురోలు ముందు కూర్చున్నాడు.

అతడు రుబ్బుతూంటే కుతూహలంగా అతడి ముఖం లోకే చూస్తోందామె.

అనుభవమున్నవాడిలా చక్కగా చేతులు కదుపుతూ రుబ్బుతున్నాడతడు.

పద్మావతి అతడితో కబుర్లు చెబుతోంది. ఈలోగా ఫోన్ వచ్చింది.

విసుగ్గానే తీసింది పద్మావతి. ఆమె ఫోన్ పెట్టే స్తూంటే—"ఏమిటయిందిట?" అన్నాడు.

"ఎవరో క్లయింట్ వచ్చారుట—యింకో అయిదు

నిమిషాలు కూర్చోమన్నాను—"

"అయిదు నిమిషాల్లో చెయ్యడం పూర్తికాదేమో—" అన్నాడు వెంకన్న.

"సరే—ఆ పనేదో నేనే చూసుకుంటాను. మీరు మీ డిటెక్టివ్ చాదస్తంలో చేతులు కడుక్కోనందుకే అయిదు నిమిషాలు పడుతుందని తెలిసి అలా చెప్పాను. వెళ్ళి చేతులు కడుక్కోండి—" అంది పద్మావతి.

"మరి—నీ పచ్చడి—...."

"నేనే రుబ్బుతుంటాను—" అంది పద్మావతి.

"నీ చేయి బెణికింది కదా—...."

"చెయ్యేం బెణకలేదులెండి. మీకు నామీదింకా ఎంత ప్రేముందో తెలుసుకుందామని అలా చెప్పాను..." అంది పద్మావతి.

వెంకన్న దీనంగా ముఖం పెట్టి—"దేవీ! నువ్విప్పుడు నా ప్రేమననుమానిస్తున్నావు కదూ!" అన్నాడు.

"అనుమానించక ఏం చేయను? నిక్షేపంలా వుంటే నన్నొక్క క్షణంకూడా పట్టించుకోరు మీరు సరదాగా మీతో కబుర్లు చెప్పాలనిపించింది. మామూలుగా అయితే రారు. అందుకే పిలిచి చెయ్యి బెణికిందన్నాను. మీరిక్కడ ఆగిపోతారు. నేను కబుర్లు చెప్పి సరదా తీర్చుకుంటున్నాను. అమాత్రానికే మీ అసిస్టెంటో స్వర్ణలత ఫోన్ చేశారు...."

వెంకన్న లేచి చేతులు కడుక్కుంటూ—"పాపం—వాళ్ళేం చేస్తారు? క్లయింట్ వచ్చాడుగా—...." అన్నాడు.

"క్లయింటొచ్చినా రాకపోయినా అదో వంక.

మిమ్మల్ని చూడకుండా వాళ్ళుండలేరు....” అంది పద్మావతి.

వెంకన్న మాట్లాడలేదు.

“నేను చాలా తెలివితక్కువ పనిచేశాను. బాగా వయసు ముదిరిన ఏ రెండో పెళ్ళివాణ్నో చేసుకోవాల్సింది నేను. ఎప్పుడూ నా చుట్టూ తిరుగుతూండేవాడు” అంది పద్మావతి

“ఊరికే కబుర్లు చెబుతావుగానీ—నన్ను పెళ్ళాడేక నా పదవులే నీకు నచ్చుతున్నాయి. ఇందాక చేయి వేసి కిందన్నట్టే ఇప్పుడీ మాటలు అంటున్నావు—.... అవునా?” అని ఆమె యెక్కడ కాదంటుందోనన్న భయంతో గబగబా చేతులు తుడుచుకుని వెళ్ళిపోయాడు వెంకన్న.

తనన్న మాటలతో వెంకన్న క్లయింట్‌కు సంబంధముందని తెలియని పద్మావతి భర్తను తల్చుకొని ముసిముసిగా నవ్వింది.

చలాకీగా పచ్చడి రుబ్బుతున్న భర్త ఇంకా ఆమె కళ్ళముందు మెదులుతున్నాడు.

## 3

డిటెక్టివ్ వెంకన్న తన సీట్లోకి వచ్చి కూర్చోగానే “మీరేనా—వెంకన్న? పేరు విని చాలా పెద్దవారై ఉంటారనుకున్నాను—” అన్నాడతడు.

“నేను జ్ఞానవృద్ధుణ్ణి — మీ పేరు?” అన్నాడు వెంకన్న.

“నా పేరు ఉమాపతి—” అన్నాడతడు.

“మీ సమస్యేమిటి?”

అతడు సీతమ్మ, రాజమ్మల వంక అనుమానంగా

చూశాడు.

"వాళ్ళు నా అసిస్టెంట్లు, కడు సమర్థులు—" అన్నాడు వెంకన్న.

"ఆ విషయం వాళ్ళుకూడా చెప్పుకున్నారు—" అన్నాడుమాపతి.

"మీ సమస్యేమిటో చెప్పండి—...." అన్నాడు వెంకన్న.

"వీళ్ళముందు చెప్పాలంటే నాకు మొహమాటంగా ఉంది. మనమిద్దరూ యేకాంతంలో మాట్లాడుకుందాం—" అన్నాడుమాపతి.

"నా భార్యతో ఉన్నప్పుడు కూడా వీళ్ళు నా యేకాంతానికి భంగం కలిగించరు. వీళ్ళిక్కడ లేరనే అనుకోండి. నా అసిస్టెంట్సుగా ఎంత సమర్థులో— ఏకాంత విషయాల్లో అంత మొద్దులు. మీరు మీ సమస్య చెప్పకోండి—" అన్నాడు వెంకన్న.

"మా యింటి పక్కనే ఓ ముసలాయన కొత్తగా అద్దెకు దిగాడు ఆయన భార్య మహా పడుచుది—" అంటూ ప్రారంభించాడుమాపతి.

అతడు చెబుతూంటే నోట్సులా సీతమ్మ, రాధమ్మ— ఇద్దరూ రాసుకుని పోతున్నారు.

ముసలాయన పేరు రామకృష్ణయ్య. ఆయన వయసు అరవైకి తక్కువుండదు. ఆయన భార్య వేణి—ఆయనకు మనుమరాలులా కనబడుతుంది. పదహారేళ్ళ పిల్లలా కనబడుతుంది కానీ ఎట్టి పరిస్థితుల్లోనూ ఆమె వయసు ఇరవై దాటదు. తీర్చిదిద్దినట్లుంటుందామె అవయవాల పొందిక.

చెప్పాలంటే ఆమెది అద్భుత సౌందర్యం. ఒకసారి

ఆమెను చూసినవారు మరోసారి చూడకుండా ఉండలేరు. మరోసారి చూసినవారు చిరునవ్వు నవ్వకుండా వుండలేరు. చిరునవ్వు నవ్వినవారు పలకరించకుండా ఉండలేరు. అంతవరకూ చెప్పి ఊరుకోవడం మర్యాద.

వేణి కేవలం సౌందర్యవతి మాత్రమే కాక — ఒక ముసలివాడికి పడుచు భార్య కావడంవల్ల చాలామందినామె ఆకర్షించింది. ఎందరికో ఆమె అంటే సానుభూతి. ఆ సానుభూతిలో స్వార్థముంది.

కానీ వేణి ఈ కాలంలో పుట్టవలసిన యువతి కాదు. ఆమె పరమ నిష్టాగరిష్ఠురాలు. మహాపతివ్రత.

ఏడు గజాల చీర కడుతుంది. ఆమె శరీరాన్ని కప్పడానికి మూడు గజాల చీర చాలు. ముఖానికి రూపాయి కాసంత బొట్టు పెడుతుంది. ఆ బొట్టు ఆమె నుదుట దీపంలా ప్రకాశిస్తూంటుంది. పనులన్నీ మడిగా చేసుకుంటుంది. పరపురుషులామెకు కొడుకుతో సమానం.

నలభై ఏళ్ళ ఉమాపతినికూడా — ఆమె "బాబూ!" అని పిలుస్తుంది తప్ప పెద్దవాడిగా గుర్తించి సిగ్గుపడదు.

ఆమె కట్టు, బొట్టు — ఆమె వయసును దాచడంలేదు.

ఆమె చూపులు, మాటలు — ఆమెపట్ల ఆకర్షణను తొలగించడంలేదు.

ఆమెదంతా నాటకమని చాలామంది యువకుల భావన. చాటుగా కొందరూ, బహిర్గతంగానే కొందరూ ఆమె గురించి ప్రయత్నించి దెబ్బలు తిన్నారు.

వేణి నిప్పులాంటిదన్న వాడుక అచిరకాలంలోనే ప్రచారంలోకి వచ్చింది. ఆ వాడుకనెందరు నమ్మారో తెలియదుకానీ ఉమాపతి మాత్రం నమ్మాడు.

"చాలా విచిత్రంగా వుంది. కానీ ఇందులో మీ

సమస్యేమిటి?" అన్నాడు వెంకన్న ఆశ్చర్యపడుతూ.

"అదీ చెబుతాను—వినండి—" అన్నాడుమాపతి.

వేణికి భర్తంటే గౌరవమూ, భయభక్తులు మాత్రమే కాదు ప్రేమాభిమానాలుకూడా వున్నాయి. అతణ్ని తన భర్తగా చెప్పుకునేందుకూ, అతడి పక్క నిలబడడానికీ ఆమె ఏమాత్రమూ ఇబ్బంది ఫీలవదు. తన భర్తకాట్టే వయసులేదనీ ఆమె అనదు. అతడి పేరు వింటే సిగ్గుపడుతుంది. అతణ్ని తల్చుకోగానే ఆమె కళ్ళు మెరుస్తాయి.

అలాగని రామకృష్ణయ్య భార్యను అబ్బురంగా చూసుకోడు. ఆ విషయంలో ఆయన చాలామంది ముసలి మొగుళ్ళకు విరుద్ధం. అసలతడు భార్యను వెన్నంటి తిరగడు. ఆమె చేసిన ప్రతి పనిలోనూ ఏదో వంక పెట్టి సాధిస్తూంటాడు. ఆమె గుణగణాల్ని మెచ్చుకోడు. మాటిమాటికీ చనిపోయిన తన భార్యతో పోల్చి—అది చావడం నా దురదృష్టం—అంటూంటాడు. అందుకు వేణి తప్పు పట్టదు. చనిపోయిన అతడి భార్య స్థాయికి తా నెదగాలని ఆమె తాపత్రయం. భర్త విసుక్కుంటే ఆమెకంతా సహజంగానే వుంటుంది.

వేణి సాధారణంగా ఆ వీధిలోని ముసలి ఆడవాళ్ళతోనే కబుర్లు చెప్పేది. వాళ్ళతోనే ఆమెకు సరిపోయేది. వాళ్ళప్పుడప్పుడామె పై జాలిపడి—"మీవారికి కోపం మరీ యెక్కువ—" అనేవారు.

వేణి వెంటనే—"అందుకాయన్ను తప్పుపట్టడానికి లేదండీ—నన్ను పెళ్ళాడాకే వారికి కోపం పెరిగింది. తాయారమ్మక్కయ్యమీద ఎప్పుడూ కోపగించుకునేవారు కారు—" అనేది.

తాయారమ్మక్కయ్యంటే రామకృష్ణయ్య మొదటి భార్య. తాయారు తాయారంటూ ఇప్పటికీ ముసలాయన ఆమెను తల్చుకుంటూనే వుంటాడు.

రామకృష్ణయ్యా, వేణీ—ఇరుగుపొరుగువాళ్ళట. చిన్నప్పట్నించీ ఆ రెండు కుటుంబాలకీ బాగా పరిచయమట. వేణికి ముసలాయనంటే గొప్ప అకర్షణగా వుండేదట. ఇంట్లో యెవరికే ఇబ్బందొచ్చినా వేణి వెళ్ళి సాయం చేసేదిట. ఆమె తాయారమ్మను అక్కా అనీ—రామకృష్ణయ్యను బావా అనీ పిలిచేదిట. రామకృష్ణయ్య ఆమెతో సరసాలాడినా ఎవరూ పట్టించుకునేవారు కాదు. వారి వయోభేదమలాంటిది.

ఆ ముసలి దంపతులకు ముగ్గురు పిల్లలు ముగ్గురూ మంచి పొజిషన్స్‌లో వున్నారు. ఏణ్ణర్థం క్రితం తాయారమ్మ పోయింది. ఆమె భర్తకన్ని పనులూ చూసుకునేది. రామకృష్ణయ్యకు చేయి విరిగినట్లయింది. అప్పుడు వేణికి రామకృష్ణయ్యను పెళ్ళిచేసుకోవాలనిపించింది. ఇదామె యింట్లో గొప్ప సంచలనాన్ని సృష్టించింది.

"చేసుకుంటే ఆయన్నే చేసుకుంటాను. లేకపోతే నాకీ జన్మకు పెళ్ళివద్దు—" అని కుండ బద్దలు కొట్టినట్లు చెప్పింది వేణి.

రామకృష్ణయ్య దగ్గర బాగా డబ్బుంది. ఆయనకు వేణి కుటుంబంవారు బాగా డబ్బు బాకీ వున్నారు. అది చెల్లు వేసి రామకృష్ణయ్య ఆమెను పెళ్ళిచేసుకున్నాడు.

ఇది రామకృష్ణ యింట్లోనూ గొప్ప సంచలనాన్ని సృష్టించింది. పిల్లలు ముగ్గురూ పూర్తిగా ఆయనతో తెగతెంపులు చేసుకున్నారు.

రామకృష్ణయ్యకూడా తాయారు జ్ఞాపకాలు బాధి

త్తున్నాయని అక్కణ్ణించి మకాం మార్చి—ఇక్కడకు వచ్చాడు ఇక్కడ వారికి సుఖంగానే గడిచిపోతోంది.

"మీరు కథ చెబుతున్నారు. సమస్య చెప్పడంలేదు" అన్నాడు వెంకన్న.

"నా సమస్య ఈ కథలోంచే పుట్టుకొచ్చింది—" అన్నాడుమాపతి.

"కాస్త త్వరగా చెప్పండి—" అన్నాడు వెంకన్న.

"నా సమస్య మీ కర్థం కావాలంటే ఈ కథ క్షుణ్ణంగా వినాలి. అందుకే ఇదంతా చెబుతున్నాను-" అన్నాడు మాపతి.

ఉమాపతికి పదహారేళ్ళ కూతురు, పన్నెండేళ్ళ కొడుకు వున్నారు. అతడి వయసు నలభై నాలుగు. కొడుకు ఆరేళ్ళ వయసులో ఉండగా భార్య పోయిందతడికి. ఆ తర్వాత పిల్లలను తనే తల్లీ తండ్రీ అయి పెంచాడు.

చాలామందతణ్ని మళ్ళీ పెళ్ళిచేసుకోమన్నారు. ఉమాపతి ఒప్పుకోలేదు.

"సవతి తల్లి పిల్లల్ని బాధపెడుతుందనా?" అన్నాడు వెంకన్న.

"అలాంటి భయం నాకు లేదు. ఆ నీపాస్తులకు లోటులేదు నాకు. అయినవాళ్ళూ బోలెడుమందున్నారు. అవసరమైతే పిల్లల్ని వాళ్ళాదరిస్తారు అదీకాక అమ్మాయి కెలాగూ పెళ్ళిచేస్తే అత్తారింటి కెళ్ళిపోతుంది. అబ్బాయి కూడా పెద్ద చదువుల్లోకి వస్తే బయటకు వెళ్ళిపోతాడు. నాకింకా బోలెడు జీవితముంది. రామకృష్ణయ్య కుటుంబాన్ని చూసేకనే నేను మళ్ళీ పెళ్ళిచేసుకోవాలనుకున్నాను...."

"ఎందుకని?"

"విధించేద్దా ఫలితం దక్కాలంటారు. నేను పెళ్ళి చేసుకుంటే నా వయసుకు తగ్గట్లు ఏనలభై యేళ్ళావిడనో, రెండో పెళ్ళి మనిషినో చేసుకోలేను...." అని సీతమ్మ, రాజమ్మలక్కడున్నందున కాస్త ఇబ్బందిపడుతూ— "చేసుకుంటే చిన్నమ్మాయినే చేసుకుంటాను. అందువల్ల చాలా యిబ్బందు లుంటాయని భయపడి సందేహించాను. ఇప్పుడు రామకృష్ణయ్య సంసారం చూసేక-మన దేశంలో అరవైయేళ్ళ ముసుణ్ణికూడా అబ్బురంగా చూసుకునే చిన్నవయసు ఆడపిల్లలున్నారని ధైర్యం వచ్చింది. నేనూ అలాంటి పిల్లనే చేసుకుందామనుకుంటున్నాను. రామ కృష్ణయ్యతో పోలిస్తే నా వయసు బాగా తక్కువ—" అన్నాడుమాపతి.

"ఇంతకీ నేను మీకేం చేయాలి?"

"మీరు నాకు రెండువిధాల సాయపడాలి...."

వెంకన్నతో పాటు సీతమ్మ, రాజమ్మకూడా అతడు చెప్పబోయేది వినడానికి కుతూహలపడ్డారు.

ఉమాపతి చెప్పడానికి కాసేపు తటపటాయించి చివరకు ధైర్యంచేసి—"రామకృష్ణయ్య అంత వయసులోకూడా తన పెళ్ళాన్నెలా ఆకట్టుకున్నాడు? ఆ రహస్యం తెలుసుకుని మీరు నాకు చెప్పాలి!" అన్నాడుమాపతి.

"చాలా బాగుంది. ఇందుకు మీరే మానసిక నిపుణుడినో సంప్రదించాలి. వైద్యుడి సలహా తీసుకోవాలి. డిటెక్టివు దగ్గరకు వచ్చి ఏం ప్రయోజనం?" అన్నాడు వెంకన్న.

"ఉంది—" అన్నాడుమాపతి-"పాశ్చాత్య దేశాల్లో డెభ్భయేళ్ళవాడు పదిహేడేళ్ళమ్మాయిని పెళ్ళి చేసు

కున్నా ఎవరూ ఘోరమో, నేరమో, జరిగిందనరు. అదొక వింతగా చెప్పుకుంటారు తప్ప అన్యాయంగా భావించరు. మన దేశంలో అలా కాదు. ముసలాడు పెళ్ళి చేసుకుంటే వాడేదో మహాఘోరం చేసినట్లు చూస్తారు. అందులో న్యాయమెంతో నాకు తెలియదు. వయోభేదం దంపతులకెక్కువుండకూడదా? డబ్బున్నవాడు పడుచు పిల్లను చేసుకోవాలనుకుంటే ఎగతాళి ఎందుకు చేస్తారు? ఇలాంటి ప్రశ్నలు నన్ను తరచుగా బాధిస్తూండేవి.

ఇప్పుడు రామకృష్ణయ్య, వేణి — ఇద్దరూ యెంతో అన్యోన్యంగా కాపురం చేసుకుంటున్నారు. ఈ సమాజం గురించి ఇద్దరూ అంతగా పట్టించుకోవడంలేదు. వేణి తన భర్తనంతలా ఎలా ఆరాధించగల్గుతోంది? అందులో అసహజత్వం లేదూ! ఆ అసహజత్వానికి కారణమేమిటి? నిజంగా రామకృష్ణయ్యలో వేణికంత ఆకర్షణ వున్నదా? లేక — రామకృష్ణయ్య ఎవరికీ తెలియకుండా రింగ్ మాస్టర్ సర్కస్ జంతువుల్నదుపు చేసినట్లామెను రహస్యంగా బాధలు పెడుతున్నాడా? అదే నిజమైతే ఆమెనతడి బారినుంచి రక్షించాలి కదా!"

వెంకన్న విసుగ్గా — "దంపతులన్యోన్యంగా కాపురం చేసుకుంటుంటే అనుమానించి కేసులు పెట్టేంత తీరుబడి నాకు లేదు...." అన్నాడు.

ఆ వెనువెంటనే బల్లమీద ఫోన్ మ్రోగింది.

వెంకన్న ఫోనందుకొని — "ఏమిటి దేవీ!" అన్నాడు. అది వంటింట్లోంచే వచ్చిందని అతడికి తెలుసు.

"మీరీ కేసు తీసుకోండి —" అంది పద్మావతి.

"ఎందుకు?"

"ఇందాకా నేను మీతో ఏం చెప్పాను? రెండో

పెళ్ళైవారైతే పెళ్ళాం చుట్టూ తిరుగుతాడని! ఇప్పుడా అరవై యేళ్ళ మొగాడివాపిల్ల అంతలా ఆరాధిస్తో దంటే ఏదో తిరకాసుంది. ఆడపిల్లలకన్యాయం జరిగితే నేనూరుకోలేను...." అంది పద్మావతి.

"కానీ...." ఏదో అనపోయాడు వెంకన్న.

"మీరు కేసు తీసుకోండి—" అని ఫోన్ పెట్టేసింది పద్మావతి.

వెంకన్న తనూ ఫోన్ పెట్టేసి—"మీవు నావల్ల కావాల్సిన రెండో సాయం చెప్పండి—" అన్నాడు.

"అంటే మొదటిదాని కొప్పుకున్నారన్నమాట...." అన్నాడుమాపతి సంతోషంగా—"అయితే మీరు నాకోసం వేణిలాంటి పిల్లను చూసిపెట్టాలి. ఎంత ఫీజడిగినా యిస్తాను...."

"నేనేం పెళ్ళిళ్ళ పేరయ్యననుకున్నారా?" అన్నాడు వెంకన్న కోపంగా.

"ఇది పేరయ్యలవల్లనయ్యే పనికాదు. మీలాంటి వారి వల్లనే కావాలి..."

"డిసీజ్ టూమచ్!" అన్నాడు వెంకన్న.

సీతమ్మ, రాజమ్మ పరస్పరం ఒకరినొకరు చూసి నవ్వుకున్నారు.

"ఎందుకని?"

"నేనిప్పుడు కనపడిన ప్రతి ఆడపిల్ల వెంటాబడి—వేణిలాంటిదానివా.... వేణిలాంటిదానివా....,అనడుగుతూ పోవాలి...."

"మీకంత శ్రమలేదండీ! చాముండేశ్వరి అని ఓ అమ్మాయుంది. ఆమె అడ్రసిస్తాను. ఆమె నన్ను పెళ్ళి చేసుకోవాలని తహతహలాడుతోంది. ఆమె నన్ను

ప్రేమిస్తున్నట్టుకూడా తెలిసింది. ఆ ప్రేమ నిజమా, నటనా అన్నది తెలుసుకోవాలి మీరు...." అన్నాడుమాపతి.

"సరే—" అన్నాడు వెంకన్న.

ఉమాపతి వెంకన్నకు అడ్వాన్సుగా వెయ్యిరూపాయలు ఫీజు ఇచ్చాడు. తన అడ్రసు — చాముండేశ్వరి అడ్రసు—ఇచ్చాడు.

## 4

ఉమాపతి వెళ్ళిపోయేక వెంకన్నకు లోపలికి పిలుపు వచ్చింది.

కంగారుగా వెళ్ళాడతడు. వెళుతూనే అతడడిగిన మొదటి ప్రశ్న—"పచ్చడి రుబ్బడం అయిపోయిందా?" అని.

"కంగారు పడకండి. మిమ్మల్నందుకు పిలవలేదు...."

"మరెందుకు?"

"మొదటి సాయానికి తటపటాయించారు. రెండో సాయానికి వెంటనే ఒప్పేసుకున్నారు. ఆపిల్లను కల్పుకొని కాసేపు కబుర్లు చెప్పొచ్చనేగా?" అంది పద్మావతి.

వెంకన్న ఉక్రోషంగా—"అదే నిజమైతే మొదటి కేసులోనూ తటపటాయించక్కర్లేదు. వేణితో మాట్లాడవచ్చుగా—" అన్నాడు.

"వేణి ఎలాంటిదో ఉమాపతి చెప్పాడు మీకు. వాళ్ళింటికి వెళ్ళినా ఆమె మిమ్మల్ని బాబూ, నాయనా అని పలకరిస్తుంది. భర్తనంటున్నది కబుర్లకు...."

"అయితే నన్నిప్పుడేం చేయమంటావు?"

"చాముండేశ్వరితో మాట్లాడ్డానికి సీతమ్మనో, రాజమ్మనో పంపించండి...."

"వేణితో నేను మాట్లాడాలా?"

"అబ్బా—ఆశ! ఆమెతో స్వయంగా నేను మాట్లాడతాను...."

"ఈ కేసు నీదా—నాదా?" అన్నాడు వెంకన్న చిరాగ్గా.

"కేసు మీదెందుకవుతుంది—నాదే? ఇది డిటెక్టివ్ పద్మావతీదేవి పరిశోధిస్తుంది. అసిస్టెంటు వెంకన్న...." అంది పద్మావతి.

"అయితే నేనింట్లో కూర్చుంటాను — గోళ్ళు తీసుకుంటూ...."

"ఈ రోజు మంగళవారం—గోళ్ళు తీసుకుందుకు వీల్లేదు. అయినా నేను మీకులాంటి బాస్‌ను కాదు. నా అసిస్టెంట్సుకు చేతినిండా పనుంటుంది—...."

"దేవీ—ఆజ్ఞ!" అన్నాడు వెంకన్న.

"ముందు మీ అసిస్టెంట్సును చాముండేశ్వరింటికి పంపించండి...."

"ఇద్దర్నీనా?"

"అవును....?"

"ఇందాకా ఒక్కర్నే అన్నావు...."

"మీరు సరేస్తారేమోనని చూశాను. కానీ, మీకంత తెలివేదీ?"

"ఇద్దరెందుకు?"

"ఎందుకా?" అంటూ వివరించింది పద్మావతీదేవి.

"అయితే మనమిద్దరం రామకృష్ణయ్యింటికి వెడదాం."

"హమ్మయ్య—....ఇప్పటికి వేణి పేరు వదిలి రామ

కృష్ణయ్యా నడం మొదలు పెట్టారు. అయినా పెళ్ళికి వెడుతూ పిల్లిని చంకన పెట్టుకు వెళ్ళినట్లు-మీరెందుకూ నాతో.... ఇంట్లో కూర్చుని గోళ్ళు తీసుకోండి—...."

"ఇందాకా మంగళవారమన్నావు...."

"నిజం చేసే ఈ రోజు మంగళవారమైపోతుందా? ఈ వేళ మంగళవారం కాదు బుధవారం...." అంది పద్మావతీదేవి.

"కానీ— దేవీ! ఈరోజు నిజంగా మంగళవారమే."

"నేను మీకు బాస్‌ను. నేను బుధవారమంటే మీకూ బుధవారమే!" అంది పద్మావతీదేవి హుందాగా.

వెంకన్న మాట్లాడలేదు.

"మాట్లాడరేమండీ?" అంది పద్మావతి.

"ఈరోజు నీ మాటలకెదురు చెప్పను. నువ్వొచ్చేసరికి వంటకూడా చేసి నీపట్ల నాకుగల ప్రేమను ఋజువు చేసుకుంటాను...." అన్నాడు వెంకన్న.

# 5

"ఎవరో తలుపు తడుతున్నారు చూడమ్మా!" అంది జానకమ్మ. ఆ సమయంలో ఇంట్లో ఆవిడ కాక కూతురు చాముండేశ్వరి మాత్రమే వుంది.

చాముండేశ్వరి వెళ్ళి తలుపు తీసేసరికి సీతమ్మ, రాజమ్మ కనిపించారు. వాళ్ళెవరో ఆమెకు తెలియలేదు.

"నువ్వేనా చాముండేశ్వరి?!" అంది సీతమ్మ.

"అవును— నేనే—కానీ మీరెవ్వరో నాకు తెలియదు—" అంది చాముండేశ్వరి ఆశ్చర్యంగా.

"కాసేపు కూర్చుని మాట్లాడుకుంటే అన్నీ తెలుస్తాయి' అంది రాజమ్మ.

చాముండేశ్వరి వాళ్ళకోసం చాప తెచ్చి వేసింది.

"ఎవరే—వచ్చింది!" అంది లోపల్నుంచే చాముం డేశ్వరి తల్లి.

"నువ్వు పూజచేసుకో — వచ్చినవాళ్ళు నాకోసం వచ్చారు—" అంది చాముండేశ్వరి. అప్పటికే సీతమ్మ, రాజమ్మ చాపమీద కూర్చున్నారు.

చాముండేశ్వరి వాళ్ళ పక్కనే కూర్చుంది.

"నువ్వు పోతపోసిన బంగారు బొమ్మలా వున్నావు-" అంది సీతమ్మ.

చాముండేశ్వరి నవ్వి — "అందుకే నాకు బంగారపు దుద్దులుకూడా లేవు. నేను పెట్టుకున్న రింగులు నకిలీవి-" అంది.

ఆమె నవ్వులో, ఆమె మాటలో ఆమె పేదరికం స్పష్టంగా గోచరిస్తోంది.

అతి తక్కువ వ్యవధిలో తన పేదరికం గురించి చాముండేశ్వరి వాళ్ళకు చాలా వివరాలిచ్చింది.

చాముండేశ్వరి తండ్రికి నెలకు ఏడొందల ఆదాయం. ఆయనకు నలుగురాడపిల్లల తర్వాత ఓ కొడుకు. పెద్ద కూతుళ్ళిద్దరికీ గంతకు తగ్గ సంబంధాలు చేశాడు. వాళ్ళు ఏదోవిధంగా బ్రతుకుతున్నామా అన్నట్లు సంసారాలీడు స్తున్నారు. మూడో కూతురు తన దారి తను చూసుకో వాలనుకుంది. ఆమెను మంచి మాటలతో ఓ ధనికుల కుర్రాడు లోబర్చుకొని తర్వాత ముఖం చూడలేదు. ఆమె ఆత్మహత్య చేసుకుంది.

ఆడపిల్ల ఎంత అందంగా వున్నా—డబ్బులేనిదే ఆమె అందం రాణించదు. జీవితంలో అందం కూడు పెట్టదు.

ఈ పరమ సత్యాన్ని అతి చిన్నవయసులోనే గ్రహిం చేసింది చాముండేశ్వరి.

ఇప్పుడామెకు ఇరవై యేళ్ళు. రెండో పెళ్ళివాణ్ణి చేసుకోవాలనుకుంటోంది — మనస్ఫూర్తిగా! సంబంధం కూడా వచ్చింది. చెప్పాలంటే తనే వెతికి ఆ సంబంధం పట్టింది.

సీతమ్మ ఆశ్చర్యపోతున్నట్లు నటించి—"అతడి వయసెంతేమిటి?" అంది.

"ఏమో నలభై దాటేయుట...."

"నీకు బాధగా లేదూ?" అంది రాజమ్మ.

"బాధ ఎందుకు?"

"నీలాంటి బంగారు బొమ్మకు పాతికేళ్ళ కుర్రాడు కావాలిగానీ...."

చాముండేశ్వరి ముఖం ఎర్రబడింది — "పాతికేళ్ళ కుర్రాళ్ళకు నేను, నా అందం అక్కర్లేదు. డబ్బుకావాలి. వాళ్ళంటే నాకసహ్యం. అవ్వా కావాలి—బువ్వా కావాలంటే ఎలా కుదురుతుంది? నన్నడిగితే వయసు, అందం ఉండి డబ్బులేని అమ్మాయిలందరూ—పైసా కట్నం కూడా ఇవ్వకూడదు. కట్నం ఇచ్చే అమ్మాయిలు పరమ కురూపులై వుండాలి—"

ఆమె ఆవేశానికాశ్చర్యపడుతూ —"కట్నమడిగారని అలిగి రెండో పెళ్ళివాణ్ని పెళ్ళాడితే—అందువల్ల లాభం మగాళ్ళకే గానీ ఆడాళ్ళకుండదు—" అంది సీతమ్మ.

"ఎందుకుండదూ? మగాడు వయసులో కాస్త పెద్దయితే పెళ్ళాన్ని పురూపంగా చూసుకుంటాడు. యిటొచ్చి అది మనం దుర్వినియోగం చేసుకోకూడదు. మనంమంచిగా ఉంటే అందలమే ఎక్కిస్తాడు. ఆడపిల్ల ఈడైనా మగవాళ్ళతో సుఖపడుతుందని నేననుకోను ఎందుకంటే ఇద్దరక్కల్ని చూస్తున్నానుగదా — వాళ్ళకో అచ్చటా,

ముచ్చటా తీరలేదు. ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్న వాళ్ళలా ఏడుపుగొట్టు ముఖాలతో ఉంటారు. అందుకే నా అభిరుచికి అలాంటి బ్రతుకుకంటె చావు మేలనుకుంది. నాకైతే చావాలని లేదు. కోరినవన్నీ కొనుక్కొని— దర్జాగా బ్రతకాలి. మొగుడి వయసు గురించిన ఆలోచనే లేదు నాకు ....”

అప్పుడు రాజమ్మ మరింత ఆశ్చర్యపడుతూ— “మే మెవరో తెలుసుకోకుండా__అసలు మే మెవరమని అడక్కుండా మాకివన్నీ చెబుతున్నావు. అసలు మేమిక్కడికెందుకొచ్చామో తెలుసా?” అంది.

“అన్నీ తెలుసు నాకు— ...” అంది చాముండేశ్వరి.

సీతమ్మ, రాజమ్మ ముఖముఖాలు చూసుకున్నారు.

“ఎలా తెలుసు? మే మేమీ చెప్పలేదే!” అంది రాజమ్మ.

“చెప్పక్కర్లేదు—రోజూ జరుగుతున్న అనుభవమే యిది నాకు!” అంది చాముండేశ్వరి.

ఉమాపతి గురించి ఎలాగో తెలిసింది చాముండేశ్వరికి. అతడ్ని పెళ్ళిచేసుకుంటానని తనే యింట్లో చెప్పింది. అతనోసారి వచ్చి పిల్లను చూసుకున్నాడు. స్వయంగా చాముండేశ్వరితో మాట్లాడాడు. ఆమె అతడితో— “మీరు నా కంటికి పాతికేళ్ళ కుర్రాడిలా కనపడుతున్నారు—” అని చెప్పింది. అతడు తన్ను పెళ్ళి చేసుకుంటే అది తన అదృష్టంగా భావిస్తానని చెప్పింది. చేసుకోకపోతే తన దురదృష్టమని కూడా చెప్పింది. డబ్బుతో సుఖంగా జీవించాలని తనకున్న అభిలాష గురించి చెప్పింది. యువకులంటే తనకున్న అసహ్యం వివరించింది.

గంటసేపామెను ఇంటర్వ్యూచేసి పై విశేషాలన్నీ

తెలుసుకున్నాక ఉమాపతి తృప్తిపడినట్లులేదు. రోజూ అతడి పనుపున యెవరో ఒకరు వచ్చి ఆమెతో కాసేపు మాట్లాడి రెండో పెళ్ళి వాడిగురించి ఆమె అభిప్రాయాలు తెలుసుకుంటున్నారు. మొదట్లో చాముండేశ్వరికిది అర్థం కాలేదు. ఓ వారంరోజులలా జరిగేక అది ఉమాపతి చేస్తున్న పనేనని అర్థమయింది. ఆ తర్వాతనుంచి వచ్చిన వాళ్ళెవరో తెలుసుకోకుండానే ఆమె కూర్చోబెట్టి తన అభిప్రాయాలు చెప్పి పంపించేస్తోంది.

"అతనికంతమంది మనుషులెక్కడ్నించి వస్తారు?" అంది సీతమ్మ.

"అదేమీ పెద్ద కష్టంకాదు. పనిచేసి డబ్బు సంపాదించాలనుకొనే ఆడపిల్లలందరూ లేడీస్ సర్వీస్ సెంటర్లో తమ పేరు నమోదు చేసుకొంటారు. అదోక ఎంప్లాయ్ మెంట్ ఎక్స్ చేంజ్ వంటిది. అక్కడనుంచే సబ్బుల కంపెనీలవాళ్ళు, హెయిరాయిల్ కంపెనీలవాళ్ళు తమ తమ సరుకులను ఇంటింటా తిరిగి అమ్మడానికి ఆడపిల్లల నెన్నుకొంటారు. అంతేకాదు — షాపుల్లో సేల్సుగరల్సు, హోటల్సులో రిసెప్షనిస్టు పోస్టులకూడా లేడీస్ సర్వీస్ సెంటర్ అమ్మాయిల్ని పంపుతుంది.

మర్యాదగల కుటుంబాలవారందరూ ఇలాంటి విషయాల్లో లేడీస్ సర్వీస్ సెంటర్ మీద ఆధారపడతారు. ఉద్యోగం వచ్చేకకూడా ఆడపిల్ల మానసంరక్షణ బాధ్యత లేడీస్ సర్వీస్ సెంటర్ తీసుకుంటుంది. నగరంలో ఈ సంస్థకు మంచి పేరుంది. తన పనికి ఉమాపతిగారుకూడా ఈ సంస్థ నెన్నుకున్నారు రోజుకి మనిషికి పదిరూపాయలిస్తున్నారాయన ఈ పనికి. అంటే నా గురించి ఇరవై రూపాయలు ఖర్చుపెడుతున్నారాయన రోజుకి. అంతే

కాదు. ఆ పిల్లలొక పాకెట్ టేపురికార్డరుకూడా తెస్తున్నారు. మా సంభాషణ అందులో రికార్డవుతుంది. అదాయన వింటారు—..."

"ఇవన్నీ ఎలా తెలుసుకున్నావు?"

"డిటెక్షన్ చేసి!" అంది చాముండేశ్వరి—"ఒక రోజున మా యింటికొచ్చిన పిల్లల్ని వెంటాడాను. వాళ్ళేం చేస్తున్నారో తెలుసుకొన్నాను. వాళ్ళుమాపతి గారింటికి వెళ్లారు. వాళ్ళ వెనుకే నేనూ వెళ్ళాను. ఆయన తెల్లబోయి నిజం ఒప్పేసుకొన్నారు...."

"ఆ తర్వాత మానేయలేదా మరి!"

"లేదు. ఉధృతం తగ్గిందంతే! రోజూ వచ్చే వాళ్ళిప్పుడు మూడు నాలుగురోజులకొకసారి వస్తున్నారు. నేనాయన్నే వెళ్ళడిగాను. ఆయన చెప్పింది వింటే నాకు జాలివేసింది—"

"ఏం చెప్పారూ?"

"నీ వయసు అందమైన ఆడపిల్ల నన్నే ఆరాధిస్తూ మాట్లాడి—యువతరాన్ని తిడుతూంటే వినడానికి నాకెంతో ఆహ్లాదకరంగా ఉంది. అనీ—నా సమక్షంలో కాకుండా ఇతరుల ఎదుట ...అన్నారాయన—" అంది చాముండేశ్వరి.

ఆమె వివరించగా సీతమ్మకూ, రాజమ్మకూ ఒక విషయం అర్థమయింది.

ఉమాపతికి పెళ్ళి గురించి ఎంత మనసుగా వుందో, అంత సంకోచమూ ఉంది. అతడు చాముండేశ్వరి తనంటే నిజంగా ఇష్టపడుతున్నదీ లేనిదీ తెలుసుకోందుకు విశ్వ ప్రయత్నాలు చేస్తున్నాడు. చాముండేశ్వరి తన్ను ప్రేమిస్తున్నదని వీలైనంత ఎక్కువమందికి తెలియబర్చాలనీ

చూస్తున్నాడు. ఇద్దరందమైన ఆడపిల్లలముందో అందమైన ఆడపిల్ల తనను పొగడాలన్న ఆయన మనస్తత్వం ఆ వయసుకు విచిత్ర మేమీ కాదు.

"నువ్వనుకొన్నట్లు మేము ఉమాపతి పంపినవాళ్ళం కాదు. ఉమెన్స్ లిబ్ వాళ్ళం...."

"అంటే?" అంది చాముండేశ్వరి.

"ఇష్టపడ్డానని నీ మనసును మభ్యపెట్టుకొని-నీకంటే ఇరవయ్యేళ్ళకు పైగా పెద్దయినవాడ్ని పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నావు. నీ మనసు మార్చడానికి మేమొచ్చాం."

"అందువల్ల మీకు ప్రయోజనం?"

"స్త్రీలకు న్యాయం చేకూరుతుంది...."

"అందువల్ల నాకు ప్రయోజనం....?"

"నీవు స్త్రీవి కదా...."

చాముండేశ్వరి నవ్వి—"పెళ్ళంటే సహజీవనానికని గ్రహించక తలిదండ్రులముందు గంగిరెద్దులా తలూపి కట్నంకోసం అర్రులుచాచే వ్రరివిధవల బారినుంచి ఆడవాళ్ళను రక్షించి—అప్పుడు ఉమెన్స్ లిబ్ పేరును మీరు సార్థకం చేసుకోండి. ఉమాపతిగారు నాకు వరప్రసాదంలా లభించారు. ఆయన్నుంచి మీరు నన్ను రక్షించవసరంలేదు. ఆయన్నుంచి నాకేవిధమైన అన్యాయమూ జరగడంలేదు—" అంది.

సీతమ్మ, రాజమ్మ లేచినిలబడి ఆమెవద్ద సెలవుతీసుకొన్నారు. బయటకు వచ్చేక—"ఒక మధ్యతరగతి ఆడపిల్ల — చాముండేశ్వరిలా మాట్లాడే ఈ సమాజంలో — పెళ్ళికొచ్చిన ప్రతి యువకుడూ అవమానంతో తలదించుకోవాలి —" అంది సీతమ్మ.

"ప్రస్తుతానికి మన దేశంలో నేరాలు చేసేవాళ్ళే

తలలెత్తుక తిరుగుతున్నారు. పెద్దతలలుగా వుంటున్నారు. అటు నాడు....” అంది రాజమ్మ.

నలుగురు యువకులు దూరాన్నుంచి సీతమ్మను, రాజమ్మను చూస్తున్నారు. వెకిలిగా ఏవో వ్యాఖ్యానాలు చేస్తున్నారు.

# 6

పద్మావతీదేవి పట్టుచీర కట్టుకొని—రూపాయకాసంత బొట్టు పెట్టుకొని నిండు ముత్తయిదువలా రామకృష్ణయ్య ఇంటికి వెళ్ళింది.

వేణి ఆమెను సాదరంగా ఆహ్వానించింది.

పద్మావతి వేణివంక ఆశ్చర్యంగా చూసింది.

ఆలివ్ గ్రీన్ రంగు నేత చీర కట్టుకొన్నదామె. గోచీ పోసి కట్టుకొన్న చీరలో కూడా ఆమె లేతగానే వుంది. పండు ముత్తయిదువ వేషం వేసిన పదహారేళ్ళ పశుచులా వుందామె.

అప్రయత్నంగా ఆమె వేణికి నమస్కరించింది.

“మీరెవరో నాకు తెలియదు....” అంది వేణి.

“మీతో కాసేపు ఏకాంతంగా మాట్లాడాలి....” అంది పద్మావతి.

వేణి వీధి తలుపులు వేసింది. ఆమెను పక్కగదిలోనికి తీసుకొని వెళ్ళింది.

“నెమ్మదిగా మాట్లాడండి, మావారి ఆరోగ్యం బాగా లేదు—” అంది ఆమె.

“ఏమయింది?”

“అతీ ర్తి ”

“మందేం వాడుతున్నారు ....”

“సాంతిరసం తాగి పడుకొన్నారు. మీరేం చెప్పాలను

కొంటున్నారో చెప్పండి....”

“మీ సాయంకోరి వచ్చాను....” అంది పద్మావతి.

“ఏ విషయంలో?”

“నా వివాహమయింది. షష్ఠి పూర్తి పీటలమీట పక్కన కూర్చోడంకోసం వారు నన్ను పెళ్ళిచేసుకున్నారు....”

“అయితే?”

“నాకు జీవితం తృప్తిగాలేదు గతిలేక ఈ పెళ్ళి చేసుకున్నాను. మనసు పెడదారులు తొక్కుతోంది. ఏం చేయాలో తెలియడంలేదు. నా భర్తనీ విషయమై తరచు సాధిస్తున్నాను. ఆయనేమో తప్పంతా నాదే నంటున్నారు. నా బుద్ధి మంచిదికాదుట. అందుకే పెడదారులు తొక్కుతోందిట. అందుకుదాహరణగా మీ గురించి చెప్పారు. నేను నమ్మలేదు. ఆయన మాటల్ని చాలామంది బలపరిచారు. అందుకే మీ దగ్గరకు వచ్చాను....”

“ఎందుకు?”

“ముసలి మొగుడితో కాపురం మీకు నిజంగా తృప్తిగా వుందా?”

వేణి క్షణంకూడా ఆలోచించలేదు—“ఆయన ముసలి వాడని నాకెప్పుడూ అనిపించదు. కొన్ని సమయాల్లో అప్పుడే యౌవనంలో అడుగుపెడుతున్న యువకుడిలాగా, కొన్ని సమయాల్లో అర్థం శుభం ఎరుగని పసిపాపలాగా అనిపిస్తారు.”

“నాకూ నా భర్త అలా అనిపించాలంటే నేనేం చేయాలి?”

“ఇందులో మీరు చేయగలిగిందేమీలేదు. అంతా మీ

భర్తలో వుంటుంది...."

"అంటే?"

"భాగ్య భర్త నారాధించాలంటే—అందుకు భర్త అన్నివిధాలా సమర్థుడై వుండాలి. ఆర్థికంగా, శారీరకంగా, మానసికంగా—నా భర్తవల్ల నాకు తీరని కోరిక లేదు—" అంది వేణి.

"అంతేనా?" అంది పద్మావతి నిరుత్సాహంగా.

వేణి నవ్వి—"ఈ ప్రపంచంలో నా అంత అదృష్టవంతురాలు లేదని నే నెప్పుడూ అనుకుంటూంటాను—" అంది.

అప్పుడు పద్మావతి తన వానిటీ బ్యాగులోంచి—ఓ చిన్న సీసాతీసి—"ఇలాంటిది వాడితే మగాళ్ళకు పోగొట్టుకొన్న యౌవనం తిరిగి వస్తుందంటారు. నిజమేనా?" అంది.

వేణి ఆ సీసా అందుకొంది.

చిన్న గాజుసీసా అది. చూడ్డానికి సెంటుబాటిల్లా వుంది.

తటపటాయించకుండా మూతతీసిందామె. అంతే! మరుక్షణంలో వెనక్కి వాలిపోయింది.

పద్మావతి ముందుకు వంగి ఆమెనోసారి కదిపిచూసింది. తర్వాత సీసాను తీసుకొని తన వానిటీ బ్యాగులో పడేసుకొంది.

అప్పుడామె చుట్టూ పరిశీలించింది.

గదిలో బీరువా వుంది. తాళాలు బీరువాకే వున్నాయి.

పద్మావతి బీరువాను సమీపించి తాళంతీసి తలుపులు తెరిచింది.

లోపల వెండి సామానుంది. బట్టలున్నాయి. ఓ

పక్కగా వందరూపాయల నోట్లకట్ట వుంది. కట్టలోంచి ఓ నోటు తీసుకొందామె. తర్వాత ఓ క్షణం ఆలోచించి మొత్తం కట్టను బ్యాగులో పడేసుకొంది.

ఆ గదిలో ఆమెకింక ఆకర్షించే వస్తువేమీ కనపడ లేదు.

అప్పుడామె పక్కగదిలోకి వెళ్ళింది.

గదిలో మంచంమీద ఓ వృద్ధుడు నిద్రపోతున్నాడు.

పద్మావతి మంచాన్ని సమీపించింది.

వృద్ధుడి వీపు ఆమెవైపు తిరిగి వుంది.

గదిలో వెలుగు బాగానే వుంది.

వృద్ధుడు ముడుచుకొని పడుకొన్నాడు.

పద్మావతి వానిటీ బ్యాగులోంచి సీసా తీసింది. తన ముక్కు దగ్గర రుమాలుంచుకొని—సీసా మూత వుండగానే మంచంమీదకూ వంచబోయింది.

మెరుపువేగంతో వృద్ధుడు మంచంమీంచి లేచి ఆమె చేతిమీద ఓ దెబ్బేశాడు.

పద్మావతి వెనక్కు పడిపోయింది.

"ఎవరు నువ్వు?" అన్నాడు వృద్ధుడు.

పద్మావతి షాక్ నించింకా తేరుకోలేదు.

వృద్ధుడు మంచంమీద చతికిలబడి—"మా యింట్లో నీకేమిటి పని?" అన్నాడు.

అతడి గొంతు వణుకుతోంది. మాట నీరసంగా వుంది.

తెల్లటి గ్లాస్కోపంచెను లుంగీలా కట్టుకొన్నాడతడు. పైన చేతుల బనియన్ వుంది.

పద్మావతి ఆలోచిస్తోంది.

అతడికి తను లోపలకు వస్తానని ముందే తెలుసా? అవతలి గదిలో తనేం చేస్తున్నదీ కనిపెట్టి చూస్తు

న్నాడా?

"చెప్పు—మా యింట్లో నీకేమిటి పని?"

"నీ భార్యను సులువుగా మోసం చేశాను. నీ ఆరోగ్యం బాగోలేదు కాబట్టి నా పని సులభమైపోతుందనుకొన్నాను. ఈ రోజు నా అదృష్టం బాగోలేదు...." అంది పద్మావతి.

"నువ్వు దొంగవా?" అన్నాడు వృద్ధుడు.

"అవును—" అంది పద్మావతి తలవంచుకొని.

"ఇంకెప్పుడూ దొంగతనం చేయనని మాటిస్తే నిన్ను వదిలిపెడతాను...."

"నన్ను నువ్వు వదిలిపెడతావా?" అంది పద్మావతి ఆశ్చర్యంగా.

వృద్ధుడి కళ్ళలోకి నీళ్ళు వచ్చాయి—"పద్దెనిమిదేళ్ళ వయసప్పుడు నేనూ ఓ దొంగతనం చేయబోయి పట్టుబడ్డాను. ఓ మహానుభావుడు నన్ను దయతలచి వదిలిపెట్టడమేకాక-వ్యాపారానికి పెట్టుబడిగా కొంత అప్పు కూడా యిచ్చాడు. దాంతోనే నేను పైకివచ్చాను. అందువల్ల నాకు దొంగలంటే సదభిప్రాయమే వుంది. నీవు చూడ్డానికి చాలా మర్యాదస్తురాలిలా వున్నావు. నిన్ను చూడగానే మంచి కుటుంబంనుంచి వచ్చిన ఆడపిల్ల అనిపిస్తుంది. ఇలాగే నువ్వు జీవితం కొనసాగించావంటే తప్పక చెడిపోతావు. బాగుపడతానంటే నీకు మంచి మార్గం చూపిస్తాను. అది నా బాధ్యత...."

"మీరు నన్ను పోలీసులకు పట్టించరా?" అంది పద్మావతి ఆశ్చర్యంగా.

"అందువల్ల ప్రయోజనమేముంటుంది? నేను నిన్ను మంచిమార్గంలో పెడితే—అందులో నువ్వు పైకివస్తే—

నీ కారణంగా మరికొందరు బాగుపడవచ్చు...." అన్నాడు వృద్ధుడు.

"మీ మనసు బహుదొడ్డది. అందుకే మీ భార్య మిమ్మల్నంతలా ప్రేమిస్తోంది—" అంది పద్మావతి.

వృద్ధుడి ముఖం గంభీరంగా అయిపోయింది—"చెప్పా లంటే వేణి నాబల్లో పెరిగింది. దానికి కోసంటే వెర్రి అభిమానం. ఆ సమానూ నన్నే పెళ్ళిచేసుకొంటానం టూండేది. నేను దాన్ని మందలిస్తూండేవాడ్ని. కానీ అది నా భార్య తాయారుకంటే తిరుగుతా నా అవసరా లేమిటో, అభిరుచులేమిటో తెలియసుకొంటూండేది.

తాయారు పోగానే అది నాతో—మీ పనులు మీరు చేసుకోలేరు. ఈ వయసులో మీకు భార్య చాలా అవసరం. నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకొంటాను—అంది. నేనొప్పుకోకపోతే చచ్చిపోతాననికూడా మొండికేయ డంతో నాకీ పెళ్ళి తప్పలేదు. నాతో అదేం సుఖపడు తుందో తెలియదు. నామీద ఈగకూడా వాలనివ్వదు. నాకు లేని గొప్పలన్నీ ఆపాదిస్తుంది. ఏ జన్మలోనో నేను చేసుకొన్న పుణ్యం వేణిరూపంలో నన్ను సేవించు కుంటోంది ఏ జన్మలోనో అది చేసుకొన్న పాపం నా రూపంలో దాన్ని సాధిస్తోంది...."

పద్మావతి ఆశ్చర్యంగా ఈ కథ వింది — "మీతో పోలిస్తే ఆమె చాలా చిన్నదనుకొంటాను...." అంది.

"చెప్పాలంటే దానికి నా మునిమనుమరాలి వయసుం టుంది—...." అన్నాడు వృద్ధుడు—"నా ప్రాణాలు త్వరగాపోతే బాగుండును. నా పీడవిరగడై ఏ రెండో పెళ్ళో చేసుకుంటుందేమోనని నా ఆశ.... కానీ నా ప్రాణాలను భద్రంగా కాపాడుకోవడం నాకు తప్పనిసరి

చేసింది వేణి —"

"ఎందుకు?"

"నేనుపోతే తనూ విషం మింగి చచ్చిపోతుందిట."

"విషం మింగడమెందుకు?" అంది పద్మావతి తెలియనట్లు.

"సహగమనం చేస్తే చట్టం ఒప్పుకోదుగా.." అన్నాడు వృద్ధుడు.

ఇది చాలా విచిత్రంగా తోచింది పద్మావతికి. నిజంగానే వేణి రామకృష్ణయ్యనంతలా ప్రేమిస్తోందా? ప్రేమిస్తే ఏమిటీ విశేషం? లేక ఆమె అలా నటిస్తోందా?

రామకృష్ణయ్య వాటంచూస్తే యే క్షణంలోనైనా ప్రాణం పోయేలా వున్నాడు. అతడికి ఆస్తి బాగా ఉన్నట్లుంది. డబ్బుకోసమే ఆమె అతడ్ని పెళ్ళిచేసుకొంది. పడుచు భార్యపై ఏమాత్రం అపనమ్మకం కలిగినా అతడు ఆస్తిని వేరెవ్వరికో రాసేసే ప్రమాదముంది. అందుకని వేణి అతడ్ని ఆషాడభూతిలా నమ్మించి ఆస్తిని సంపాదించాలనుకుంటోంది. భర్త పోయేక రెండో వివాహం ఆమెకు కష్టంకాదు. అందముంది. వయసుంది. డబ్బుంది. ఏ నిరుద్యోగి యువకుడైనా ఎగిరి గంతేసి మరీ ఆమెను పెళ్ళాడతాడు.

అంతే అయుండాలి.

దీనికి రామకృష్ణయ్య ఏమంటాడో?

చెప్పడంవల్ల వేణికి నష్టం వాటిల్లదూ?

పద్మావతి వేణి గురించి యెక్కువ బాధపడలేదు. వేణి కావాలని ఈ పెళ్ళి చేసుకుంది. అంటే ఆమె వంచకురాలు. ఎవరో ఆమెకు రామకృష్ణయ్యను బలవంతంగా అంటగట్టలేదు.

పద్మావతి తన అనుమానాన్ని వృద్ధుడికి చెప్పింది.

అతడు నవ్వి—"మంచితనాన్ని సులభంగా నమ్మే సమాజం ఈ ప్రపంచంలోనే లేదు. వేణిని తప్పుగా అర్థం చేసుకున్నందుకు నిన్ను నేను తప్పుపట్టను. నువ్వు ఆమె గురించి కాక నీ గురించి ఆలోచించుకో. ముందా బీరువాలోంచి ఏం తీశావో ఇలా యిచ్చేయ్—" అన్నాడు.

"అంతా చూశావా నువ్వు?" అంది పద్మావతి ఆశ్చర్యంగా.

"లేదు. బీరువా చప్పుడైతే విన్నాను. అంతవరకూ నీ గురించి అనుమానమే రాలేదు నాకు—...." అన్నాడు రామకృష్ణయ్య.

పద్మావతి వ్యానిటీ బ్యాగు ఓపెన్ చేసి నోట్లకట్టను తీసి అతడి ముందు పెట్టి—"ఇదొక్కటే తీసుకున్నాను" అంది.

రామకృష్ణయ్య నవ్వి—"ఇంత డబ్బు తీసినదానివదే దారిన వెళ్ళిపోక — ఇంకా లోపలికెందుకు వచ్చావు? అత్యాశకుపోయి పట్టుబడ్డావు ..." అని—"సరేలే— నీకు కొంత డబ్బిస్తాను. దాంతో నీ పద్ధతి మార్చుకో. నీకింకేదైనా సాయం కావలిస్తే చేస్తాను. అడుగు—" అన్నాడు.

పద్మావతి అతడి పాదాలకు నమస్కరించి—"నువ్వు చాలా గొప్పవాడివి. నీ గొప్ప మనసు శాశ్వతంగా గుర్తించబడే ఆమె నిన్ను పెళ్ళి చేసుకుంది. నీకు వివాహమయిుండకపోతే నేనే నిన్ను పెళ్ళిచేసుకోనేదాన్నేమో........నా జీవితపథం మార్చుకొని మళ్ళీ నీకు కనిపిస్తాను...." అంది.

"అయితే నా దబ్బు నీకక్కర్లేదా?" అన్నాడు రామకృష్ణయ్య.
"వద్దు.." అని అక్కడ్నించి కదలింది పద్మావతీదేవి.

# 7

ముందు వెంకన్న తన అసిస్టెంట్ను తెచ్చిన సమాచారం విన్నాడు. వాళ్ళను మెచ్చుకొని—"ఉమాపతి విషయం నాకిప్పుడు పూర్తిగా అర్థమయింది. రెండో పెళ్ళి చేసుకుందుకతడు చాలా తటపటాయిస్తున్నాడు. కానీ అతనిది బాగా గాఢమైన కోరిక. ఆ కోరికకు బలాన్నిస్తున్నది—వేణి పాతివ్రత్య ధర్మం. చాముండేశ్వరి వేణి వంటిది కాదు. కానీ ఆమెకి మించి భర్త నారాధించ గలదు—...." అన్నాడు.
తర్వాత అతడికి లోపల్నుంచి ఫోన్ వచ్చింది.
"దేవీ—వచ్చేశావా?" అన్నాడు వెంకన్న.
"ఆఁ అన్నం కూడా వడ్డించాను—" అంది పద్మావతి.
"విశేషాలేమిటి?" ఆత్రుతగా అడిగాడు వెంకన్న.
"భోం చేస్తూ విందురుగాని...."
వెంకన్న అసిస్టెంట్లవంక చూసి—"ఇది లంచ్ టైం...." అన్నాడు.
"అందుకింకా పది నిముషాలుందిగా—...." అంది సీతమ్మ.
"టైము గురించి మరీ అంత పట్టింపుంటే వాచీని ముందుకు తిప్పుకోండి. భోజనాలయ్యాక మాత్రం వాచీని మళ్ళీ యథాప్రకారం చేసుకోండి ..." అని సలహా ఇచ్చి వెంకన్న లోపలకు వెళ్ళిపోయాడు.
అతను విశేషాలడగ్గానే—"ముందు భోజనం ప్రారంభించండి—" అంది పద్మావతి ఆజ్ఞాపిస్తున్నట్లుగా.

భార్యాభర్తలిద్దరూ టేబిల్ మీద యెదురెదురుగా కూర్చుని భోజనాలు ప్రారంభించారు.

"త్వరగా ప్రారంభించు మరి!" అన్నాడు వెంకన్న.

"ముందు మీ అసిస్టెంట్స్ం సాధించుకువచ్చారో చెప్పండి—"

వెంకన్న వివరంగా భార్యకు చెప్పాడు.

"చాముండేశ్వరికి జై !" అంది పద్మావతి.

"ఎందుకు?" అన్నాడు వెంకన్న ఆశ్చర్యంగా.

"తను చేస్తున్నది స్వార్థంకోసమేనని నిర్భయంగా చెప్పింది. కట్నాలడిగే మగాళ్ళని వెధవలని పిలిచి నిరసించింది. ఇలాంటి ఆడపిల్లల సంఖ్య దేశంలో పెరగాలి."

"మరి వేణి సంగతేమిటంటావు?"

పద్మావతి జరిగింది చెప్పి—"మీ రేమంటారు?" అంది.

వెంకన్న చిరాగ్గా ముఖం పెట్టి—"ఇంతకీ నువ్వేం తెలుసుకొచ్చినట్లు?" అన్నాడు.

"అంటే?"

"నా అసిస్టెంట్సు ఎన్నో విషయాలు సేకరించుకొని వచ్చారు. నువ్వు తెలుసుకొన్నదాంట్లో కొత్త విశేషాలేం కనబడలేదు నాకు—...." అన్నాడు వెంకన్న.

పద్మావతి ముఖం ఎర్రబడింది—"మీరు నన్ను చిన్న బుచ్చాలనుకుంటే మీతో పోల్చుకోండి. మీ అసిస్టెంట్సుతో పోల్చకండి—...."

"ఒకే పనిమీద ఇద్దరు వెళ్ళినపుడు ఇద్దర్నీ పోల్చడం తప్పనిసరి...."

"మీ అసిస్టెంట్సు వృథా అని నేనంటాను. వాళ్ళు బాగుంటారు. రోజూ వాళ్ళను చూడడం మీకు సరదా. అందుకోసం వాళ్ళకి లేని గొప్పతనాన్నంటగడతారు.

ఇంతకీ వాళ్ళు తెలుసుకవచ్చిన గొప్ప విశేషమేమిటట! అడక్కుండా అన్నీ చెప్పే అమ్మాయి చెప్పింది విని మీకు చెప్పారు. నేనేమో ఇద్దరు మహానటులున్న ఇంట్లో ప్రవేశించి గూఢచారితనం చేసివచ్చాను...." అంది పద్మావతి.

"అందువల్ల ప్రయోజనం?"

"ప్రయోజనం లేదని మీరెందుకనుకుంటున్నారు?"

"భార్యాభర్తలిద్దరూ అన్యోన్యంగా ఉండటంలోని రహస్యం ఇప్పటికీ మనకు తెలియలేదు...."

"నేను తెలుసుకొన్న కొత్త విశేషం—ముసలాడికి ఏ సామర్థ్యమూ లేదని, అతడికి భార్య వర్తమానం గురించీ, భవిష్యత్తు గురించీ చింత వుంది. కానీ అతడ్ని ప్రేమించానంటోంది. అది ఋజువుచేయడమే తన జీవిత లక్ష్యంగా పెట్టుకుంది. అందులో త్యాగం నిజంగా ప్రేమ అవునా కాదా అన్నది మాత్రం నేను తెలుసుకోలేకపోయాను."

"అక్కడ్నించి పనికొచ్చే ఆధారాలేమీ తేలేదు నువ్వు...."

"అంటే?"

"ముసలాడే ఊరివాడు?"

పద్మావతి నాలిక్కరచుకొని — "నిజమే! కానీ వాళ్ళ నడిగితే నిజం తెలియదనిపించింది నాకు. అందుకని వాళ్ళకు సంబంధించిన కాగితాలు, ఉత్తరాలు చూడాలనుకున్నాను. ఒక బీరువాలో డబ్బు, నగలు, బట్టలు వున్నాయి. ఇంకో గదికి వెళ్ళగానే ముసలాడు నన్ను పట్టేశాడు—" అంది.

"అందుకే...." అని ఏదో అనబోయి ఆగిపోయాడు వెంకన్న. భోజనాల దగ్గర భార్యను రెచ్చగొట్టడం

అతడికిష్టముండదు.

అతడందుకే అన్నందుకే పద్మావతి పెద్ద రాద్ధాంతం చేసి వుండేది. కానీ ఆమెకేదో స్ఫురించింది. ఆమె అక్కడ్నించి లేచివెళ్ళి మళ్ళీ తిరిగివచ్చింది.

అప్పుడామె చేతిలో వందరూపాయల నోటొకటుంది.

"కట్టను చూడగానే యే దొంగనోట్లో అయుంటా యేమోనని శాంపిల్‌గా ఒకటి తీసి బ్యాగులో వేసుకున్నాను. తర్వాత ఆలోచించగా—మొత్తం కట్ట తీసుకుంటే తప్పు—నన్ను దొంగననుకోరనిపించింది. నేను దొంగననుకోకపోతే వాళ్ళ అనుమానాలు రకరకాలుగా పోతాయి. గూఢచారులెప్పుడూ ఇతరులను తప్పుదారి పట్టించడానికి చూస్తారు. అందుకే మొత్తం కట్టను బ్యాగులో వేసుకున్నాను. కానీ ముసలాడా కట్ట అడిగి తీసుకున్నాడు. ఈ నోటు నా దగ్గర మిగిలింది...."

వెంకన్న యెడంచేత్తో ఆ నోటందుకొని చూశాడు. అతడి ఎక్స్‌రే కళ్ళు నోటును శ్రద్ధగా పరిశీలించాయి.

"ఇది దొంగనోటు కాదు దేవీ!" అన్నాడు వెంకన్న.

"ఎలా తెలుసు మీకు?"

"డిటెక్టివులు గూఢచారులకంటె గొప్పవారు కాబట్టి!"

"సరేలెండి — అయితే దీనివల్ల మీకు ప్రయోజనం లేదన్నమాట?"

"ఇది దొంగనోటు కాదని కచ్చితంగా చెప్పగలను. కానీ ఇది దొంగనోటని నా జ్ఞాపకశక్తి చెబుతోంది..." అన్నాడు వెంకన్న సాలోచనగా.

"అంటే?"

"అర్థంచేసుకుందుకు ప్రయత్నించు—" అన్నాడు

వెంకన్న.

"నాకర్థం కావడంలేదు—" అంది పద్మావతి

"ఈ కేసు రహస్యమంతా అందులోనే వుంది. నువ్వు తెచ్చిన ఆధారం నాకు చాలా విలువైనది. మంచి కేసును పట్టిచ్చినందుకు ఉమాపతికి ధన్యవాదాలు చెప్పుకోవాలి నేను...."

పద్మావతి భర్త వంక ఆశ్చర్యంగా చూసింది.

వెంకన్న త్వరగా భోంచేసి లేచాడు.

# 8

"రండి రండి కూర్చోండి—" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నవనీతరావు.

వెంకన్న కూర్చుంటూ — "మీవల్ల నాకో సాయం కావాలి—" అన్నాడు.

"చెప్పండి ..."

"హైదరాబాదులో బ్యాంకు చోరీ గుర్తుందా మీకు? స్టేట్ బ్యాంకాఫ్ ఇండియా.... పాతిక లక్షలు...."

"అవును...."

"మీరు నాకప్పుడా విశేషం చెప్పారు...."

నవనీతరావు సాలోచనగా—"ఇది జరిగి ఏడాదయిందనుకొంటాను—" అన్నాడు.

"అవును...."

వెంకన్న నవనీతరావుకి గుర్తు చేస్తున్నాడు.

హైదరాబాదులో ఒక స్టేట్ బ్యాంకాఫ్ ఇండియా బ్రాంచిలో జరిగింది దొంగతనం. దొంగ చాలా మొండిగా వ్యవహరించాడు.

అతడి చేతిలో పిస్టల్ వుంది. రెండో చేతిలో కాల్క్యులేటర్ వంటి సాధనముంది.

"బ్యాంకులో బాంబు పెట్టాను. నా జోలికి వస్తే యే క్షణంలోనైనా అది పేలుతుంది. ఆత్మరక్షణకు నా దగ్గర పిస్తోలుండనే వుంది—" అన్నాడతడు.

ఆ రోజు జీతాలిచ్చే రోజు. బ్యాంకులో క్యాషు పాతిక లక్షలకు పైగా వుంది.

మొత్తం క్యాషంతా అతడు బ్రీఫ్ కేసులో సర్దించాడు.

ఇద్దరు బ్యాంక్ ఉద్యోగులను తనతో రమ్మన్నాడు.

బయట ఆటో వుంది.

ముగ్గురూ అది ఎక్కారు.

ఆటో రివ్వున దూసుకుపోయింది. ఆటోలో అతడు మాటలతో బ్యాంకు ఉద్యోగులిద్దర్నీ బాగా బెదరగొట్టాడు.

మధ్య దారిలో తెలివిగా అతడు ఆటో దిగిపోయాడు.

ఆటోను పోలీసు జీపు అనుసరించింది. అతడాటో దిగిన విషయం పోలీసులకు తెలియలేదు. జరిగింది ఆటోను పట్టుకున్నాకనే తెలిసింది.

దొంగ తన ప్రాణాల విషయంలో రిస్కు తీసుకున్నాడు. అందుకు ప్రతిఫలం పాతికలక్షలతడి స్వంతం కావడం.

అయితే కథ అక్కడితో అయిపోలేదు.

దొంగ కాజేసినవన్నీ చాలావరకు కొత్తనోట్లు.

ఆ నోట్ల నంబర్లు బ్యాంకులో వున్నాయి.

బ్యాంకువారా విషయం పేపర్లో వేయలేదు. దొంగ దొరకాలంటే నోట్ల నంబర్లు బ్యాంకువారికి తెలియవన్న భ్రమ అతడికుండాలి. అందుకే ఆ నంబర్లు దేశంలోని ప్రముఖ వ్యాపారస్థులకు, బ్యాంకులకు, పోలీసుస్టేషన్లకు

తెలియచేయబడ్డాయి.

మాటల సందర్భంలో ఒకసారి నవనీతరావు వెంకన్నకి విషయం చెప్పాడు.

“ఈ నోటు నంబరు మీ దగ్గరున్న నంబర్లతో సరిపోతుందేమో చూడండి....” అంటూ వెంకన్న ఓ వంద రూపాయల నోటుతీసి నవనీతరావు కందించాడు.

నవనీతరావు అప్పటికప్పుడు ఫైల్సు తెప్పించి వెరిఫై చేసి-“ఆశ్చర్యం-ఈ నోటు మీ కెక్కడిది?” అన్నాడు.

“అనుకోకుండా ఓ. పరిశోధనలో ఇది దొరికింది. నంబరు చూడగానే-అదేనా అని అనుమానం వచ్చింది.”

“అప్పుడెప్పుడో నేను చెప్పిన నంబర్లింకా మీకు గుర్తున్నాయా?” అని ఆశ్చర్యపడ్డాడు నవనీతరావు.

“నా జ్ఞాపకశక్తే నన్ను మంచి డిటెక్టివ్‌ను చేసింది. ఆ విషయమలాగుంచండి. దొంగ గురించిన ఆచూకీ ఏమైనా తెలిసిందా?” అన్నాడు వెంకన్న.

“ఆ విశేషాలన్నీ మీకు తెలుసు—....”

వెంకన్నకవీ గుర్తున్నాయి.

దొంగను చూసిన వారతడ్ని వర్ణించారు. అప్పుడతడు మారువేషంలో వున్నాడు. అయినప్పటికీ వారు చెప్పిన వివరాలు బలదేవ్‌కు సరిపోయాయి.

బలదేవ్ దొంగతనాల్లో ఆరితేరినవాడు. అతడు పట్టుబడ్డాడు.

బ్యాంకు దొంగతనానికి నాలుగు రోజులకుముందే అతడు జైలునించి విడుదలయ్యాడు. జైల్లో వుండగా అతడు చాలా నెమ్మదిగానూ, శాంతంగానూ వుండేవాట్ట. దొంగతనాలను పూర్తిగా మానేస్తానని ప్రతిజ్ఞ

పూనాడు.

కైలు నడిలేక బరుసగా నెలరోజులపాటు ప్రతిరోజూ అతడు పోలీస్ స్టేషన్ లో రిపోర్టు చేయవలసి వుంది.

కానీ అతడలా మూడురోజులు మాత్రం చేశాడు.

నాలుగోరోజున బ్యాంకు దొంగతనం జరిగింది.

బలదేవ్ పత్తాలేదు.

అతడి గురించి యెవ్వరూ వివరాలివ్వలేకపోయారు.

"బలదేవ్ ఫోటో మీ దగ్గరుంది కదూ!" అన్నాడు వెంకన్న.

నవనీతరావు తిరిగి మళ్ళీ రికార్డ్సు తెప్పించాడు.

అందులో బలదేవ్ ఫోటో వుంది.

"బలదేవ్ ను పట్టుకుంటే లక్షరూపాయల బహుమతి కదూ!"

"అవును...."

"మనమిద్దరం ఫిఫ్టీ ఫిఫ్టీ చేసుకుందాం—పదండి...." అన్నాడు వెంకన్న.

నవనీతరావాశ్చర్యంగా—"బలదేవ్ యెక్కడున్నదీ మీకు తెలుసా?" అన్నాడు.

"తెలుసు...."

"ఎక్కడున్నాడు?"

"ఒక అందాల పడుచుకు ముసలి మొగుడుగా నటిస్తున్నాడు. మనమతడింటికి పోలీసుల్లా వెళ్ళకూడదు. మీరు మఫ్టీలో రావడం మంచిది—"

"అసలిదంతా యేమిటో నాకర్థం కావడంలేదు...."

"దారిలో మీకన్నీ వివరంగా చెబుతాను...." అన్నాడు వెంకన్న.

# 9

ఇన్‌స్పెక్టర్ నవనీతరావు, డిటెక్టివ్ వెంకన్న రామకృష్ణయ్య ఇంటికి చేరుకున్నప్పుడు సమయం మధ్యాహ్నం మూడు గంటలు.

తలుపు తట్టగానే వేణి తలుపు తీసింది.

"రామకృష్ణయ్య గారున్నారా?" అన్నాడు వెంకన్న.

"నిద్రపోతున్నారు—...." అంది వేణి.

"ఒకసారి లేపగలరా?" అన్నాడు వెంకన్న.

"ఎందుకు?"

"నేనొక సినీ నిర్మాతను. అందులో ఒక పాత్రకు రామకృష్ణయ్యగారి నెన్నుకుందామని వచ్చాను"-అన్నాడు నవనీతరావు.

"ఆయనకు నటన తెలియదు—" అంది వేణి.

"నటన తెలియక్కర్లేదు. పెద్దగా డైలాగులుకూడా వుండవు...." అన్నాడు నవనీతరావు.

"ప్లీజ్—ఆయనొక్కసారి లేపండి—" అన్నాడు వెంకన్న.

"మీరెవరు? సినీ దర్శకులా?" అంది ఆమె.

"కరెక్టుగా ఊహించారు...." అన్నాడు వెంకన్న.

"ప్లీజ్—మీరు వెళ్ళిపొండి. ఆయనిలాంటి వాటికి ఒప్పుకోరు. మీ కెవరో తప్పుడు సమాచారమిచ్చారు...." అంది ఆమె.

"మా కెవరూ సమాచారమివ్వలేదు. మేమాయన్ను చూశాం. చూడగానే మా సినిమాలో మేమనుకుంటున్న పాత్రకు సరిగ్గా సరిపోతారనిపించింది. ఎంతైనా ఇస్తాను. ఆయనొప్పించండి—" అన్నాడు నవనీతరావు.

"డబ్బుగాయన లొంగరు. ఆయనకే బోలెడు డబ్బుంది—" అంది వేణి.

"ఒక్కసారి మాకు వారితో మాట్లాడే అవకాశ మిప్పించండి—" అన్నాడు నవనీతరావు.

"ఓ పట్టాన నిద్రపట్టదాయనకు. మధ్యలో నిద్రలేపడం అనారోగ్యమని డాక్టరు చెప్పాడు...."

"పోనీలెండి. ఆయన లేచేవరకూ వేచివుంటాం—" అన్నాడు వెంకన్న.

ఇక వాళ్ళు కదలరని గ్రహించి ఆమె వాళ్ళను కూర్చోమని చెప్పి తను లోపలకు వెళ్ళింది. ఆమె తిరిగిరావడానికి కాసేపు పట్టింది.

"ఆయన వస్తున్నారు. నేననుకున్నట్లు చిరాకుపడ లేదు. బహుశా ఒప్పుకుంటారేమో—" అంది ఆమె.

కాసేపట్లో ఓ వృద్ధు డక్కడికి వచ్చాడు.

వెంకన్న అతణ్ని పరిశీలించి చూశాడు. బలదేవ్ పోలికలు కనపడలేదు.

"నా పేరు రామకృష్ణయ్య—" అన్నాడతడు.

నవనీతరావు వచ్చిన పని చెప్పాడు.

"చాలా సంతోషం. జీవితంలో ఒక్కసారి కూడా స్టేజి ఎక్కలేదు. ఈ వయసులో సినిమాయోగం పడు తోందంటే నాకు చాలా అదృష్టం. కథేమిటో చెప్పండి—" అన్నాడతడు.

నవనీతరావు కథ చెప్పాడు. రామకృష్ణ వేయవలసిన పాత్ర గురించి కూడా చెప్పాడు. అది పరమ కిరాతకుడైన హంతకుడినే మార్చిన మహనీయుడి పాత్ర.

"ఇది వేస్తే మీకు శంకరాభరణం శంకరశాస్త్రి కంటె మంచి పేరు వస్తుంది—" అన్నాడు వెంకన్న

అతడు అప్పటికప్పుడో పోలరాయిడ్ ఫోటో తీశాడా వృద్ధుడికి.

"ఫోటో బాగా వచ్చిందికదూ—" అంటూ వృద్ధుడి కందించి చూపించి మళ్ళీ తిరిగి తీసుకున్నాడు.

కాసేపవీ యివీ కబుర్లు చెప్పుకున్నారు. కాఫీ లందేక మర్నాడు—అగ్రిమెంటు ఫారాలతో వస్తామని వెళ్ళి పోయారిద్దరూ. పారితోషికం పదివేలివ్వాలని కూడా నిర్ణయమయింది.

బయటకు వచ్చేక—"బలదేవ్ గనుక ఆ యింట్లో ఉంటే చాలా తెలివిగా ఉంటాడు. మనమతడు తప్పక అనుమానిస్తాడు. పారిపోయే ప్రయత్నాలు చేయకుండా గట్టి కాపలా ఉంది కదా—" అన్నాడు వెంకన్న.

బయల్దేరే ముందే అందుకన్ని యేర్పాట్లూ చేశాడు నవనీతరావు.

ఇద్దరూ తిన్నగా పోలీసుస్టేషనుకు వెళ్ళలేదు. తమ నెవరో అనుసరిస్తున్నట్లుగా భావించుకుని—ఆ ఊహా వ్యక్తిని తప్పుదారి పట్టించడానికి నానావిధంగాను ప్రయత్నించి—అప్పుడు పోలీసుస్టేషనుకు వెళ్ళారు.

"బలదేవ్ పోలికలు లేవు ఫోటోలో వ్యక్తికి—" అన్నాడు వెంకన్న.

"అతణ్ని చూస్తే బలదేవ్ అనిపించలేదు నాకు. అతడు నిజంగానే వృద్ధుడు...." అన్నాడు నవనీతరావు.

"అందుకే అనుమానం తీర్చుకుందుకు ఫోటోమీద అతని వేలిముద్రలు పడేలా చేశాను—" అన్నాడు వెంకన్న.

ఇన్‌స్పెక్టరు వెంకన్నను మెచ్చుకున్నాడు.

బలదేవ్ వేలిముద్రల ఫోటోలు పోలీస్‌స్టేషన్లో

వున్నాయి.

రాత్రి ఏడుగంటలకల్లా రిపోర్టు వచ్చింది.

ఫోటోమీద వేలిముద్రలు—బలదేవ్ వి కాదు.

"కొండను తవ్వి ఎలుకను పట్టాం—" అన్నాడు నవనీతరావు.

వెంకన్నకు చాలా అసంతృప్తిగా ఉంది.

"ఆ యింట్లో పూర్తిగా ఒక నోట్లకట్ట వుంది. అందు లోని నోటిది. బలదేవ్ కీ వీళ్ళకి ఏదో సంబంధముంది...." అన్నాడతడు పాలోచనగా.

"వెంకన్నగారూ! మీరు తాపీగా ఆలోచించి చెప్పండి. నేను మీ కీ కేసులో తప్పక సాయపడతాను" అన్నాడు నవనీతరావు.

"ప్రస్తుతాని కింటికి వెళ్ళడం మినహాగా వేరే ఆలోచన లేదు—" అన్నాడు వెంకన్న. అతడిల్లు చేరుకునే సరికి — అనిపెంట్నిదన్నూ వెళ్ళిపోయారు. పద్మావతి కోపంగా—"ఏమైపోయారు మీరు?" అంది.

వెంకన్న తన జేబులోంచి రెండు ఫోటోలు తీసి— "వీళ్ళిద్దరూ. ఒకటని బుజావు చేయాలని ప్రయత్నించి ఫెయిలయ్యాను—...." అన్నాడు.

"ఎవరు వీళ్ళు?" అంది పద్మావతి భర్త యిచ్చిన ఫోటోలు చూస్తూ.

"వీళ్ళలో ఒకరు నీకు తెలుసు —...." అన్నాడు వెంకన్న.

"వీళ్ళిద్దర్నీ నే నెప్పుడూ చూడలేదు—" అంది పద్మావతి.

"డిటెక్టివ్ వు భార్యవు. జ్ఞాపకశక్తి బాగుండాలి. ఉదయం రామకృష్ణయ్యను చూసివచ్చావుగా—అయ

న్నప్పుడే మర్చిపోయావా?" అన్నాడు వెంకన్న.

"అప్పుడే యెందుకు మర్చిపోతాను? కొంపతీసి ఈ ముసలాయన ఫోటో — రామకృష్ణయ్యదే అనరుగదా మీరు—....!" అంది పద్మావతి.

"వాట్!" అని ఉలిక్కిపడ్డాడు వెంకన్న. అంతే— అతడు తక్షణం నవనీతరావుకి ఫోన్ చేసి—"డియర్ నవనీతరావుగారూ! నిర్భయంగా మీరు రామకృష్ణయ్య యింటిపై దాడిచేయండి. అక్కడ మీ బ్యాంకు దొంగతనం నోట్లు దొరుకుతాయి. ఇంట్లో ఎవరుంటే వాళ్ళని అరెస్టు చేయండి. బహుశా బలదేవ్ కూడా అక్కడే వుంటాడు" అన్నాడు.

# 10

బలదేవ్ పట్టుబడ్డాడు.

అతడు ప్రశాంతమైన జీవితాన్ని కోరి పూర్వాశ్రమంలో తనకు పరిచితురాలైన యువతిని పెళ్ళాడి— తను వృద్ధ వేషంలో ఆమెతో కాపురం ప్రారంభించాడు. తన్నెవరూ అనుమానించకూడదనీ—తనవద్ద నున్న డబ్బు సులభంగా బయటపడకూడదనీ అతడనుకున్నాడు. మరో సంవత్సరం అజ్ఞాతవాసం చేశాక — తన దగ్గర వున్న డబ్బుతో సుఖపడాలనుకున్నాడు.

అతడు తనింట్లో సాయానికి మరో వృద్ధుడి నుంచుకున్నాడు. ఈ వృద్ధుడికి నా అన్నవాళ్ళెవ్వరూ లేరు. బలదేవ్ వృద్ధుడు కాదన్న రహస్యం అతడికి తెలియదు. స్వంత తమ్ముడిలా తన నాదరిస్తున్న బలదేవ్ అంటే అతడికెంతో అభిమానం. అవసరమైనప్పుడు తనకు డూప్ గా అతణ్ణి వాడుకోవాలని బలదేవ్ యింట్లో వుంచుకొన్నాడు.

వాళ్ళకు రోజులు బాగానే గడచిపోతున్నాయి. తన దగ్గరున్న డబ్బును తెలివిగా మార్చుకుంటూ వస్తున్నాడు బలదేవ్ — వేణి సహాయంతో.

ఈ రోజు ఉదయం పద్మావతి రావడమూ — ఆ తర్వాత సినీనిర్మాతలు రావడమూ బలదేవ్‌లో కొంత అనుమానాన్ని సృష్టించాయి. అందుకే అతడు తన స్థానంలో వృద్ధుణ్ని పంపించాడు. అతడిని వెంకన్న అనుమానించకపోవడంతో పద్మావతికి — వారికి సంబంధం లేదని రూఢి చేసుకున్నాడు. వాళ్ళు నిజంగానే సినీ నిర్మాతలే అయితే వృద్ధుడిని పంపాలని బలదేవ్ అనుకొన్నాడు. తర్వాత అతడు రామకృష్ణయ్య కాదని తెలిస్తే — తనకు సినిమాలంటే యిష్టంలేక వదుల్చుకుందుకు వృద్ధుణ్ని పంపానని చెప్పవచ్చు ననుకున్నాడు. వాళ్ళు పోలీసులే అయితే ఆ వృద్ధుడిలో బలదేవ్ పోలికలు దొరక్క — అతడి వేలిముద్రలతో సరిపోక — తర్వాత మళ్ళీ తనను బాధించరని అతడనుకున్నాడు.

కానీ అతడి పథకం బెడిసికొట్టింది.

రామకృష్ణయ్య నిజంగా వృద్ధుడు కాకపోవడంవల్లనే అతడి భార్య వేణి — అతణ్ని ఆరాధిస్తున్నదని తెలిసి ఉమాపతి నీరసపడి వెంకన్నను కలుసుకొన్నాడు.

"ఉమాపతిగారూ! చాముండేశ్వరిని అపురూపంగా చూసుకోండి. దేవతగా ఆరాధించండి. ఆమె మిమ్మల్ని యువకభర్తను మించి ఆరాధిస్తుంది. యువకులంటే ఆమె కసహ్యం. అది పోవాలంటే — ఈ సమాజం మారాలి. అదిప్పట్లో జరిగే పనికాదు. మీ దాంపత్య జీవితం జయప్రద మవుతుంది. నేను చెబుతున్నాను — ...." అన్నాడు వెంకన్న.

ఈ సలహా ఉమాపతికి బాగా నచ్చింది—"వెంకన్న గారూ! మీరు నా కోసం శ్రమపడి చాలా విశేషాలు తెలుసుకున్నారు. రామకృష్ణయ్య వృద్ధుడై వుండీ—నా కంటే ఎక్కువగా భార్యచేత ఆకర్షించబడడం—మానసికంగా నన్ను దెబ్బతీసింది. ఇప్పుడు నా కెంతో ధైర్యంగా వుంది. నేను శారీరకంగా వృద్ధుణ్నికాను...." అని—"మీ కెంత ఫీజు కావాలో చెప్పండి. అంతా యిచ్చుకుంటాను—" అన్నాడు.

వెంకన్న డ్రాయరు సొరుగు లాగి—అయిదువేల రూపాయలు బయటకు తీసి—"మీ రిచ్చిన రెండు వేలకూ జతపర్చుకుని మూడు వేలిస్తున్నాను. ఈ అయిదు వేలూ నేనే మీకు ఫీజుగా యిచ్చుకుంటున్నాను. లేదా మీ కిది నా పెళ్ళికానుక అనుకోండి. ప్రభుత్వానికి పాతికలక్షల నష్టం చేకూర్చిన ఓ దొంగను పట్టుకోవడంలో మీ పాత్రకు ప్రతిఫలముండాలి కదా!" అన్నాడు.

సరిగ్గా అప్పుడే బల్లమీద ఫోన్ మ్రోగింది. వెంకన్న ఫోన్ ఎత్తాడు.

"ఈ కేసు నా పరిశోధన. మీరు నా అసిస్టెంటు. నా అనుమతి తీసుకోకుండా ఇతరులకు—మన బహుమతి మొత్తంలో వాటా యిచ్చే అధికారం మీకు లేదు—" అంది పద్మావతి.

వెంకన్న ఆమెకు బదులిచ్చేలోగా—డిటెక్టివ్ తనకు ఫీజిస్తున్నా రేమిటని భయపడ్డాడో, చాముండేశ్వరిని కలుసుకుందుకు కంగారుపడ్డాడో—అక్కణ్నించి పరుగున వెళ్ళిపోయాడు ఉమాపతి.

—:అయిపోయింది:—

# టెంపోరావ్ జీవిత చరిత్ర

డాక్టర్ వి. సుభద్ర

పూర్వాశ్రమంలో టెంపోరావ్‌కి తల్లిదండ్రులిచ్చిన పేరు రామచంద్రరావు. ఆ శ్రీరామచంద్రుడి నక్షత్రమైన పునర్వసులో, 1924 సంవత్సరం అక్టోబర్ 8వ తేదీ పుట్టాడు. తల్లిదండ్రుల పదముగ్గురి సంతానంలో తొమ్మిదవవాడు. వాళ్ళమ్మా నాన్నా ఇప్పటిలా కుటుంబ నియంత్రణ అంటూ కూర్చుంటే టెంపోరావ్ వుండేవాడు కాదు పాఠకలోకానికి.

వాళ్ళు నలుగురన్నదమ్ములు ఆరుగురక్కచెల్లెళ్ళు. అన్నదమ్ముల్లో ఆఖరివాడతను. తెల్లగా బొద్దుగా ముద్దుగా అందంగా వుండేవాడుట, చిన్నప్పుడు మా అమ్మ చెప్పేది. అందరూ అల్లారుముద్దుగా చూసేవారుట అతన్ని.

టెంపోరావ్ నాకు చిన్నాన్న అవుతాడు. మా నాన్నగారికి ఆఖరి తమ్ముడు.

చిన్నప్పటి నుంచీ అతనికి వావివరసలతో పిలవడం అన్నా, పిలిపించుకోడం అన్నా నచ్చేదికాదు. నా చిన్నప్పుడు చిన్నాన్నా అంటూ వెళ్ళాను. అయిదారేళ్ళ వయసుంటుందప్పుడు. నాకంటే తొమ్మిదేళ్ళు పెద్దతను. ముత్యాల చెట్టియార్ హైస్కూల్లో చదువుతూండే వాడు. అమ్మ అలాగే పిలవాలని శాసించింది నాకు.

"చిన్నాన్నా గిన్నాన్నా లేదు. కె. ఆర్. రావు అని పిలు," అని చెప్పాడు.

అప్పట్నుంచీ అలాగే పిలిచేదాన్ని. చిన్నా పెద్దా, బంధువులు స్నేహితులు అంతా పేరుపెట్టే పిలిచేవారు రావ్ అనీ, కె. ఆర్. రావనీ. మళ్ళీ పేరు ఒంటో రావ్ గా మారేవరకూ నేను కూడా రావనే వ్యవహరిస్తాను.

## 2

తూర్పుగోదావరి జిల్లా, కాకినాడ తాలూకా వేళంగి గ్రామం రావు జన్మస్థలం. సిరిసంపదలతో తులతూగే కమ్మవారి గ్రామంగా ప్రసిద్ధి కెక్కింది ఆ చుట్టుపట్ల

తండ్రి కూనపాటి వెంకట్రావుగారు. తల్లి సీత సుభద్రమ్మ ఆ వూరి గవర్నమెంట్ కరణం ఆయన. ఆ వూరికిద్దరు కరణాలు. పిఠాపురం జమిందారుగారి కరణంగా ఈయన ఆఖరి తమ్ముడుండేవారు. ఆయన పేరు సూర్యారావుగారు. పెద్దతమ్ముడు సుబ్బారావుగారు. మొత్తం నలుగురన్నదమ్ములు వాళ్ళు.

రావ్ కి అయిదవయేట అక్షరాభ్యాసం ఘనంగా చేశారు తండ్రిగారు. స్కూల్లో అయిదవతరగతి దాకా బడి వున్నా, వాళ్ళ నాన్నగారు స్వయంగా ఓనమాల దగ్గర్నుంచీ నేర్పించారు. రామచంద్రపురం నేషనల్

హైస్కూల్లో రెండవ ఫారంలో (ఇప్పటి సెకన్ స్టాండర్డ్) చేర్పించారు. ఎంత అల్లారుముద్దుగా పెరిగినా చదువులో, ఆటపాటల్లో చురుగ్గానే వుండేవాడు రావు.

కేరమ్స్ చాలా బాగా ఆడేవాడు. వాళ్ళ వూరి కమ్మవారు అతన్ని తాకివాడకి, తడితర కేరమ్స్ టోర్నమెంట్స్‌కి తీసుకెళ్ళేవారు. చాలా బహుమానాలు గెల్చుకున్నాడు.

వెంకోరావ్ పెద్ద అన్నయ్య కె.వి.ఎల్. నరసింహారావుగారు. తండ్రి తదనంతరం కరణీకం చూసుకుంటూ స్వగ్రామంలోనే వుండిపోయేరు.

రెండవ అన్నగారు కె. వి. రత్నం. బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో ఎమ్. ఎస్సీ ప్రథమ శ్రేణిలో పాసయి, రాజమండ్రీ ట్రెయినింగ్ కాలేజీలో బి.ఇడి చేశారు. చదువుకునే రోజుల్లోనే అష్టావధానం కూడా చేశారు. ప్రచ్ఛన్నంగా స్వాతంత్ర్య సమరంలో పాల్గొన లేకపోయినా, స్వయంగా నూలు వడికి ఖద్దరు కట్టేవారు. అడపాదడపా స్వాతంత్ర్య యోధులకి యథాశక్తి తోడ్పడుతూ వుండేవారు. ఇన్‌స్పెక్టర్ డప్పుల సుబ్బారావు మీద బాంబువిసిరిన నేరానికి అరెస్టు వారెంటులో వుండి అజ్ఞాతంగా తిరుగుతూన్న ప్రతివాది భయంకరాచారికి బండి మాట్లాడి తోడ్పడినందుకు, ప్రభుత్వం ఆయన్ని బంధించి రాజమండ్రీ సెంట్రల్ జైల్లో వుంచింది. భయంకరాచారి అనుపానులు తెల్పమని కొరడాలతో కొట్టి, బాధించి నిర్బంధ పెట్టింది.

శ్రీ వెంకటరత్నంగారి కుమార్తెగా పుట్టినందుకు గర్వపడుతుంటాను నేనెప్పుడూ. నా చిన్నతనంలోనే ఆయన మరణించడంవల్ల వివ్యక్త విషయమేమీ ఎరుగనాయన్ని.

చెస్ చాంపియన్‌గా ప్రసిద్ధికెక్కి ఎన్నో కప్పులు, షీల్డులు, మెడల్సు సంపాదించారు. పదహారవయేట తమ ఊరిదైవమయిన శ్రీభవానీ శంకరునిపై అర్ధశతకాష్టోత్తరం రాసి బాలకవని బిరుదు బడశారు. ఆయన రాసిన కథలు చిత్రగుప్త, రూపవాణి వంటి ఆ నాటి ప్రముఖ పత్రికల్లో ప్రచురితమయేవి. సాంఘిక డిటెక్టివ్ నవలలు కూడా రాశారు.

మూడవ సోదరుడు కూరపాటి సుబ్బారావుగారు. బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో బి.ఎస్సీ ఇంజనీరింగ్ పాసయ్యారు 25 సంవత్సరాలకే మెక్‌లెక్ ఇంజనీరింగ్ కంపెని స్థాపించారు. ఆంధ్రాలో సాలూరు, పార్వతీపురం, శ్రీకాకుళం, గుడివాడ, కర్నాటకలో ఉడిపి, మెర్కారాల్లో ఎలెక్ట్రిసిటీ కార్పొరేషన్ చేపట్టి విజయవంతంగా నడిపారు. కొల్లంపూడీ షుగర్ మిల్స్, మెక్‌లెక్ ఇన్‌స్ట్రుమెంట్స్, మద్రాస్ వనస్పతీ వంటి సంస్థలని స్థాపించి, ప్రముఖ పారిశ్రామికవేత్తగా పేరు పొంది, ఆనాటి యువతకి ఆదర్శప్రాయమయ్యారు.

ఇదంతా యెందుకు రాస్తున్నానంటే విజ్ఞానానికీ వికాసానికీ పేరెన్నికగన్న వంశంలో మన రావ్ పుట్టాడని చెప్పడానికి.

రామచంద్రపురం నేషనల్ హైస్కూల్లో థర్డ్ ఫారం పాసయ్యాక, రావ్ మూడవ అక్క—బావలు కాశీపట్నపు సూర్యకాంతం — నారాయణమూర్తిలతో మద్రాసు వచ్చాడు. పురశువాకం ముత్యాల్ చెట్టియార్ హైస్కూల్లో, ఫోర్త్ ఫారంలో చేరాడు. ఎస్. ఎస్. ఎల్. సి. అక్కడే పాసయ్యాడు.

మద్రాసు వచ్చినప్పటినుంచీ రావ్ చదువు మూడవ

అన్నగారైన సుబ్బారావుగారే చూసుకునేవారు. మా తాతగారు రిటైరయి, కరణీకం పెద్దకొడుక్కిచ్చి తను మద్రాసొచ్చేశారు. మా బాబయ్యగారు సుబ్బారావుగారు తమ్ముడి చదువు చెల్లెళ్ళ పెళ్ళి, నా అలనాపాలనా అన్నీ అప్పట్నించీ ఆయనే చూసుకునేవారు. తమ్ముడు తమలాగే విద్యావంతుడు కావాలనుకున్నారు. ఇంజనీరైతే తనకి చేదోడుగా వుంటాడని ఆశించి పై చదువులకి బెనారస్ పంపారు.

ఎస్.ఎస్.ఎల్.సి తర్వాత ఐ.ఎస్.పి ఈ నాటి ప్లస్ టూలా రెండు సంవత్సరాలు చదవాలి. రావ్ కాశీ వెళ్ళాడు.

మద్రాసు వచ్చిన కొత్తలో రావ్ చాలా మొహమాటస్తుడు. సుబ్బారావుగారి భార్య రామాయమ్మగారు సంసారం పెట్టిన కొత్త. ఆవిడకీ చిన్నతనం. మొదటి రోజు స్కూలునుంచి రాగానే టిఫిన్ తింటావా బాబూ అని అడిగితే వద్దులెండి అని జవాబిచ్చి తన గదిలో కెళ్ళిపోయేడు రావ్. ఎప్పుడడిగినా ఒకే జవాబిచ్చేసరికి యింక అడగడం మానేసిందావిడ.

ఓ రోజు రావ్ స్కూలునుంచి వచ్చేసరికి అన్నయ్య పెసరట్లు తింటూ, వాడికి చాలా యిష్టం పెట్టు అని, రారా తిందువుగాని అన్నారు. అతనెప్పుడూ టిఫిన్ తినడు. ఎప్పుడడిగినా వద్దంటాడు అందట మా పిన్ని. మేం నియోగులం. తింటావా అంటే వద్దనే అంటాం. తీసుకొచ్చి చేతికిస్తే తింటాం అని చెప్పారు బాబయ్యగారు.

మళ్ళీ మా పిన్ని పాపం యెవర్నీ అలా అడగలేదు.

# 3

రావు బెనారస్ వెళ్ళేసరికి, పెద్ద పినతండ్రి కొడుకు సత్యనారాయణ అప్పటికే ఇంజనీరింగ్ చదువుతున్నారక్కడ. ఆయనే రావుకి అక్కడ గురువు, గైడ్ అంతా. కె. ఎస్. రావు అని పిలుస్తారాయన్ని.

అన్న సుబ్బారావుగారి చిన్న బావమరిది డి. వి. రామారావుగారు ఇంజనీరింగ్ ఫైనల్ ఇయర్ చదువుతూ వుండేవారు.

కాలేజీలో చేరిన కొత్తల్లో చాలా భయసుకు. బిడియంగా కూడా వుండేదట. కొత్త ప్రదేశం. కాలేజీ కుర్రాళ్ళంతా అమ్మాయిలా చాలా అందంగా వున్నావంటూ ముద్దులు పెట్టుకుని అల్లరిపెడ్తూంటే మాట్లాడకుండా వుండేవాడుట. ఏం అంటే ఇంకేం చేస్తారో అని భయం. ఎక్కువగా నారాయణరావుతోనే వుండేవాడుట. (కె. ఎస్. రావుని చిన్నప్పుడు యింట్లో అలా పిల్చేవారు.)

కుమారస్వామి, చక్రధరరావు (ప్రస్తుత సినీతార సరిత తండ్రి) సహపాఠులో, గదిలో వుండేవారో మరి, తన స్నేహితులని తరచుగా చెప్తూండేవాడు.

క్రమేణా కొత్త పరిస్థితులకి, పరిసరాలకి అలవాటు పడ్డాడు. కాలేజీ చదువు కంటే యూనివర్సిటీ లైబ్రరీ ఎక్కువగా ఆకర్షించింది రావుని.

క్లాసులో అటెండెన్సు యిచ్చి, హాలు వెనుక ద్వారం నుంచి లైబ్రరీకి వెళ్ళి అక్కడ దేశ, విదేశ రచయితల వివిధ గ్రంథాలను చదవసాగాడు. అక్కడికి కొత్తగా తర వాతే స్నేహాలకి తోడుగా, సిగరెట్లు కాల్చడం, తాగడం అలవాటయ్యాయి.

మొదటి సంవత్సరం మార్కులు బాగానే రావడం వల్ల, ఆఖరి టెర్మ్‌కి ప్రాముఖ్యత యివ్వకుండా ఎలాగో రెండవ సంవత్సరానికి తోసేశారు. కాని రెండవ సంవత్సరం కాలిపై వ్రణం రావడంతో కాలేజీకి సరిగ్గా వెళ్ళక యూనివర్సిటీ పరీక్షలకి కూర్చోడానికి వీలుపడలేదు.

తరవాతి సంవత్సరం కూడా ఆరోగ్యం లేక పోయినా కాలేజీకి సరిగ్గా వెళ్ళలేదు, పుస్తకపఠనంలో. పరీక్షలకి పంపనన్నారు అధికారులు. పరీక్ష పాసు కావడానికి కాలేజీకి వెళ్ళి చదవక్కర్లేదు. నన్ను వెళ్ళనిస్తే పరీక్షలు రాసి పాసవుతానని ఛాలెంజి చేశాడు వాళ్ళని. వెళ్ళి వైస్ ఛాన్సలర్‌ని కలుసుకుని పర్మిషన్ తెచ్చుకో మన్నారు వాళ్ళు.

అక్కడ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు వైస్ ఛాన్సలర్‌గా వుండేవారప్పుడు. వెంటనే ఆయన్ని కలుసుకుని విషయమంతా వివరించాడు రావ్.

ఆయన నవ్వుతూ, "బాబూ, నీ ధైర్యాన్ని, నీ మీద నీకున్న నమ్మకానికీ మెచ్చుకుంటున్నాను. అటు చూడు గంగా నదిని. దాని కిరువైపులా వున్న గట్లు చూశావా? అవి కొట్టేస్తే ఏమవుతుందంటావు," అని అడిగాడాయన.

నీరు ఊళ్లోకి ప్రవహించి ఊరుని ముంచేస్తుందన్న రావు సమాధానం విని వీపుమీద మెల్లిగా తట్టుతూ, "నదికి గట్లు ముఖ్యమైనట్లే ప్రతి విషయంలోనూ రూల్సూ రెగ్యులేషన్స్ ముఖ్యం. ఒక క్రమపద్ధతిలో సాగడానికి వాటి ఆవశ్యకత ఎంతైనా అవసరం. వాటిని అతిక్రమించాలనుకోవడం అవివేకం. రూల్సు ప్రకారం వచ్చే

సంవత్సరం నువ్వు కాలేజీకి వెళ్ళినా వెళ్ళకపోయినా, పరీక్షకి పంపుతారు. అప్పుడు నీ శక్తిసామర్థ్యాలు నిరూపించుకో. పరీక్ష పాసవు," అని చెప్పి పంపించేశా రాయన.

మరుసటి సంవత్సరం పరీక్షకి పంపించారు. రావ్ పాసయి బయటపడ్డారు.

బెనారస్‌లో చదువుతూండగానే, 1942 లో క్విట్ ఇండియా మూమెంట్ జరిగింది. జయప్రకాశ్ నారాయణ వీళ్ళ హాస్టల్లో తల దాచుకున్నారుట. ఆ విషయం తెలిసి గవర్నమెంట్ సెర్చ్‌వారంటుతో టామీస్‌ని పంపింది. టామీస్ అంటే బోయ్‌నెట్స్ పట్టుకున్న సిపాయిలు.

వాళ్ళు వస్తూన్న వార్త ముందుగా తెలియగానే, వైస్ చాన్స్‌లర్ 'కాలేజీ మూసేశాం. హాస్టల్స్ ఖాళీ చేసి యిళ్ళకు పొమ్మని' అర్ధరాత్రి మైక్‌లో చెప్పించారు. ఈ రాత్రి ఎక్కడికెళ్తాం, పొద్దున్న వెళ్దాం అనుకున్న స్టూడెంట్స్‌కి తెల్లారకుండానే తలుపులు తట్టడం వినిపించి కళ్ళు నలుముకుంటూ లేచి తెరిచారు.

ఎదురుగా వున్న సిపాయిలని చూసేసరికి హడిలి పోయారు. మూటాముల్లె తీసుకుని బయటపడి స్టేషన్ వైపు పరుగెత్తారు. ఎవరి దగ్గరా డబ్బుల్లేవు వున్నదాంతో అలహాబాదు వరకూ టిక్కెట్టు కొనుక్కొగలిగారు. అక్కడికెళ్ళాక యేం చెయ్యాలో తెలియలేదు.

కడుపులో ఆకలి మండిపోతోంది. మన రావ్, మరో ఫ్రెండ్ కలిసి ఒక హోటల్లో జొరబడ్డారు. ఆ మేనేజర్‌ని కలుసుకుని తమ కష్టం చెప్పుకున్నారు. తాము తిండికి లేనివాళ్ళము కాము. కాని హఠాత్తుగా పొమ్మంటే,

యిలా అయ్యింది పరిస్థితి. ఇంటికి వెళ్ళడానికి డబ్బులు లేవు కడుపులో' ఆకలని చెప్పారు.

ఆ మేనేజర్ వాళ్ళిద్దర్నీ లోపలకెళ్ళి ఏం కావాలో తినిరమ్మని చెప్పాడు. తినివచ్చాక, వూరు వెళ్ళడానికి ఎంత కావాలని అడిగి, యిద్దరికీ చెరో ఇరవై రూపాయలు చేతిలో పెట్టి పంపాడు. ఇద్దరూ సంతోషంగా బయట పడి వూళ్ళకి తిరిగివచ్చారు.

ఇంటికి తిరిగొచ్చాక, క్షేమంగా తిరిగొచ్చిన తమ్ముడ్ని చూసి సంతోషించి, అన్న సుబ్బారావుగారు ఆ మేనేజర్ కి వెంటనే పంపమని డబ్బిచ్చారు.

కాశీలో ఇంటర్ చదువయ్యాక మద్రాసు పచ్చయప్ప కాలేజీలో బి.ఎస్ సి మేథ్స్ లో చేరాడు. అప్పటికి అన్నగారి కుటుంబం పూనమల్లి హైరోడ్డులో కుశలదాస్ గార్డెన్ దగ్గర ఒక బంగళాలో వుండేది. అప్పటికే రావు మేధస్సు రచనలపైకి మళ్ళింది.

రోజూ కాలేజీ నుంచి యింటికి రాగానే, రెండవ చిన్నాన్నగారి అబ్బాయితో ఆయన పేరు కూడా సత్యనారాయణే, కలిసి కుశలదాస్ గార్డెన్స్ కి వెళ్ళేవాడు. అక్కడికి వచ్చినవాళ్ళంతా కబుర్లు చెప్పుకుంటూ వుంటే, తను మాత్రం ఓ చెట్టుకింద కూర్చుని రాసుకునేవాడు. కాలేజీలో చేరినా రావ్ ని సిగ్గు, మొహమాటం మాత్రం పూర్తిగా వదలలేదు.

అన్నయ్యగారు ప్రతినెలా పాకెట్ మనీ యివ్వమని భార్యతో చెప్పారు. మొదటిసారి యిచ్చినపుడు, అయిపోతే అడుగు మళ్ళీ యిస్తానందావిడ. డబ్బులయిపోయాయి. అడగడానికి మొహమాటంతో, కాలేజీకి నడిచివెళ్ళాడు రావ్.

ఫైనల్ బి.ఎస్.సి.లో కొన్ని పేపర్లు అసలు రాయ లేదు. రానివంతిమటుకు పాసయ్యాడు. అన్నగారు ఎందుకు రాయలేదని అడిగితే, పరీక్షలు రాసి పాసయి ఉద్యోగం చెయ్యాలనే ఆశ తనకు లేదని చెప్పాడు. మరి యేం చేస్తావు? జీవించడం యెలా అన్నారాయన. 'నేను రచయితని, జర్నలిస్టుని అవుతానని జవాబిచ్చాడు.

అది సాధ్యమవుతుందని కోలేదు అప్పట్లో ఎవ్వరూ. లక్ష్మి సరస్వతి ఒకచోట వుండవని కదా సామెత. మేధావులైన కవులే దారిద్ర్యంతో బాధపడ్డారు మరి.

కాని ఒకళ్ళు చెప్తే వినే తత్వం ఆయింటా వంటా లేదు. ఎంత తోస్తే అంత చెయ్యవలసిందే. అనుభవం మీద తెలుసుకొని మనిషి మారాల్సిందే. అందుకని తమ్ముడికి ఆస్తిలో వచ్చిన వాటా డబ్బుని యిచ్చేసి నీ యిష్టం వచ్చినట్టుగా చేసుకోమని చెప్పారు.

కాలేజీలో చదువుతూన్నప్పుడు రాసిన మొట్టమొదటి నవలకి 'నన్ పల్ లివ్' అని పేరుపెట్టాడు. రాజ్ కోటలో, కితాబ్ ఘర్ పబ్లికేషన్స్‌కి పంపించాడు. వాళ్ళు వెంటనే దాన్ని ప్రచురిస్తూన్నట్లు తెలియబరుస్తూ, అయిదు వందల రూపాయలకి డ్రాఫ్ట్ పంపారు.

అది అన్నగారికి చూపిస్తే. మనసు మార్చుకుని మెచ్చుకుంటారని ఎదురుచూసిన రావ్‌కి నిరాశే యెదు రయింది. ఎవడో పిచ్చివాడయి వుంటాడు పాపం, అన్నారాయన.

అయినప్పటికీ నిరుత్సాహపడక నిర్విరామంగా తన లను ఇంగ్లీషులో రాసాగిస్తూనే వున్నాడు.

నన్ పల్ లివ్ నవల పట్టుకుని తన మిత్రుడు బాల కృష్ణను కలుసుకోడానికి వాళ్ళింటికి వెళ్ళాడు. వి. వి.

గిరి పెద్దలుండేరను. అప్పుడు మామగారింట్లో వున్నాడు. అప్పుడు గిరిగారు మద్రాసు మినిస్ట్రీలో లేబర్ మినిస్టర్‌గా వుండేవారు. తన నవల చదివి అభిప్రాయం చెప్ప మని ఆయన కిచ్చాడు రావ్.

ఇప్పుడు నీ వయస్సెంత అని అడిగారాయన. ఇరవై మూడన్నాడు. ఇది రాసినప్పుడు అని అడిగారు. ఇరవై అని చెప్పాడు. ఆయన వెంటనే కాగితించుకుని యిది యెలా వుందనే విషయం తరవాత చూద్దాం. అంత చిన్నవయస్సులో పరాయి భాషలో రచన చెయ్యాడ మనేదే గొప్ప విషయం, అరుదైనది, అన్నారాయన.

రావ్ మొట్టమొదటగా ప్రారంభించి, ఎడిట్ చేసి నది ఇంగ్లీషు పత్రిక. దాని పేరు ఇండియానా.

ఆ పత్రిక చదివిన చాలామంది అతని భాషా శైలికి చాలా మెచ్చుకున్నారు. స్వతంత్ర పత్రిక సంపాదకులు శ్రీ ఖాసా సుబ్బారావుగారు, అన్నగారి స్నేహితుడు శ్రీ శిష్ట వెంకట్రావుగారు, 'మీ తమ్ముడు చాలా తెలి వైనవాడు. ఇలాంటి తమ్ముడు వున్నాడని మాకు తెలీనే తెలీదు అన్నారుట.

వెయ్యిరూపాయల జీతంమీద వుద్యోగం యిస్తామని ఆ రోజుల్లో చాలామంది పిలిచారు. ఒకళ్ళ కింద ఉద్యోగం చెయ్యడం తన కిష్టం లేదనీ, ఇలా రచయిత గానే జీవించదలిచాననీ జవాబిచ్చాడు. అలాగే చివరి వరకూ జీవించాడు కూడా.

ఆ రోజుల్లోనే రావ్ రాసిన ఇంగ్లీషు నవల "హాంగర్"కి ప్రథమ బహుమతి వచ్చింది. "సాడిస్ట్" అనే కథ కూడా మరో పత్రిక నడిపిన పోటీలో ప్రథమ బహుమతి సంపాదించుకుంది.

మెసిందియా, కేరవాన్, మినీ మేగ్, హైకో ఇలా పలు పత్రికల్లో రావ్ కథలు ప్రచురితమయ్యేవి. దాంతో రచనలవల్ల తను నిశ్చింతగా జీవించగలనని ధైర్యం వచ్చింది. రాసే మూడ్ వచ్చినప్పుడు, రాత్రీ పగలూ వుండేది కాదు. టైప్ రైటర్ ముందు కూర్చుని టైప్ చేస్తూండేవాడు.

టైప్ యే ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్ళి నేర్చుకోలేదు. పరీక్షలు పాస్ కాలేదు. కాని చాలా స్పీడ్‌గా చేసే వాడు. హైస్కూల్లో చదివేప్పుడు వాళ్ళన్నగారి మెక్ లెక్ ఇంజనీరింగ్ కంపెనీలోని మెషీన్ల మీద తీరిక వేళల్లో ప్రాక్టీసు చేసి స్వశక్తితో నేర్చుకున్నదే.

కేన్ కేడ్ ఆఫ్ లవ్ అనే ఇంగ్లీషు పద్యాల పుస్తకం 'శక్తి కార్యాలయం' వాళ్ళు ప్రచురించారు. ఏంగ్రీ పిజన్, ట్రూత్ ఫుల్ పేరట్ వంటి పిల్లల కథల పుస్తకాలు కూడా పలురకాలు ప్రచురితమయ్యాయి. ఇంకా ఎన్నో కథలు, పద్యాలు, నవలలు ఇంగ్లీషులో రాసే వాడు.

ఎవరిమీదా ఆధారపడకుండా రచయితగా తను హాయిగా జీవించగలనని నిరూపించుకోడానికా అన్నట్టు 1945 లో అన్నగారి యిల్లు వదిలి కపాలీశ్వరుని గుడి దగ్గర టి. ఎ. మొదలిస్ట్రీట్‌లో ఒక యిల్లు తీసుకుని వేరే వున్నాడు. అప్పుడే "టెంపో" అనే ఇంగ్లీషు పత్రిక ప్రారంభించాడు. ఎడిటర్ కె. ఆర్. రావ్ అని పెట్టుకున్నా, అప్పుడప్పుడు కొన్ని రచనలు టెంపోరావ్ పేరుతో చేసేవాడు.

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చేవరకూ ఎక్కువగా ఇంగ్లీషులోనే రాసేవాడు. కాని టెంపోతో పాటే

"ఫిల్మ్" "రతి" తెలుగు "రది" తమిళం పత్రికలని కూడా నడిపేవాడు. తెలుగు కథలని అరవంలోకి అనువదింపించి ప్రచురించేవారు.

అన్ని పత్రికలూ బాగా అమ్ముడయేవి. పేరు ప్రతిష్టలు వచ్చాయి. కారు కొని అందరిచేతా ఓహో అనిపించుకున్నాడు.

ప్రసిద్ధ రచయిత—డైరెక్టర్ గోపీచంద్, కృష్ణమూర్తి లాంటి వాళ్ళు ఫ్రెండ్స్. గోపీచంద్ గారి "ప్రియురాలు" సినిమాలో యేదో పాత్ర నటించాడు కూడా. అయితే ఆ సినిమా వెలుగులోకి రాలేదు.

1950' నాటికి క. ఆర్. రావ్ పేరు టెంపోరావ్ గా వాడుకలోకి వచ్చింది. తల్లిదండ్రులు, దగ్గరి బంధువులు తప్ప మిగతా అంతా టెంపోరావ్ అని పిల్చేవారు. తను కూడా పూర్తిగా టెంపోరావ్ పేరుతోనే రచనలు కొనసాగించాడు.

## 4

టెంపో టైమ్‌లో అడ్వెంచర్‌తో జీవితం గమ్మత్తుగా వుండేది. అందులో మచ్చుకి కొన్ని.

చేతిలో డబ్బుంటే జల్సాగా స్నేహితులతో ఖర్చు పెట్టేవాడు. లేనప్పుడు అందరూ కల్సి అలానే ఉపాయంగా లేమినుంచి బయటపడేవారు.

ఒకమారు రావ్ జేబు పూర్తిగా ఖాళీ. కడుపులో చాలా ఆకలిగా వుంది. ఏం చెయ్యాలా అని ఆలోచిస్తున్న సమయంలో శ్రీశ్రీగారు మరొకరితో అక్కడికొచ్చారు రా భాయ్ టిఫిన్ తిందాం, అన్నారు. నా జేబు ఖాళీ మీ దగ్గరేమైనా వుందా అని అడిగాడు.

అందరం ఒకే పడవలో ప్రయాణిస్తున్నాం. రా

టిఫిన్ తింటూ ఉపాయం ఆలోచిద్దాం—అన్నా రాయన. ముగ్గురూ మంచి ఆకలిమీదున్నారు. కడుపు నిండా టిఫిన్ తినేసరికి మూడో నాలుగో అయింది బిల్లు.

శ్రీ శ్రీ గారు బిల్లందుకుని దాని వెనకపక్క "ఓ మహాత్మా, ఓ మహర్షీ, ఏది సత్యం, ఏదసత్యం." అని పాట రాశారు. రావ్ అది అందుకుని యిప్పుడే వస్తా నుండండి యిక్కడే, అని బయట కెళ్ళాడు.

ఆ పక్కనే శ్రీపురంలో వున్న టంగుటూరి సూర్య కుమారి యింటికి వెళ్ళి పాట చూపించాడు. ఈ పాట మీరు పాడితే బావుంటుంది, తీసుకోండి అన్నాడు. ఆమె పాట చూసి వెంటనే కొంత డబ్బిచ్చింది. అది తీసుకొచ్చి శ్రీశ్రీగారి కియ్యగానే, బిల్లు చెల్లించి అంతా బయటపడ్డారు.

ఇంకొకసారి ఒక ప్రొడ్యూసర్ యేదో అడ్వర్ టైజ్ మెంట్ కి డబ్బు బాకీ. మనిషిని పంపిస్తే ఏదో సాకుతో వాళ్ళని తిప్పి పంపేసేవాడు. తనే స్వయంగా వెళ్ళేడొక సారి. పోస్టు డేటెడ్ చెక్ యిస్తాను తీసుకుంటారా? అని అడిగాడు. ఏదో ఒకటి యివ్వండి అని, ఆ చెక్కు తీసుకుని బయటపడ్డాడు. చెక్కులో వేసిన డేట్ కి పొద్దున్నే బాంకి తెరిచే వేళకు వెళ్ళి కూర్చున్నాడు రావ్. తెరిచిన వెంటనే మొట్టమొదట చెక్ ప్రెజెంట్ చేశాడు.

గుమస్తా లెడ్జర్ చూసి చెక్ తిప్పెయ్యబోతూంటే, యెందుకు తిప్పేస్తున్నారని అడిగాడు. అకౌంట్ లో కొంచం డబ్బు తక్కువగా వుంది అన్నాడు గుమస్తా.

ఆ మొత్తం నేను కడతాను. చెక్ పాస్ చెయ్యండి, అని మేనేజర్ తో మాట్లాడి చెక్ కాష్ చేసుకుని బయట

పడ్డాడు. రావ్ బయటికొస్తూంటే ప్రొఫెసర్ కారు వచ్చి బయటాగింది. ఓ కోరనుంచుని యేమవుతుందా అని పరికిస్తూన్న రావుకి, విసురుగా, కోపంగా, దూకుడుగా అడుగులేస్తూ బయటకెళ్ళే ప్రొఫెసర్ కనపడ్డాడు. పాపం నాకు చెల్లని చెక్కు యిద్దామని అనుకుని దెబ్బతిన్నాడన్నాడోసారి మాకీ కథ చెబుతూ.

ఇంకొకసారొక స్నేహితుడికి ఐదువందల రూపాయల చెక్కిచ్చి క్యాష్ చేసుకురమ్మన్నాడు. అది రాగానే మంచి పార్టీ చేసుకోవాలని ఊహాలోకంలో ఊగుతూ గాలిలో తేలుతున్నాడు. కాని ఎంతకీ స్నేహితుడు రాకపోయేసరికి గుండె దడదడ కొట్టుకోసాగింది. చాలా సేపటి తర్వాత స్నేహితుడు నవ్వుతూ వచ్చి డబ్బిచ్చి, తన కథ యిలా చెప్పాడు.

“ఈ రోజు ఈ డబ్బు నాలో సంఘర్షణ రేకెత్తించింది. ఇంత డబ్బు ఒక్కసారి చూసేసరికి కళ్ళు తిరిగాయి. నా అవసరం గుర్తొచ్చింది. ఇంట్లో ఖర్చులు. ఇది పట్టుకుని ఇక్కడికి రావడం మాని యింటికి పోదాం. ఆ తరవాత మీకేదో సర్దిచెప్పుకోవచ్చనుకున్నాను. కాసేపు నాలో తర్జనభర్జన జరిగింది. స్నేహం కోల్పోతానని పించింది. మీ స్నేహం పోగొట్టుకోడానికి మనస్సొప్పలేదు. అందుకే వచ్చేశాను” అన్నాడతను.

మంచిపని చేశావని అతని భుజం తట్టి పార్టీ అయ్యాక కొంత డబ్బు అతని చేతికి యిచ్చి పంపించాడు రావ్.

## 5

పెద్దలు ఒకుగు పెళ్ళి చేద్దామని ఎన్నో పర్యాయాలు ప్రయత్నించి విఫలురయ్యారు,

ఒకరుగులో తనకు నమ్మకం లేదన్నాడు. పెళ్ళి చేసుకుంటే, మనవల్ల అవతలి వ్యక్తి ఆనందంగా వుండాలి కాని కష్టపడకూడదు, అనే మన స్తత్వ మతనిది. తనకి పెళ్ళి అవసరం లేదన్నాడు. సమాజం కోసమో, పెద్దల్ని సంతోష పెట్టడానికో పెళ్ళి చేసుకుని, కట్రాటకి కట్టబడ్డ గొడ్డులా నే జీవించలేననేవాడు. స్వేచ్ఛావిహంగంలా తిరిగాడు కొంతకాలంపాటు.

అప్పుడే సినిమాలో పైకొస్తూన్న ఒక తార కుటుంబంతో పరిచయం కలిగింది. టెంపోలో పరిణయం చెయ్యడానికెళ్ళినప్పుడు. ఆ తరవాత అక్కడే గడిపేవాడు ఎక్కువగా. ఇంట్లో పెళ్ళి జరుగుతే, ఊళ్ళోవాళ్ళందరిలాగే తనూ ఒక అతిథిగా ఆ తారనీ, ఆమె చెల్లెల్ని వెంటబెట్టుకు వచ్చాడు. ఆమె చెల్లెల్ని పెళ్ళి చేసుకుందామని అనుకున్నాడు.

ఆ విషయం యింట్లో చెబితే అంతా చాలా సంతోషించారు. నువ్వో యింటివాడివాయితే చాలు, ఎవర్ని చేసుకున్నా సరే అన్నారు. కాని ఆ సంతోషం ఎక్కువ కాలం నిలవలేదు. గాలికి చెదిరిన కారుమేఘంలా అతని లోని ఆ ఊహ చెదిరిపోయింది.

ఇద్దరికీ చెడిసింది. ఆమెపై ప్రేమ కసిగా మారింది. కలంలోంచి కదిలి ఫిలిం పత్రికలో ధారావాహిక నవలగా ప్రచురించబడింది కొంత కాలంపాటు.

ఇంటికి చేరాడు. ఆ తగవాత అనారోగ్యంతో పడుకున్నాడు. మోకాలు పట్టేసింది! తల్లిదండ్రీ, అన్నా వదినలు చూపిన ఆదరాభిమానాలతో, చేసిన సేవలకి తోడుగా, ఫేమిలీ డాక్టర్ అవధాని గారి ట్రీట్మెంట్ తో త్వరలోనే కోలుకున్నాడు.

కాని పత్రికా ప్రచురణకి కాలదోషం పట్టేసింది. కొంతకాలం అప్పుడు అనిశ్చిటుగా పనిచేసే వై. వి. రావ్ ఒకటి రెండు నెలలు ఫలితం పత్రిక తీసుకొచ్చారు, కాని ముఖ్యంత కాలం సాధ్యం కాక అదీ నిలిచి పోయింది.

# 6

వాళ్ళ అన్నగారైన సుబ్బారావుగారు 1950 లో వాలాజా రోడ్డులో వున్న ఓ ప్రింటింగ్ ప్రెస్‌ని కొని తమ్ముడ్ని చూసుకోమన్నారు. కొన్నాళ్ళపాటు వెళ్ళి చూశాడు మొదట్లో. కాని అప్పట్లో తార పరిచయంతో దానిమీద యెక్కువ శ్రద్ధ చూపలేకపోయాడు.

జబ్బుపడి లేచాక అన్నగారు ప్రెస్ చూసుకోమని మళ్ళీ చెప్పారు. ప్రెస్ వాలాజా రోడ్డు నుంచి సుంకురామ చెట్టి వీధికి మారింది అప్పటికే.

టెంపోరావ్ అందులో ప్రవేశించాడు మా వారు, వి. యస్. ఎన్. మూర్తి మానేజర్‌గా వుండేవారు. ప్రవేశించిన కొద్ది కాలంలోనే మానేజింగ్ డైరెక్టర్‌గా ఉన్నత స్థానాన్ని ఆక్రమించాడు రావ్. మానేజర్, తనూ, అల్లుడూ మామాలా కాకుండా ప్రాణమిత్రులుగా అన్నదమ్ములు లాగా ఎప్పుడూ కలిసివుండేవారు మూర్తి గారికి టెంపోరావ్ అంటే మంచి గురి. ఆరో ప్రాణంలా చూసేవారు. ఇద్దరూ ఒకళ్ళనొకళ్ళు పండిట్‌జీ అని పిలుచుకునేవారు.

అదే కుబేరా ప్రెస్. తను ప్రవేశించాక ప్రెస్ రూపు మార్చేశాడు. పాత మెషినరీ మార్పించి, హైడల్‌బర్గ్ లాంటి కొత్త మెషీన్స్ తెప్పించి మద్రాసులో వున్న

పెద్ద ప్రెస్‌లకి దీటుగా తయారుచేశాడు.

ఇంగ్లీషులో "ప్రింటిండియా" అనే పత్రికని, తెలుగులో "డిటెక్టివ్" అనే పత్రికనీ ప్రారంభించాడు. అంతవరకూ డిటెక్టివ్ సాహిత్యం వెలువడేది. కాని దానికి అంత ప్రాముఖ్యత లేదు. రచనలు కూడా గ్రాంధికంలో సాగేవి. ఇలా మాట్లాడే భాషలో రాయడం జరగలేదు. దీనికి నాంది పలికినవాడు టెంపోరావ్.

ఆరుద్రగారి ఆంధ్ర వాఙ్మయంలో డిటెక్టివ్ సాహిత్యం గురించి రాసినప్పుడు ఇది ప్రస్ఫుటించారు. శిష్ట సాహిత్యానికి విలువ లేదనీ, సాహిత్యానికి వున్న విలువ ఈ సాహిత్యానికి లేదనీ అనేక విధాలుగా చర్చించారు డిటెక్టివ్ వెలువడిన మొదట్లో. కాలక్రమాన ఈ సాహిత్యం తన విలువను తనే పెంచుకుంది. ప్రజాదరణ లభించింది పాఠకలోకం పెరిగింది.

డిటెక్టివ్ ప్రారంభంతో ఇంగ్లీషు రచనలకి ప్రాముఖ్యత తగ్గించి, తెలుగులో రచనలు చెయ్యసాగాడు టెంపోరావ్. టెంపో పబ్లికేషన్స్ ప్రారంభించి డిటెక్టివ్ నవలల్ని ప్రప్రథమంగా పాకెట్ సైజులో ప్రచురించి ప్రజలకి అందించారు.

దక్షిణ భారతంలో పాకెట్ సైజు పుస్తక ప్రచురణ తీసుకొచ్చిన ఘనత టెంపోరావ్‌కే దక్కింది. ఆ తరవాతే యితర భాషల్లో కూడా ఆ విధంగా ప్రచురింపబడ్డాయి. టెంపోరావ్ మొట్టమొదటి డిటెక్టివ్ నవల "విందుకు వెళ్ళిన విముల."

డిటెక్టివ్ పత్రిక అరవంలో "తుప్పరియుం"గా, హిందీలో "నయా జానూన్"గా తరుపర వెలువడింది. "ప్రింటిండియా"ని విదేశీ పత్రికల స్థాయిలో వుండేలా

తీసుకొచ్చారు. కలకత్తా ప్రింటర్స్ కాన్ఫరెన్స్ కి వెళ్ళి నప్పుడు ఈ పత్రికకి, టెంపోరావ్ కీ మంచి గుర్తింపు వచ్చింది. ప్రముఖ పత్రికాధిపతులతో పరిచయ మేర్పడి, వారిలో ఒకరయ్యాడు. ప్రింటర్స్ డైరెక్టరీని ప్రచురించి పదిమంది చేతా ఓహో అనిపించుకున్నాడు.

సాహితీవేత్తలుగా ప్రసిద్ధి కెక్కిన రచయితలు, ఇతర కళాకారులు కూడా ఒకటి రెండు నవలలు ఈ సాహిత్యంలో రాసి తమ సామర్థ్యాన్ని పరీక్షించుకున్నారు. మరెంతో మంది రచయితలుగా రూపొంది అదే ఉపాధిగా పెట్టుకుని జీవిస్తున్నారు. ఎన్నో పుస్తక ప్రచురణాలు వెలి శాయి. ఆ పుస్తకాల అధిపతులు మేడలమీద మేడలు కట్టారు. కొంతమంది మీ రచనల్ని చదివి మాకూ రాయాలనే ఉత్సాహం కలిగి రచయిత లయ్యాం అన్నారు.

మీ రచనలు మా కెన్నో పర్యాయాలు పరిశోధనలో ఉపయోగించాయి అన్నాడో యిన్స్పెక్టర్ టెంపోరావ్ ని చూడడాని కొచ్చి. రచించడంలో రావ్ శైలిని అనుకరించేవాళ్ళే కాకుండా పేరుని అనుకరించే వాళ్ళు కూడా వున్నారు.

ఆంధ్రా షెర్లాక్ హోమ్స్ అన్నారు అతను సృష్టించిన డిటెక్టివ్ వాలి పాత్రను. అకారాదులలోనే కాక మేధస్సులో కూడా విశిష్టమైన పాత్ర వాలిది. వాట్సన్ ని మించిపోతాడు అసిస్టెంట్ గిరి. రామబంటులాంటి వాడు వాలికి.

ఎర్ల్ స్టేన్లీ గార్డ్నర్ — పెర్రీమాసన్ — డెల్లాస్ట్రీట్ లాగ అశ్వద్ధామ సురేఖ పాత్రలను సృష్టించాడు. పరశురామ్ పార్వతీ కూడా మరపురాని జంటే. తన పేరుతోనే

కాకుండా స్నేహితుల, బంధువుల పేర్లతో కూడా కథలూ, నవలలూ రాసేడు.

దరిద్రానికి ప్రతీకగా వుండి అసమాన మేధస్సు గల కాళిదాస్, సకలావసలందూ తాళికట్టిన భార్య కంటె ఎక్కువగా పొలుపంచుకునే అసిస్టెంట్ చంచల్ మరో జంట. లతా—లాల్ ఆకారాదుల్లో లారల్ అండ్ హార్డీ అని జ్ఞప్తికి తెచ్చే జంట. తెలివితేటలు, చురుకుదనం, లతని ఏడిపించే చిలిపితనం లాల్ ది అయితే, డబ్బు తాపత్రయం, పిసినిగొట్టుతనం, కూలకాయంతో కదలలేక పని చెయ్యలేక పోయినా డబ్బు కనిపించేసరికి చటుక్కున పర్సులో పెట్టేసే స్వభావం లతది.

అడ్వకేట్ కనకరాజాతో రెండు మూడు నవలలే వచ్చినా అవి కూడ పాఠకుల అభిమానాన్ని పొందాయి. టెంపోరావ్ సృష్టించిన ప్రతి పాత్రా పాఠకుల మనస్సుల్లో చెరగని ముద్ర వేసుకునేదంటే అతిశయోక్తి కాదనుకుంటాను.

1959 వరకూ కుబేరా ప్రెస్, టెంపో పబ్లికేషన్స్, కుబేరా ఎంటర్ప్రైసెస్ సంస్థలని స్థాపించి శిఖరాగ్రాలకి తీసుకెళ్ళాడు. ప్రింటింగ్ ప్రెస్సేదయితే, పబ్లిషింగ్ టెంపో సంస్థ, సేల్స్ అండ్ అదర్ ఏన్ పెక్ట్స్ కుబేరా ఎంటర్ప్రైజస్ ది.

తనకింద పనిచేసేవారిని, ప్రెస్ వర్కర్లని ఆప్యాయంగా చూసేవాడు. అంతా అతన్ని ఆత్మబంధువుగా చూసేవారు తప్ప యజమానిగా చూడలేదు.

## 7

59 లో మావారు జలోదరంతో పోయారు. ఇంత కాలం యిద్దరం ఒకటిగా పని చేశాం. అక్కడికి కొత్తే

అతనే అడుగడుక్కీ జ్ఞాపకం వస్తాడు. నేను పని చెయ్య లేనని, ప్రెస్ కెళ్ళడం మానేశాడు

అంతకాలం అన్నగారితో వుండేవాడు. మా వారు పోయాక మకాం మా యింటికి మార్చి మాతో వుండ సాగాడు. చివరివరకూ మా కష్టసుఖాల్లో పాలుపంచు కుంటూ జీవించాడు.

నా తండ్రి నా చిన్నతనంలోనే పోయారు. తోడ బుట్టినవాళ్ళెవరూ లేరు. అప్పటికి నాకు ఐదుగురు కొడుకులు, నలుగురు కూతుళ్ళు. పెద్దవాడికి ఎనిమిదేళ్ళు. ఆఖరి అమ్మాయి తండ్రి పోయిన ఆర్నెల్లకి పుట్టింది.

పెద్దల్లో కొందరు నన్ను ఏదైనా సహాయం కావలి స్తే అడుగు చేస్తాం అన్నారు. మరికొందరు నోరు తెరిచి ఆ మాట అంటే బరువు బాధ్యతలు ఎక్కడ నెత్తిన పడ తాయో అని బెరుకుతో గప్‌చుప్‌మని వూరుకున్నారు. అయినా ఎవరి కుటుంబాలు వాళ్ళకున్నాయి. ఎవరి సాయం అడగలేం.

'ఎలాగా బ్రహ్మచారిగా వుండదలిచావు. అన్న కూతురు కోసం ఎందుకంత బరువు నెత్తి నెత్తుకుంటావు? నువ్వు మాట్లాడకూరుకుంటే, ఎవరో ఒకరు సాయం చేస్తారు. ఏ పల్లెటూళ్ళోనో వుంటారు నీకు తోచినప్పుడు నువ్వు కూడా తోచినది పంపి సాయం చెయ్య' అని సలహా యిచ్చారు మరికొందరు.

పెద్దల సలహాలను పెడచెవిని పెట్టి, దృఢ నిశ్చ యంతో వచ్చి ఈ కుటుంబాన్ని లేవనెత్తే బాధ్యత చేపట్టాడు. మా చిన్నబ్బాయిని, వాళ్ళ నాన్నగారున్న ప్పుడే, పుట్టగానే, నేను పెంచుకుంటానన్నాడు. ఆయన సరే అనగానే, వాడు మా దగ్గరే వున్నా, వాడి

ఆలనాపాలనా తనే చూసుకునేవాడు.

రామకృష్ణ, సుజాత, అరుణ అని పెద్దపిల్లలకి వాళ్ళ నాన్నగారు స్కూల్లో వేసేప్పుడు పేర్లు పెట్టేరు. మాకు చిన్నప్పుడు నామకరణం చేసే ఆనవాయితీ లేకపోడం వలన. ఆఖరి మగ్గురుకీ ఆయన లేకపోవడంతో వెంపో రావ్ పెట్టేడు పేర్లు. మూడో అమ్మాయికి పద్మ అని పేరు పెట్టాడు.

చిన్నతనంలోనే రమణాశ్రమం వెళ్ళ్ళాడు. రమణ మహర్షి, శివానంద రామదాస్, అరబిందోల ఫిలాసఫీలని చదివాడు. అందరిలోకి అరబిందో ఫిలాసఫీ అతన్ని అమితంగా ఆకర్షించింది.

తరచుగా ఆశ్రమానికి, అంటే ఏడాదికి నాలుగు సార్లు వెళ్తూండేవాడు. అందుకే తను పెంచుకున్న కొడుక్కి అరవింద్ అని పేరు పెట్టాడు. మా ఆఖరి అమ్మాయిని కూడా తన పెంపుడు కూతుర నేవాడు. దాని పేరు పాండీచేరీ మదర్ పేరు, మీరా.

అరవింద్ ని తన పక్కనే పడుకో బెట్టుకుని, నిరంతరం తనతోనే వుంచుకుని, తన ఆరో ప్రాణంగా చూసుకునే వాడు. రచయితలకి ఎమోషన్స్ ఎక్కువ. సున్నిత హృదయం వాళ్ళది అని చెప్పేవాడు. చిన్నపిల్లల్నెవర్నీ యెవరూ యేమీ అనకూడదు. యేడిపించకూడదు. వాళ్ళ కేదైనా అనారోగ్యం వస్తే తనకు వచ్చిన కంటే ఎక్కువగా బాధపడేవాడు. వాళ్ళు మళ్ళీ ఆరోగ్యంగా తిరగ గలిగేవరకూ తిండీ నిద్రా లేకుండా వాళ్ళ మంచం పక్కనే కూర్చునేవాడు.

పిల్లల విషయంలో కూడా కొన్ని అభిప్రాయా లుండేవి. ఈనాడు చిన్నపిల్లల్ని మాటలు వచ్చీరాగానే

స్కూల్లో వేస్తున్నారు. వాళ్ళు స్కూలు కెళ్ళడానికి ఏడుస్తూంటే బలవంతంగా పంపే తల్లుల్ని చూసి చాలా బాధపడేవాడు. వాళ్ళ చదువుకోసం కంటె యింట్లో వాళ్ళ బెడద వదుల్చుకోడానికి పంపుతారు వాళ్ళని స్కూలుకి. తల్లి ఒళ్ళో పడుకుని పాలు తాగి, ఆడే పాడే వయస్సులో వాళ్ళనలా కట్టడి చేసి, బాధపెట్టడం అన్యాయమనేవాడు. వాళ్ళంతట వాళ్ళు చదువు విలువ తెలుసుకుని స్కూలు కెళ్ళి చదువుకోవాలి. ఆ వయస్సులో వాళ్ళకి స్వేచ్ఛ లేకపోతే యింకెప్పుడుంటుంది అనేవాడు.

ఒకమారు మీరాని స్కూల్లో ఒక మాస్టర్ కొట్టారు. వెంటనే అది విని రుద్రరూపం దాల్చాడు. దాన్ని తీసుకుని స్కూలు కెళ్ళాడు దండయాత్రకి. ఆ హెడ్ మాస్టర్ మా బంధువు. ఆయన ఎదురొచ్చి, సారీ చెప్పి ఇటుపైన నేను చూసుకుంటాను ఎవరూ కొట్టకుండా అని హామీ యిచ్చాక కాని శాంతించలేదు.

చిన్నపిల్లల్ని తనెప్పుడూ కొట్టలేదు. ఎవర్నీ కొట్టనివ్వలేదు. పెద్దపిల్లల్ని తప్పు చేసినప్పుడు రెండు మూడు దెబ్బలు వేసినా, తరవాత పిల్చి, వాళ్ళు చేసిన తప్పు విడమర్చి చెప్పి అలా చేసి తనకు కోపం తెప్పించకూడదు, అని బోధించేవాడు. వాళ్ళని కొట్టవలసి వచ్చినందుకు ఆ రోజంతా చాలా బాధపడేవాడు.

పిల్లల విషయంలో మా యిద్దరి మధ్యా వాగ్వివాదాలు జరిగేవి. నాకు కోపం వస్తే ఒకటి రెండు రోజులు మాట్లాడకుండా వుండేదాన్ని. అటువంటప్పుడు నన్ను పిలిచి చిన్న చిన్న విషయాల కిలా కోపగించుకోకూడదు, పిల్లలు మనకి ఆనందాన్ని యివ్వడానికి కారకులు కావాలి.

కాని మనల్ని శత్రువులు చెయ్యడానికి కాదు, అని చెప్పేవాడు.

మోహనరావ్‌కి చిన్నప్పటినుంచీ నేనంటే అభిమానమే. స్కూలు నుంచి వచ్చేప్పుడు, వెళ్ళేప్పుడు ఎక్కడేనా కనిపిస్తే, వెంటనే కారాపి ఎక్కమనేవాడు. నన్ను దిగవలసిన చోట దింపి వెళ్ళిపోయేవాడు.

ఒకసారి నా చిన్నతనంలో మా పిల్లలందర్నీ ఎగ్జిబిషన్‌కి పంపింది మా పిన్ని రావ్‌ని తోడిచ్చి. ఒకచోట ఒక చిన్న లెదర్ పర్స్ చూశాను. నాకు చాలా నచ్చింది. ఒకమారు పట్టుకుని చూసి ధర అడిగి వదిలేశాను.

కాస్సేపు అయ్యాక ఒక పేకెట్ నా చేతిలో పెట్టాడు రావ్. అది నేనంతకు ముందు చూసి వదిలేసిన లెదర్ పర్స్. ఇప్పుడెందుకు అని మాటవరస కన్నానే కాని నాకు చాలా సంతోషమేసింది. నేను కావాలనుకున్నది నే నడగకుండా నా చేతిలోకొచ్చింది. నాకెవర్నీ అడిగే అలవాటు లేదు చిన్నప్పటి నుంచీ. అమ్మని కూడా అడగలేదెప్పుడూ. ఆ పర్స్ నే నింకా దాచుకున్నాను.

మెట్రిక్ పరీక్ష పాసయితే వాచీ కొనిస్తానని అమ్మ ఆశపెట్టింది. అందికదా అని అమ్మని ఒకమారు అడిగాను తెగించి. ఏవిటడుగుతున్నావ్ మీ అమ్మని, అని అడిగాడు రావ్. చెప్పాను. ఇంక అమ్మని అడక్కు. నే నిస్తాను అన్నాడు. నాకు వాచీ కొనిచ్చాడు. నాకే కాదు, తన చెల్లెళ్ళకి, అన్నయ్యల పిల్లలకి, అలా చేతిలో డబ్బుంటే ఏదో ఒకటి కొనియిచ్చేస్తూండేవాడు.

మా వారు పోయాక నేను ప్రయివేటుగా హైకి

చదువుదామనుకున్నాను. అది అంతమంది పిల్లలతో సాధ్యం కాదనిపించింది. టైప్, షార్ట్‌హాండ్ నేర్చుకుందామనుకున్నాను. ఆ రోజుల్లో ఆడవాళ్ళు ఆఫీసుల్లో పనిచెయ్యడమే తక్కువ. చేసినా టైపిస్టులుగానూ, టెలిఫోన్ ఆపరేటర్లుగానూ వుండేవారు. వాళ్ళని కూడా పనిచేసే మగవారు ఎలా చూస్తారో చెప్పాడు.

నువ్వెక్కడికీ వెళ్ళి పని చెయ్యక్కర్లేదు. నా దగ్గరే చెయ్యి. ఆఫీసుకి వెళ్ళినట్లు పొద్దున్నుంచీ సాయంత్రం వరకూ చెయ్యి. అన్నాడు.

అప్పట్లో కొంపోరావ్ భారత్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ అనే కంపెనీ స్థాపించాడు. ఆఫీసు యింట్లోనే వుండేది. వివిధ సంస్థల నుంచి పుస్తకాలు, అనేక పద్ధతులమీద డిస్ట్రిబ్యూషన్‌కి తీసుకుని, మన దేశంలో అనేక ప్రదేశాలకి పంపేవాళ్ళం. పుస్తకాలు బర్మా, మలేసియా వంటి దేశాలకి, వార్ ఫ్రాంట్‌కు కూడా పోయేవి. దానికి ప్రొప్రయిట్రెక్స్‌గా నా పేరుంచాడు. తను మేనేజింగ్ డైరక్టరు.

అప్పట్లో నాకేం తెలీదు. చెక్కు బుక్కుమీద యెక్కడ సంతకం పెట్టమంటే అక్కడ పెట్టేదాన్ని. తను కథలు, నవలలూ డిక్టేట్ చేస్తే రాసేదాన్ని. ఆ తరవాత ఆఫీసు పని, బాంకి పన్లు అన్నీ నేర్పి నన్నొక మనిషిగా రూపొందించాడు.

పనులయ్యాక పిల్లల్ని తీసుకుని బీచ్‌కి, డ్రైవిన్‌కి వెళ్ళేవాళ్ళం.

ఆదివారాలు గిండీ రేసెస్‌కి వెళ్ళేవాడు డి. వి. రామారావుగారితో. కొంత మొత్తం పోగొట్టుకున్నాక తనకే అనిపించింది, రేసెస్‌లో తను పోగొట్టుకున్న

సొంతం ఇంకో విధంగా వుపయోగిస్తే బావుండేదని. ఆ తరవాత రేసెస్‌కి వెళ్ళడం మానేశాడు.

# 8

రాసేప్పుడు టెంపోరావ్ కసలు టైమ్ తెలిసేదికాదు. ఆకలి నిద్ర అసలుండేవి కావు. రాయడం మొదలుపెడ్తే అది అలా ప్రవాహంలా సాగిపోతూ వుండాలి. మధ్యలో ఆగితే కథా సంవిధానం దెబ్బతింటుందనేవాడు. సోషల్ అయినా, డిటెక్టివ్ అయినా రాసేప్పుడు ఆ పాత్రలలో లీనమయిపోయేవాడు.

అసలు భోజనప్రియుడైన టెంపోరావ్ రాసే టైంలో తిండి సరిగ్గా తినకుండా వుంటే బాధగా వుండేది. తన కిష్టమైన మావిడికాయ పప్పు, తెలగపిండి కూరల్లాంటివి చేసినా వాటి రుచిని అనుభవించలేక పోయేవాడు. కథకి ప్రాణం పొయ్యాలంటే అంత నిష్టతో కూర్చోవాలనే వాడు. పాత్రలలో లీనమయి సకల బాధలు, ఉద్రేకాలు అనుభవిస్తూ అప్పుడప్పుడు వాటితో పాటు ఏడ్వడం కూడా జరిగేది.

ఎప్పుడూ ఏడ్చి ఎరగని మనిషి ఆ సమయంలో అలా కళ్ళమ్మట నీళ్ళు కార్చుతూవుంటే ఆశ్చర్యంగా వుండేది. టెంపోరావ్‌కి ఏడ్చేవాళ్ళంటే నచ్చేది కాదు. నా కసహ్యం. నేను చూసి భరించలేను అనేవాడు. తల్లి పోయినప్పుడు, మా వారు పోయినప్పుడు మాత్రం అతని కళ్ళమ్మట నీళ్ళు కారడం చూశాం.

పరశురామ్ కథలు రాసేప్పుడు కృష్ణయ్య వంటలు రానూ-తే నోరూరేదో, ఆకలేసేదో, వెంటనే అన్నం పెట్టమనేవాడు. భోజనంలోని రుచిని ఆస్వాదించకుండానే, ఏదో అయిందనిపించి మళ్ళీ రాయడంలో

నిమగ్నుడయేవాడు. అప్పుడప్పుడు ఆ ఉద్వేగం జ్వరం వచ్చినట్టుంటుంది. అసలు జ్వరం వస్తే బావుంటుంది. అప్పుడు మంచి మంచి ఆలోచనలొస్తాయి అనేవాడు.

మొదట్లో మా పింతండ్రిగారింట్లో వున్నప్పుడు మా పెద్ద తమ్ముడు గోపాల్ రాస్తూండేవాడు. తను కాలేజీ చదువుల కళ్ళాక సూర్యం అనే పత్రాడ్ని పదిర్చేడు. సూర్యం తను డిక్టేట్ చేసే స్పీడ్‌కి రాయలేకపోయేసరికి, టెలిఫనీకన్ టేప్ రికార్డర్ కొని అందులో రికార్డు చేసి వుంచుతే తరవాత సూర్యం దాన్ని రాసి ప్రెస్‌కిచ్చేవాడు. కబేరా ప్రెస్‌లో వున్నప్పు డిలాగే జరిగేది.

పగలు ప్రెస్, ఆఫీసుల పనితో తీరికలేక రాయడం జరిగేది కాదు. అంచేత రాత్రిళ్ళు కథని టేప్ రికార్డర్లో రికార్డు చేసేవాడు. మా యింటికి వచ్చాక తను డిక్టేట్ చేసే నేను రాసేదాన్ని. కాని రాత్రిళ్ళు నిద్రకి ఆగలేక పోయేదాన్ని ఆ టైమ్‌లో తను రాసుకునేవాడు.

ఒక చేత్తో సిగరెట్ వెలుగుతూంటే రెండో చేత్తో రాసేవాడు. సిగరెట్ అవగానే ఏష్‌ట్రేలో పడేసి మరో సిగరెట్ వెలిగించడం ఆటోమేటిక్‌గా జరిగిపోయేది. అప్పుడప్పుడు హాట్ డ్రింక్ తోడయేది. డ్రింక్ తాగుతూ సిగరెట్ కాలుస్తూ కథ రాస్తూంటే ఎన్నో పర్యాయాలు కాలే సిగరెట్ ఒళ్ళోను, పక్కమీద పడి బట్టలంటుకున్నాయి.

ఓ సారి చొక్కాలో పడి చురుక్కుమనేసరికి చూసు కున్నాడు. చొక్కా బనియన్ కాలుతున్నాయి. ఏవిటయ్యా ఈ పని అంటే, యేం చెయ్యను తెలీలేదు అన్నాడు.

1950-60 మధ్య టెంపోరావ్ రేడియోకి యెన్నో

నాటకాలు రాశాడు. వాటిలో కనిపించని మనిషి, అర్ధ రాత్రి, వంటింటి కుందేలు నాటకాలు బాగా ప్రసిద్ధి కెక్కాయి.

కనిపించని మనిషి నాటకంలో డిటెక్టివ్ పాత్రగా ప్రసిద్ధ నటులు జగ్గయ్య నటించారు. శ్రీమతి జానకి కూడా అందులో నటించారు. అందులో ఒక పాత్ర చేత తన శ్రేష్టమైన తెలగపిండి కూర గురించి చెప్పిస్తే, జానకి ఆ కూర టెంపోరావ్ శ్రేష్టుని తెలిసి, తను స్వయంగా వండి పంపించారు.

అర్ధరాత్రి నాటకం అనేక భాషల్లోకి తర్జుమా అయి దేశంలోని వివిధ కేంద్రాలనుంచి, అమృత్ సర్, లూధియానా, జలంధర్ మొదలగు ప్రదేశాలు, మళ్ళీ మళ్ళీ ప్రసారమయింది.

స్వాతంత్ర్యం వచ్చాక రచనల్ని మాతృభాషలో సాగించినా, ఇంగ్లీషు కథల్ని రాసి కేరవాన్, ఆడమ్ అండ్ ఈవ్, సండే స్టాండర్డ్ వంటి పత్రికలకి పంపే వాడు. ప్రసిద్ధికెక్కిన క్రిస్టియన్ కిలర్ కథని ఇంగ్లీషులో పెన్ నేమ్‌తో రాశాడు.

ఇంచుమించు 1970 వరకూ డి. బి. డి. చాలా ఉచ్ఛ స్థితిలో నడిచింది. ఆ తరవాత వ్యాపారం దెబ్బతింది. కారణాలేవైనా కావచ్చు. కారు పోయింది. అప్పు లెక్కువయ్యాయి. ఇంట్లో ఒక్కొక్క రోజు గడవడం కష్టమయ్యేది అయినా ధైర్యంగా పరిస్థితుల నెదుర్కొ న్నాడు టెంపోరావ్.

దేవుడిదగ్గ రెప్పుడూ దీపం వెలిగించలేదు. గుడికి వెళ్ళ లేదు. అయితే నాస్తికుడు కాడు. దేవుడంతటా వున్నాడు. మనస్ఫూర్తిగా ఉన్నచోటు నుంచే భగవం

తుని ప్రార్థిస్తే చాలనే తత్వం అతనిది. రోజూ యేదో ఒక సమయంలో శ్రీ అరబిందో, మదర్ ఫోటోల ముందు కూర్చుని మెడిటేషన్ చేసేవాడు. ఎల్లప్పుడూ ఓం ఆనందమయీ, చైతన్యమయీ, సత్యమయీ పరమే అని అనుకునేవాడు.

అతని నమ్మకం వమ్ముకాలేదు. క్లిష్ట పరిస్థితుల్లో ఏదో విధంగా సహాయం లభించేది. ఏదీ లేకపోతే ఒక కథ రాసి విజయబాపినీడు గారికో మరెవరికో పంపిస్తే ఆరోజు ఖర్చుకి సరిపోయేది.

నాకు జబ్బుచేసి ప్రాణాపాయ స్థితిలో వుంటే ఆహారం నిద్ర మాని హాస్పిటల్స్ చుట్టూ తిరిగి రక్తం, మందులూ అన్నీ సమకూర్చాడు. నేను మళ్ళీ తిరిగి యింటికి వచ్చేవరకూ మనిషికి నిమిత్తం లేకుండా పోయింది.

బ్రహ్మచారి. తన అన్నగారింట్లో వుండి వుంటే చిన్నాన్న కూర్చున్న చోటినుంచి కదలకుండా రాజులా జీవించి వుండేవాడు. కాని అవన్నీ కాదని మా బరువు బాధ్యతలని చేపట్టినందుకు, మాతోపాటు కష్ట నష్టాల నోర్చి మేము తిన్నదే తిని కొనసవరకూ సాగాడు.

మా పెద్దవాడు మైలాపూర్‌లో వుండి ఉద్యోగానికి కోటూరు వెళ్ళడం కష్టంగా వుంటోందని విల్లివాకంలో కాపురం పెట్టాడు భార్యా, పిల్లలతో. కాని మా అందరితో కలసి వుండి, వేరుగా వుండడం నచ్చక, టెంపో రావ్ అంతదూరం వస్తాడో రాడో అనే సంశయంతో, మెల్లిగా టెంపోరావ్‌ని, "మీరు కూడా అక్కడికి వచ్చేస్తే అందరం కలిసి వుండొచ్చు" నని అడిగాడు. వెంటనే, "ఇల్లు మాడు, వుందాం" అన్న సమాధానం వినగానే చాలా సంతోషమయింది.

మైలాపూర్‌లో వున్నా, విల్లివాకంలో వున్నా తన దినచర్యల్లో మార్పులేదు. తన రచనలు కావల్సిన పబ్లిషర్స్ అక్కడికే వచ్చి డబ్బిచ్చి రాయించుకు నేవారు. ఎప్పుడూ ఎక్కడికీ వెళ్ళే అలవాటు లేదు. రోజూ ఒక మారు ప్రొద్దుటో, సాయంత్రమో నడిచి వచ్చేవాడు. చల్లగాలిలో. వేళపట్టున కాఫీ—టిఫిన్, భోజనం, మూడ్ వచ్చినప్పుడు రాసుకోడం. సిగరెట్లూ, అప్పుడప్పుడు హాట్ డ్రింక్స్. ఇవే అతనికి ముఖ్యమైనవి.

కొత్తగా పబ్లిషింగ్ పెట్టుకున్నవాళ్ళు మీ రొక నవల మాకియ్యాలి. మొదట మీ నవల వెయ్యాలి, ఎక్కువిచ్చుకోలేను అంటే "డబ్బు చూడందే నాకు మూడ్ రాదు. నువ్వెంత ఇయ్యదల్చావో అంతే ఇయ్యి" అనేవాడు వాళ్ళతో. ఇచ్చింది పుచ్చుకుని, వాళ్ళకి నవల రాసిచ్చేవాడు. డ్రింక్, సిగరెట్, భోజనం వుంటే ఇంకెందుకు కావాలి డబ్బు అనేవాడు.

# 9

టెంపోరావ్ అభిమానుల్లో కొందరు మా కుటుంబ సభ్యులుగా కలిసిపోయారు. వక్కంతం సూర్యనారాయణరావు (వి.యస్. రావ్), పుంగనూర్ వాస్తవ్యుడు సత్యం, నీలారాజ్, శారద ముఖ్యులు.

వి. యస్. రావ్ తరచు మా యింటికి వచ్చేవాడు. టెంపోరావ్ రాకుండా పెళ్ళి చేసుకోననీ, తనకి ఎప్పుడు వీలుంటుందో రాస్తే అప్పుడే ముహూర్తం పెట్టేస్తాననీ రాశాడు. స్వంత అక్క చెల్లెళ్ళ యిళ్ళల్లో పెళ్ళిళ్ళకూడా వెళ్ళని టెంపోరావ్‌కి ఈ అభిమాని పెళ్ళికి వెళ్ళక తప్పలేదు.

సత్యం కూడా మొదట టెంపోరావ్ అభిమానిగా

అడుగు పెట్టేసా, తరవాత మా కుటుంబంలో ఒకడుగా అయిపోయేడు. మా కష్టసుఖాలలో పాలు పంచుకునే వాడు. వీళ్ళిద్దరూ నన్ను అక్కా అని పిలుస్తారు.

1974 లో ఒక అభిమాన సంఘం వీళ్ళ ఆధ్వర్యంలో పుంగనూరులో మేళతాళాలతో ఘనంగా సన్మానించి "డిటెక్టివ్ సాహిత్య పితామహ" అని బిరుదు ప్రదానం చేసింది. ప్రఖ్యాత కవి శ్రీశ్రీ ఆధ్వర్యాన జరిగిన ఈ సన్మాన సభలో శ్రీ ధనికొండ చేతులమీదుగా బిరుదు ప్రదానం జరిగింది. పలువురు అభిమానుల ప్రశంసలతో సావనీర్ కూడా విడుదల చేశారు.

మాతో నిరంతరంగా వుండడానికి సుభద్రగారి పిల్లలెంత అదృష్టవంతులో అంది నీలారాజ్. నువ్వు కూడా నా పిల్లల్లో ఒకత్తివి కావచ్చు, అన్నాను. అప్పట్నుంచీ నన్ను అమ్మా అని పిల్చేది. మద్రాసు వచ్చినప్పుడు మా యింటికి వచ్చి ఎక్కువ సమయం గడిపేది.

రచయిత్రి లత మద్రాసు వచ్చినప్పుడు మా యింటికొస్తూండేవారు. "అప్పుడప్పుడు యేదేనా పుస్తకం చదవాలనిపిస్తే మీ పుస్తకం తెప్పించుకుంటాను" అనేదామె.

మిమ్మల్ని చూస్తే నాకు జెలసీ అన్నారు సంజీవరెడ్డి. ఆ దేవిటండీ అని ఆశ్చర్యపోతే, మా ఆవిడ తలగడకిందంతా మీ పుస్తకాలే. ఎప్పుడు మాట్లాడదామని పిల్చినా ఇదిగో వస్తున్నా, అయిపోయిందంటుంది కాని రాదే, అన్నారుట.

మీ పుస్తకాలు చదవకుండా మేం పెద్దవాళ్ళ
డయ్యాం, అని కొందరంటే, కాలేజీ రోజుల్లో
స్తకాలే చదివేవాళ్ళం అనేవా రింకొందరు.

మా పిల్లలు అక్షరాలు కూడి చదవడం వచ్చినప్పటి నుంచీ రావ్ పుస్తకం రాస్తూంటే చదివేసేవారు. మద్రాసు వచ్చే మా చుట్టాలు, స్నేహితులు ఎక్కడెక్కడి నుందో కొంపల్లె రావ్ ని చూడ్డానికి, లేకపోతే చూపించడానికి వస్తూండేవారు.

విల్లివాకం కొరట్టూరు వచ్చాక ఎక్కువగా అభిమానుల మధ్యే మెలగుతూ వచ్చేడు. ఇక్కడ తెలుగు వాళ్ళ సంఖ్య ఎక్కువ. కథలు రాసే కొంపల్లె రావ్ గారేనా ఈయన, ఇక్కడే వున్నారా, అంటూ చూడ్డానికి వచ్చేవారు. పదో క్లాసు చదివే పాపాయి నుంచి రిటైరయిపోయిన తాతయ్యల వరకూ వుండేవారు ఆ వచ్చేవాళ్ళు.

ఒకమ్మాయికి పెళ్ళయినట్లు కలొచ్చింది. తదుపరి కొంపల్లె రావ్ ఫోటో ఏదో పుస్తకంపై చూసి తనని కలలో వివాహమాడిన వ్యక్తిగా గుర్తించి, చాలా కాలం తరవాత తమ్ముడికి చెప్పింది. ఆ తమ్ముడు అడ్రసు తెలుసుకుని వుత్తరం రాశాడు. మేమంతా 'వయస్సేం మించిపోలేదు. ఇప్పుడైతే నేం ఆ అమ్మాయి కలని పండించు' అన్నాం.

నేను బ్రహ్మచారిగానే జీవించదలిచాను. దాని కింక మార్పులేదు, నన్నిలాగే వుండనీండి, నా మీద యెటువంటి ఆశలూ పెంచుకోవద్దని, వాళ్ళకి ఉత్తరం రాశాడు.

సర్వేపల్లి రాధాకృష్ణగారి కూతురు కస్తూరి రుక్మిణమ్మగారు వాళ్ళ నాన్నగారిని చూడడానికి వెళ్ళేప్పుడు దారిలో మా యింటిదగ్గర ఆగి పుస్తకాలు పట్టువారు. పుస్తకం ప్రారంభిస్తే చివరవరకూ వ

కష్టం అనేవారావిడ. ఎవరేం చెప్పినా నిండుగా హాయిగా నవ్వేసేవారు. ఏది ఏమయినా వీటివల్ల ప్రజల్లో చదవాలనే ఉత్సాహం పెరిగింది. అదే కావల్సింది అనేవాడు.

సన్మానం జరిగినప్పుడు ప్రచురించిన సావనీర్‌లో అభిమానులు టెంపోరావ్ పై తమకున్న అభిమానాన్ని అనేక విధాల వెల్లడించారు.

వి. యస్సాస్త్రివ్ టెంపోరావ్ నవలల్లో రాసిన సుభాషితాలని యేరి కూర్చి వివరించారు. రాజనువ్వార్, రామన్, రాజ్ బాబు, లలితా పీటర్స్, మురళీధర్, సూర్యకాంతం ఎస్. బి. గార్లు అభిమానంతో తమ సందేశాలను పంపించారు. శ్రీమతి సూర్యగారో ప్రత్యేక బహుమతి కూడా యిచ్చారు ఆ సంవత్సరం పుట్టిన రోజుకి.

విశాఖపట్నం, కాకినాడ, నాగార్జునసాగర్ వంటి ప్రదేశాల నుంచి మీకు సన్మానం చేస్తామంటూ ఆహ్వానించారు. ఇప్పుడు కాదు, నేను చెప్తాను ఎప్పుడో అనేవాడు కాని. ప్రయాణాల్లో వుండే అనాసక్తత అతన్ని అవరోధించేది.

వయసు అవుతూన్న కొద్దీ రాయని వేళల్లో, మనవలతో ఆడుకోవడం, టి. వి. ప్రోగ్రాం చూడడం ఇవే తన కాలక్షేపాలు. మా పెద్దబ్బాయి కొడుకు విష్ణు కుమార్‌ని కూడా తిప్పుకుని, చాక్లేట్లు బిస్కట్లు కొంటూండేవాడు. వాడిని అందరూ విష్ణు అని పిలిస్తే తను మాత్రం బాబా అని పిల్చుకునేవాడు.

# 10

డిటెక్టివ్ సాహిత్య పితామహ అని బిరుదు పొందినా, సాంఘిక నవలలు కూడా రాశాడు టెంపో రావ్. "నాలో ఏముంది, ఒక నాటి అపరాధం, పునర్జన్మ" కొన్ని మచ్చుకి.

"నాలో ఏముంది" తను రాసిన నవల లన్నింటిలోకి అణిముత్యం అనవచ్చు. దాన్ని అందరు మెచ్చుకుంటూంటే వచ్చిన ఆనందం కంటె, మా అన్నయగారు కౌగలించుకుని, "చాలా మంచి నవల రాశావు, అయామ్ ప్రౌడాఫ్ యూ," అన్నప్పు డొచ్చిన ఆనందం మిన్న అన్నాడు. ఆయన తన పిల్లల్ని, మీలో ఎవరేనా ఒకళ్ళు టెంపో రావ్ లా రాయడం నేర్చుకుని రచయిత అవండి, అన్నప్పుడు కూడా అలాగే ఆనందించాడు.

అన్నగారి స్నేహితుడు, సుబ్రమణ్యంగారు, హిగిన్ బాదమ్స్ లో పని చేసేవారు. ఆయనొచ్చి ఏవిటా కథ అంత పొగుడుతున్నారు అని అడిగాడు. ఆయనకి కథనంతా ఇంగ్లీషులో చెబుతూంటే ఆయన నిజంగా మంచి కథ, చాలా బావుంది, అని మెచ్చుకున్నారు. "నాలో ఏముంది" నాలుగు ఎడిషన్స్ ముద్రించారు.

ఒక నాటి అపరాధం నవలలో ఒకమ్మాయి కన్యగా వున్నప్పుడే మోసగించబడి కొడుకుని కంటుంది. ఆ బిడ్డని తమ బిడ్డగా తల్లిదండ్రులు పెంచి, ఆమెకి మళ్ళీ పెళ్ళి చేస్తారు. ఆ తరవాత ఒక సందర్భంలో నిజం భర్తకి తెలిసినప్పుడు ఆమె ఒణికిపోతుంది. పిల్లవాడు మనదగ్గరే పెరుగుతాడు. అని భర్త అన్నప్పుడు ఆనందిస్తుంది.

ఒక సినిమావాళ్ళు కథ కావాలన్నప్పుడు ఈ కథ చెబితే కథ బావుంది కాని, ఎండింగ్ ఏంటీసెంటి

మెంట్ గా వుందన్నారు. కాని తరవాత్తరవాత అటు వంటి సబ్జక్ట్సు చాలా వచ్చాయి.

ఆధునిక స్త్రీ ఎలా వుండాల నేది "నాలో ఏముంది" లోని మీరా పాత్ర ద్వారా తెలియపర్చాడు టెంపో రావ్. "పునర్జన్మ" నవలలో పైకి పాత చింతకాయ పచ్చడి పతివ్రతల కథలా కనిపించినా, ప్రేమతో జయించలేనిది లేదని నిరూపించాడు.

"అర చేతిలో స్వర్గం"లో స్నేహంలో వుండే మంచి దనాన్ని చూపించి, తియ్యటి స్నేహం ద్వారా స్నేహి తుడ్ని మార్చిన సత్యనారాయణ పాత్ర మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది. బందిపోటు ప్రతాప్ లో మనిషిలోని కసి కక్ష వీరత్వం కనిపిస్తుంది.

"తొలిచూపు ప్రణయం"లో కోటీశ్వరుడు కూతురు సామాన్య గుమస్తాని ప్రేమించి పెళ్ళి చేసుకోవాలను కుంటుంది. అక్కడ నువ్వు ఇమడలేవు నీకు సుఖం వుండదు. కావాలంటే ఒక ఆర్నెల్లు ప్రయత్నించి రా అంటాడు తండ్రి. ప్రేమించే భర్త ఆత్మీయుడుగా చూసుకునే అత్త గారి సమక్షంలో కూడా ఆమె పడే పాట్లు అతి సహ జంగా చిత్రించాడు రావ్.

ఇలా ఒక్కొక్క నవల ఒక్కొక్క తరహాలో ప్రేమ, సామాజిక దృక్పథాలను మిళాయించి అధు నాతన సమాజానికి కూడా సరిపోయేటట్లుగా వుండే వా నవలలు.

టెంపోరావ్ మొట్టమొదటి సోషల్ నవల మేలు కొలుపు ఇంగ్లీషులో టెంపో పత్రికలో ప్రచురింపబడిన వాయేజ్ త్రూ వామ్బ్లడ్ కి తర్జుమా. మొదటి డిటె క్టివ్ నవల "విందుకు వెళ్ళిన విమల", ఆఖరి నవల

"రోజా" అపరాధ పరిశోధన సప్లిమెంట్ ఆగష్టు సంచికలో వెలువడింది.

1965 లో 'అపరాధ పరిశోధన' ప్రారంభించినప్పటి నుండి దానికి గౌరవ సంపాదకులుగా వుంటూ వందలాది కథలు, నవలలు వ్రాశారు.

'రోజా' నవలికని జూన్ 27 పొద్దున్న పూర్తిచేసి క్రాంతి ప్రెస్‌కి పంపించాడు. అమ్మనీ టెంపోరావ్‌ని చూడాలని వచ్చిన మీరా ఆ రోజు ప్రయాణమవుతూంటే బస్టాండ్ దాకా వెళ్ళి సాగనంపాడు. నవల రాయడం పూర్తవగానే ఒక క్వార్టర్ బాటిల్ విస్కీ తీసుకుని విశ్రాంతిగా పడుకోడం అలవాటయింది చివరి రోజుల్లో. అదే ప్రకారం ఆ రోజు తీసుకుని పడుకున్నాడు.

జూలై ఒకటవ తేదీనుంచి జబ్బు ప్రారంభమయింది. మొదటిరోజు గుండెల్లో మంటగా ప్రారంభమాయి, మర్నాటికి ఆయాసంగా మారింది. ఫామిలీ డాక్టర్ నాగరాజన్ వచ్చి డెరిఫిన్ ఇంజక్షన్స్, ఇతర మందులూ యిచ్చారు. అప్పటికి నయమనిపించి రాత్రి మళ్ళీ వచ్చింది.

మర్నాడు డాక్టర్ మళ్ళీ పరీక్ష జరిపి వున్నవిషయం చెప్పారు. హృద్రోగం అన్నారు. నాగరాజన్ పేషెంట్స్‌ని అతి జాగ్రత్తగా ట్రీట్ చేస్తారు. టెంపో రావ్‌ని ఒక పేషెంట్ గా కాక, బంధువుగా, స్నేహితుడిగా చూస్తూ ట్రీట్ మెంట్ యిచ్చారు. జబ్బు కొంచెం తగ్గుముఖం పట్టినట్టనిపించింది.

జూలై 2వ తేదీ రాత్రినుంచీ సిగరెట్ ముట్టుకోలేదు. డ్రింక్ కూడా లేదు. ఇంక జీవితంలో సిగరెట్లు కాల్చనని

ప్రతిజ్ఞ చేశాడు. డాక్టర్ పెర్మిషనిస్తే డ్రింక్ తీసుకుంటానన్నాడు, బాగా తగ్గాక.

వారం రోజులయింది. ఆయాసం తగ్గినా ఏదో ఒక బాధ. నోటిపూత, అతినీరసం. ఇంక ఈ నీరసం తగ్గుతుందా అనే సందేహం పుట్టింది నాకు.

1979 లో డాక్టర్ ముద్దుకృష్ణా రెడ్డి డబుల్ హెర్నియా ఆపరేట్ చేశారు. ఆ తరువాత సిస్ట్ ఆపరేషన్, క్రానిక్ బ్రాంకైటిస్‌కి ట్రీట్‌మెంట్ ఇచ్చారు. ఆయన దగ్గర కెళితే తొందరగా తగ్గుతుందేమో అన్నాడు. పదిరోజుల తర్వాత మళ్ళీ ఆయాసం ఒక రెండు గంటల పాటు వచ్చింది. నాగరాజన్ వచ్చి ఇంజక్షన్ యిచ్చి వెళ్ళారు. కొంచెం తగ్గింది.

ముద్దుకృష్ణారెడ్డి గారితో అపాయింట్‌మెంట్ ఫిక్స్ చేసాను. మా తమ్ముడు పురూరవస్ (సుబ్బారావుగారి మూడో అబ్బాయి) భార్య ఉష గారు తీసుకువచ్చారు. మా పెద్దమ్మాయి సుజాత కూడా వచ్చింది వాళ్ళతో. రెడ్డిగారి నర్సింగ్ హోంలోకి తీసుకువెళ్ళాం.

మీరే నాకు సాయం చెయ్యాలి. నేను ఇంకా రాయాలి అన్నా డాయనతో.

ఆయన పరీక్ష చేసి చాలా ఎనీమిక్‌గా అయిపోయారన్నాడు. అవసరమైన టెస్టులు చేయించి ఎక్స్‌రే తీయించమని, మందులు రాసిచ్చారు. పదిరోజుల తర్వాత మళ్ళీ రమ్మన్నారు. పరీక్షలన్నీ అయ్యాక మందులు కొనుక్కుని యింటికి బయల్దేరుతూంటే పిల్లలు మైలాపూర్ వెళ్దాం రమ్మన్నారు. ఇప్పుడొద్దు. బాగా తగ్గాక మీ దగ్గర కొచ్చి రెస్టు తీసుకుంటా నన్నాడు. వాళ్ళు మమ్మల్ని కొరట్టూరులో ఇంటిలో దింపి వెళ్ళిపోయారు.

చాలా అలసటగా నీరసంగా వుంటున్నాడు. కొద్దిగా ఆహారం తీసుకుని నిద్రపోయాడు. సాయంత్రం నాగరాజన్ వచ్చి రెడ్డిగారిచ్చిన మందుల ప్రిస్క్రిప్షన్ చూసి ఓ నిముషం ఆలోచిస్తూ వుండిపోయారు. ఆ రిపోర్టులు కూడా తీసుకురండి చూద్దాం అన్నారు. రెడ్డిగారు చెప్పిన ఇంజక్షన్ యిచ్చి వెళ్ళిపోయారు.

నాగరాజన్ పథ్యంగా ఉప్పు తగ్గించి, కారం లేకుండా భోంచెయ్యమంటే, రెడ్డిగారు అన్నీ తినొచ్చు మన్నారేమిటీ, ఎందువల్ల అని సందేహం వెలిబుచ్చారు.

రాత్రి నిద్రకి మాత్రలు వేసుకుంటే నిద్రపట్టింది. మర్నాడు పొద్దున్న ఆయాసం కొద్దిగా వచ్చింది. కాని కొద్దిసేపటికి తగ్గింది. సాయంత్రానికి ఆయాసం మళ్ళీ ఉధృతంగా వచ్చింది. నాగరాజన్ వచ్చి తనంతవరకూ యిచ్చిన యింజక్షన్లే మళ్ళీ యిచ్చి కొంచెం నెమ్మదించే వరకూ వుండి వెళ్ళారు. కాని మరో గంటకి మళ్ళీ ప్రారంభమయింది. ఏదైనా నర్సింగ్ హోంలో చేరుస్తే బావుంటుంది, ఆక్సిజన్ డ్రిప్ పెడితే మంచిది అన్నారు డాక్టర్.

ముద్దుకృష్ణారెడ్డి గారి నర్సింగ్ హోంలో చేర్చడానికి అరేంజ్మెంట్స్ చేశాం. రెడ్డిగారు ఊళ్ళోలేరు. మర్నాడు వస్తామన్నారు. నాగరాజన్ గారు స్నేహితుడి కారు అరేంజ్ చేశారు. ఇరుగు పొరుగూ అంతా కలిసి టెంపోరావ్‌ని కార్లో కూర్చోబెట్టారు. నే నెప్పట్లా పక్కన కూర్చున్నా. నాగరాజన్, పైయింటి చెల్లపప ముందు కూర్చున్నారు.

కారు నర్సింగ్ హోంలో చేరింది అందరూ చేరి మెల్లిగా చేతులు పట్టుకుని నడిపించి గదిలోకి తీసుకెళ్ళారు.

పక్కమీద పడుకున్నాక డాక్టర్లు ఆక్సిజన్ డ్రిప్ ఎక్కించారు. తలగడా కావాలని అడిగి, అది తలకింద పెట్టగానే సరిచేసుకుని పడుకున్న టెంపోరావ్ మరింక కదలలేదు. గుండె ఆగిపోయింది. హార్ట్ మసాజ్, యింకా ఏవేవో ప్రయత్నాలు చేసి డాక్టర్లు అలిసిపోయారు కాని ఫలితం దక్కలేదు.

ఆ రోజు పొద్దున్న, నాగరాజన్ గారడిగిన ఎక్స్‌రే మిగతా రిపోర్టులు తేడానికి వెళ్తానన్నప్పుడు, ఇవాళ నన్నొదిలి ఎక్కడికీ వెళ్ళకు. సమ్‌థింగ్ టెల్స్ మీ అన్న మాటల అర్థం అప్పుడే తెలిసింది. ఇరవై అయిదు సంవత్సరాలకి పైగా కలిసి మాతో జీవించి మా కుటుంబాన్ని పైకి తేవడానికి అహర్నిశలూ పాటుపడిన టెంపోరావ్, తనొదిలి ఎక్కడికీ వెళ్లొద్దని నాకు చెప్పిన తను నన్నొదిలి వెళ్ళిపోయాడు.

నా తండ్రి నా చిన్నప్పుడే పోయారు. భర్తతో కూడా పూర్తిగా పదేళ్ళు జీవించలేను. కాని చిన్నాన్న టెంపోరావ్‌తో నా జీవితం పూర్తిగా 25 సంవత్సరాలు. ఆరుగురు పిల్లల్ని పెద్దచేసి, పెళ్ళిళ్ళు చేసి, వాళ్ళ పిల్లలందర్నీ చూశాక, ఇంక నే వచ్చిన పని అయిపోయిందని వెళ్ళిపోయాడు టెంపోరావ్.

  

జబ్బు ప్రారంభమైనా కథల ప్రపంచం టెంపోరావ్‌ని చివరివరకూ వదల్లేదు. కళ్ళు మూసుకుంటే ఎవరెవరో మనుష్యులు. ఏవేవో కథలు చెప్తూండేవాడట. సినిమా కథల్లా డిస్కస్ చేస్తున్నాం అన్నాడు.

జబ్బు ప్రారంభం అయ్యాక సిగరెట్లు మానేశాడు

దా. కాఫీ, రసం, పాలు ఏం తాగినా నాలుగయిదు ఉరుకుతున్న సిగరెట్లు ఎదురుగుండా నిలబడుతూంటాయి. కరకాల కథలు చెబుతాయి. ఎన్ని కథలో. నాకు గ్యం తగ్గాక అవన్నీ చెబుతాను ఒకరోజు.

మరొక సారి, ఈ కథలేవిటయ్యా నన్ను నిశ్చింతగా ద్రపోనివ్వడం లేదు కళ్ళు మూసుకుంటే కథలు, కథలు, న్ని కథలేమిటీ? అన్నాడు.

కథల ప్రపంచం, ఇంతకాలం నువ్వు ప్రపంచానికి థలు చెప్పావు. ఇప్పుడు మేం చెప్తాం నువ్వు వినమని మ మధ్యకి లాక్కుపోయింది మన టెంపోరావ్‌ని.

టెంపోరావ్ మనకు లేడు కాని, ఆయన రచనలు మన హృదయాలలో చిరకాలం నిలుస్తాయి.

—: ఇంక సెలవ్ :—

## పబ్లిషర్లకు మనవి

కీ. శే. టెంపోరావ్‌గారి నవలలు రీప్రింట్ చెయ్యాలనుకునే వారు ఈ క్రింది చిరునామాను సంప్రదించగలరు.

డాక్టర్ వి. సుభద్ర
3-H 0, సెంట్రల్ ఎవెన్యూ,
హౌసింగ్ బోర్డు కాలనీ, కొత్తూరు,
మద్రాసు - 600 0౫0.

# రాకాసి చేప

## నీలా

"సిగరెట్ పెట్టి లా విసురు" అన్నాడు రాజు.

మూడయిదుల పెట్టెను ఆ వైపుకు విసిరేడు ఆనంద్.

ఆ రోజు ఆదివారం. ఏదో ఒక ప్రోగ్రాం ఫిక్స్ చేసుకోవటానికి మొత్తం నలుగురు మిత్రులు అక్కడ సమావేశమయ్యారు. ఆ గది కృష్ణది. వారంతా పోస్టు గ్రాడ్యుయేషన్ చేస్తున్నారు. అందరూ ఆర్థికంగా మంచి స్థితిలో వున్నవారే. నారాయణ అంతకుముందే బయటకెళ్లాడు.

రాజు సిగరెట్ వెలిగించాడు.

"రాత్రి జాస్ చూశాను" అన్నాడు పొగ వదుల్తూ.

"పాతదేగా" అన్నాడు ఆనంద్.

"కేవలం టెక్నిక్ కోసం చూడాలంటే" అన్నాడు రాజు.

"అవును. "జాస్" నిర్మాణం వాళ్ళకి మాత్రమే చేతయింది. మనవాళ్ళయితే ఎంత ఆర్టిఫిషియల్ గా

చేస్తారో. విఠలాచార్య సినిమాల్లో దెయ్యాల్లా" ఆనంద్ అన్నాడు.

"కానీ స్టోరీ లేదు."

"సాహసాలకు పెద్ద కథేం అవసరంలేదు. ఎలా చిత్రీకరించారు నేదే ప్రధానం. జాన్ గాని, ఈ రోజు వస్తున్న హారర్ సినిమాలుగాని వీటికి కథతో సంబంధం లేదు" అన్నాడు ఆనంద్.

"కానీ ఒకందుకు వీళ్ళని అభినందించాలి. హ్యూమన్ సైకలాజికల్ ఫీలింగ్స్‌ను గొప్పగా రికార్డ్ చేస్తారు. ముఖ్యంగా యింకో క్షణంలో మృత్యువు ఎదురవుతుందని తెలిసినప్పుడు, అనుకోని ప్రమాదాల్లో చిక్కుకొన్నప్పుడు మనుషుల ప్రవర్తన, కంగారు, ప్రాణభీతి....ఓహ్ ఫంటాస్టిక్‌గా చిత్రీకరిస్తారు" తిరిగి ఆనంద్ వివరించాడు.

ఆనంద్ ఎక్కువగా ఇంగ్లీ సినిమాలు చూస్తుంటాడు. మార్షల్ ఆర్ట్స్‌కు చెందిన సినిమాల నుండి, అడ్వెంచర్స్, జేమ్స్‌బాండ్ చిత్రాలూ ఇంకా కౌబాయ్ చిత్రాలవరకూ, భారతదేశానికి అనుమతి అయ్యే చిత్రాల్లో సెక్స్, వయలెన్స్, క్రైమ్‌కు చెందినవే ఎక్కువగా వుంటాయి. ఫిలసాఫికల్ టచ్ వున్నవి బహు అరుదుగా వస్తుంటాయి.

"ఏమోరా అర్థమయి చావవు" అన్నాడు రాజా.

"నాకు మట్టుకు అర్థమవుతాయా? వాళ్ళ ఏక్సెంట్ వేరు. మనది వేరు. కేవలం టెక్నిక్ కోసం చూడాలంటే. పిటీ ఏమిటో తెలుసా? నేను చూస్తున్న సినిమాల్లోని దృశ్యాలన్నీ డైరెక్టుగా తెలుగు సినిమాల్లోకి వచ్చేస్తున్నాయి."

"అది సహజమే ననుకో" అన్నాడు రాజా.

"ఏమిటి సహజం. మన ప్రముఖ దర్శకులంతా కొంతా యిలా కొత్త ఇంగ్లీష్ సినిమా వస్తే చాలు వెంటనే వీడియోలు వేసుకు చూడటం మొత్తం కథనే వాడుకుంటే బాగుంటుందా. లేక కొన్ని బిట్లు చేరిస్తే చాలా అనే చర్చలు. ఫస్ట్ బ్లడ్ సినిమాను మనవాళ్ళు ఎప్పుడో తీశారు. ఒక్కసారి ఎద్దరికి ఒకే సినిమా నచ్చుతుంది. ఇక అది తియ్యటానికి పోటీలు" అన్నాడు ఆనంద్.

"నువ్వు సినిమాల గురించి చెబుతున్నావు. తెలుగులో వస్తున్న అనేక నవలల్ని డైరెక్టుగా ఇంగ్లీష్ నుండి దించేస్తున్నారట" అన్నాడు రాజా.

"ఓ రేయ్" అంటూ హుషారుగా లోనికొచ్చాడు నారాయణ.

"ఏమిట్రా ఏదన్నా విశేషం వుందా" అన్నారంతా.

"అవును. మనం యిప్పుడు "జాస్" చూడబోతున్నాం."

"రాత్రే చూశాంలే."

"వాడు జాస్ ఒన్ కాక టూ గురించి మాట్లాడుతున్నాడేమో."

"కాదు. జాస్‌లో మనం చూశామే అలాంటి రాకాసి చేపను చూడాలంటే వెంటనే బయలుదేరండి" అన్నాడు నారాయణ.

"సరిగ్గా చెప్పరా."

"ఇక్కడుకు సరిగ్గా ముప్పై కిలోమీటర్ల దూరంలో ఓ గ్రామం వుంది. ఆ సముద్రతీరంలో ఇప్పుడు పెద్ద తిమింగలం పడుంది."

"ఎవరు చెప్పారు?"

"ఇప్పుడే ఎవరో అనుకుంటుంటే విన్నాను."

"ఎన్ని రోజులయిందో పడి."

"నిన్నట."

"దాన్ని వేటాడేరా" అన్నాడు ఆనంద్ పాలో చనగా.

"ఏమో మరి."

"వేటాడమా, మన వలలూ, పడవలు ఎందుకన్నా పనికొస్తాయా?"

"మరెలా వచ్చింది. చచ్చి వొడ్డుకు కొట్టుకొచ్చిందంటావా?"

"అలానే కావచ్చు. లేకుంటే అలల్తోబాటు వొడ్డుకు కొట్టుకుని వచ్చుంటుంది. ఆ తర్వాత అక్కడ నుండి లోపలకు వెళ్ళటం సాధ్యమైవుండదు."

"తిమింగలాల వేట సాధ్యం కాదంటావా?" అన్నాడు రాజు.

"ఏమో ఆ విషయం తెలియదుగాని అవి కొన్ని ప్రాంతాల్లోనే సంచరిస్తుంటాయట. సృష్టిలో అన్నిటికన్నా పెద్ద జలచరం. అదీ చేపేనంటాగు కొంతమంది. వీటి దెబ్బకు మహానౌకలే తల్లక్రిందులవుతుంటాయట" అన్నాడు ఆనంద్.

"కానీ వెనకటి కాలంలో ఓ ముసలాయన ఏ వలలూ లేకుండా తిమింగలాన్ని వేటాడిన కథ మీకు తెలుసా?" అన్నాడు కృష్ణ....

"అబ్బే.... తెలియదు" అన్నారు ముగ్గురూ.

"భలే ఇంట్రెస్టింగ్ గా వుంటుంది. అఫ్‌కోర్స్ నేను విని కూడా చాలా కాలమయింది. సరిగ్గా గుర్తులేదుగాని

మొ త్తంమీద చెప్పగలను."
"చెప్పరా" అన్నారు ఆసక్తిగా.

## 2

ఆ గూడెంలో కిష్టయ్య వృద్ధ జాలరి. అతను బాగా ముసలివాడయిపోయాడు. కంటిచూపు కూడా దెబ్బ తింది. దగ్గరగా వున్న వస్తువుల్ని పరీక్షమీద చూడ గలడు. దూరాన వున్న వస్తువు పూర్తిగా కనిపించవు.

అతనికి మొత్తం నలుగురు కొడుకులు. వారి ప్రధాన వ్యాపకం కూడా చేపల వేటే. వారందరికీ పెళ్ళిళ్ళు జరిగినా, పిల్లలు పుట్టినా కలిసే వుంటున్నారు.

తాను బ్రతికున్నంతవరకూ వారంతా కలిసుండా లనేది ముసలాయన కోర్కె. అతను బాగా హుషారుగా ఉన్నప్పుడు తన యవ్వనంలోని సముద్ర అనుభవాల్ని పిల్లలకు చెబుతూండేవారు.

కిష్టయ్య కొడుకులు వేటలో నిపుణులే. అయినా వారి వేట పద్ధతులు ముసలాయనను తృప్తిపరిచేవికావు. వారు వేటాడే ప్రాంతంలో ఎప్పుడు సొర చేపలు పడు తుండేవి. అవి దాదాపు ఇరవై అడుగుల నుండి నలభై అడుగుల దాకా వుంటుండేవి.

అయితే అలాంటి పెద్ద వేటను ముసలాయన పిల్లలు ఎప్పుడూ సాధించలేరు. ముసలాయన జీవితంలో అతను బాగా చిన్నప్పుడు మాత్రమే ఆ విషయం విన్నాడు. అయినా తను కూడా ఓ మోస్తరు రాకాసి చేపల్ని వేటాడాడు.

ఓ రోజు మాటల సందర్భంగా సొరచేపల సంగతి వచ్చింది. కిష్టయ్యకు ఎందుకో అలాంటి చేపను వేటాడా లనే కోర్కె కలిగింది. ఆ విషయం తన బిడ్డలకు

చెప్పాడు.

చాలా సంవత్సరాల తర్వాత తిరిగి అతను సముద్రం లోకి అడుగు పెడుతున్నాడు. కొడుకులకు యేమేం చేయాలో పురమాయించాడు. రోజూ సాయంకాలం సముద్రం వొడ్డుకెళ్ళి ఆ అలల్ని గమనిస్తూ హోరును వింటూండేవాడు.

రెండు మూడు రోజుల్లో పడవ సిద్ధమయింది. బలమయిన తెడ్లు...పడవ నడుమ ఓ పొయ్యి లాంటిది ఏర్పాటు చేశారు. అందులో నుండి భగ భగ మంటూ మండుతుంది మంట నాల్కలు చాస్తూ.

పిల్లలందరికీ తమ తండ్రిపట్ల గౌరవం వుంది. వారికీ అనుభవం కొత్త కాబట్టి అందరూ ఉత్సాహంగానే ఉన్నారు. కానీ వారికి కొన్ని సందేహాలు సైతం ఉన్నాయి. ఈ పడవలో ఇలా వెళ్ళి ఎలా ఓ రాక్షసి చేపను వేటాడుతాడో వారికి అర్థం కావటం లేదు.

ముసలాయన మాత్రం గంభీరంగా వున్నాడు. ఏమీ మాట్లాడటం లేదు. అవసరమయినప్పుడు మాత్రం సూచనలిస్తున్నాడు.

పడవ బయలుదేరింది. వొడ్డున పిల్లలూ, ఆడవాళ్ళూ, అంతా నిలబడి వీడ్కోలు చెప్పారు. గూడెంలో అందరికీ ఈ విషయం ఓ వింతగా వుంది.

పడవలో అయిదుగురున్నారు. మధ్యన మంట. సముద్రంలోకి వారు వెళ్తున్నకొలదీ ఆ దృశ్యం చాలా బాగుంది. క్రమంగా వారు లోపలకి వెళ్ళిపోయారు. దూరంగా ఎర్రగా మెరుపు మాత్రం కనిపిస్తోంది.

“సూకం డబ్బాయిలు. మంట ఎలుగు తగ్గకూడదు. నావ కండ్లగపడవు. తలో దిక్కున సూడండి. దూరంగా

యే పక్కనన్నా మెరుపు అగపడితే చెప్పండి" అన్నాడు ముసలాయన.

నలుగురి కండలూ, పిక్కలూ కూడా బలంగా వున్నాయి. వారంతా నల్లగా వున్నారు. వారి శరీరాలు మెరుస్తున్నాయి. చల్లటి గాలి వీస్తోంది. నాలుగు దిక్కులూ నలుగురూ చూస్తోన్నారు. ముసలాయన మాత్రం చాలా తాపీగా కూర్చున్నాడు.

పడవ బాగా లోపలకు వెళ్ళిపోయింది. వారికి తీరం కనిపించటం మానేసి చాలా సేపయింది. పడవలో నిప్పు నిరంతరం వెలుగుతోంది ఎర్రగా!

వాళ్ళకి విసుగు ప్రారంభమయింది. సొర చేప దొరుకుతుందేమోనన్న ఆశ కలగటంలేదు. తండ్రిమీదున్న గౌరవంతో మరేం మాట్లాడలేకపోతున్నారు.

"సక్కంగా సూడండి. ఏ మూల యేం తేడా అగుపడ్డా చెప్పండి" అన్నాడు తిరిగి.

"సూత్తానే వున్నాం" అన్నారు.

దూరంగా అలల తాలూకూ తెల్లదనం కనిపిస్తూంది. ఆ విషయమే చెప్పాడు ఓ కొడుకు.

"అట్టాకాదు. కళ్ళు చెదిరే మెరుపు."

పడవ వెళ్తోంది.

ఒక్కొక్కరి ముఖంలో విసుగు.

వారు గాలి పీల్చి వదులుతున్న ధ్వనినిబట్టి ముసలాయన వారి పరిస్థితి అర్థం చేసుకున్నాడు.

"ఎనకటి మడుసులు వేరు. ఓపిక ఏడుంటాది మీకు" గొణుక్కున్నాడు.

ఎర్రగా మంట.

"ఓపికుండాల....పక్కి వేటకు కాదు వొచ్చింది"

అన్నాడు ముసలాయన.

ఆ మాటతో తిరిగి అందరిలోనూ ఓ రకమైన ఉత్సాహం ప్రవేశించింది. కళ్ళు చిట్లించుకొని చూడటం ప్రారంభించారు.

అప్పుడు కనిపించింది దూరంగా కళ్ళు మిరిమిట్లు గొలిపే ఓ వెలుగు!

"అయ్యో! అగపడింది" అరిచేడో కొడుకు.

"తెడ్లెయ్యండి. వెనక్కి తిప్పండి పడవని...." ముసలాయన ఉద్వేగంతో అరిచాడు.

సముద్రం ఒక్కసారిగా కంపించినట్లయింది.

నలుగురూ తెడ్లు అందుకొన్నారు. ఆ మెరుపు వారిలో గుబులు రేపింది.

"బేగెయ్యండి. అదే .. వొడ్డుకు సేరకుంటే పడవతో సహా మింగేసుద్ది" అన్నాడు ముసలాయన.

వారి కళ్ళల్లో మృత్యుభయం.

శక్తి నంతటిని ధారపోసి తెడ్లు వేస్తున్నారు.

వారి అదృష్టం గాలి వాలుగా వుంది.

సముద్రమంతా అల్లకల్లోలంగా వుంది.

మృత్యువు అమాంతం కబళిస్తున్నట్లుగా....

గంటకు రెండువందల ఏభై కిలోమీటర్ల వేగంతో తుఫాను వీస్తున్నట్లుగా....దూరంగా ఒడ్డు....

ఓ పెద్ద రాక్షస అల దూరంగా....

వారికి ప్రాణాలమీద ఆశలు పోయాయి.

ముసలాయన మాత్రం తొణకటంలేదు.

ఒక్కసారిగా రాక్షసి అల మూసుకొచ్చింది.

ఆ విసురుకు పడవ గాల్లో తేలుతూ వొడ్డున పడింది.

ముసలాయనా....నలుగురూ తలో మూలకు విసిరివేయ

బడ్డారు.

కళ్ళు గుమ్మ కొట్టుకుపోగా బలవంతంగా తెరిచి.... నోట్లోకి వెళ్ళిన ఇసుకను ఊస్తుంటే వారి కళ్ళకు కనపడుతోంది—ఓ చిన్న కొండంత రాకాసి చేప!

## 3

"ఇది కథా నిజంగా జరిగిందా?"

"ఏమో తర తరాలుగా చెప్పుకునే కథల్లో ఏదొకటి. ఆ నిప్పును చూసి ఆ జీవో తినే వస్తువుగా భ్రమించి దాన్ని మింగేయాలని భావించి వేగంగా మూసుకొచ్చింది. ఆ వేగంతోనే వొడ్డున పడింది. తిరిగి నీటిలోనికి వెళ్ళటం అసాధ్యం కదా....ఆ తర్వాత ఏడు ఊళ్ళ వారు దాన్ని నరుక్కుపోయారనే విషయం ప్రక్కన పెడితే దాని కన్నులోనే ఓ ద్వారం చేశారట. అంటే అదెంత పెద్దదో ఊహించుకోవచ్చు. కావాలంటే ఆ ద్వారం మచిలీపట్టణంలో యిప్పటికీ వుందట ఓసారి వెళ్ళి చూసి రావచ్చు" అన్నాడు కృష్ణ.

"ఫాంటసీ" అన్నాడు నారాయణ.

"ఫాంటసీ యేముంది? విచక్షణా రహితంగా తిమింగలాల్ని ఈ నాడు వేటాడుతున్నారు. అవి కూడా కాలగర్భంలో కలసిపోతున్నాయి. తిమింగలాల సంతతి అంతరించిపోతుందేమోనన్న భయం వ్యక్తం చేసిన ఆర్టికల్ ఒకటి నేను చదివాను. సముద్రం గొప్ప అద్భుతం. అందులో నుండే మానవ జీవితావసరాలు మూడువంతులు తీరుతున్నాయి. ఆహారం కోసమే కాదు మనం వినియోగించే అనేక వస్తువుల్ని సముద్రంనుండే పొందుతున్నాం" అన్నాడు కృష్ణ.

"ఆ ముసలాడి తెలివి అమోఘం."

"అవును. వెనుకటి మనుషులు. వారిని తక్కువగా అంచనా వేయకూడదు."

"సో....మనం వెంటనే బయలుదేరుదాం. ఆ రాక్షసి చేపను మనం చూడాలి. ఇలాంటి అవకాశాన్ని మిస్ చేసుకోకూడదు" అన్నాడు రాజు.

"మనతో పాటు కెమెరా తీసుకెళ్ళాం. ఇలాంటి అరుదైన దృశ్యాలు కూడా లభించవు. మంచి ఫోటోలు తీసుకోవచ్చు" అన్నాడు ఆనంద్.

"కృష్ణదగ్గర కెమెరా వుందిగా!"

"ఉంది. కానీ రీల్ లేదు."

"అయితే నేను వెళ్ళి తెస్తాను" అన్నాడు నారాయణ.

"కలర్ రీల్ తీసుకురా. సరేరా."

"ఆ---గే."

"ఎలా వెళ్ళాం?"

"ఎలా ఏముంది? రెండు స్కూటర్లయితే చాలు. మన యిష్టం వచ్చినప్పుడు బయలుదేరి రావచ్చు. బస్సు లున్నాయో....చచ్చాయో....ఉన్నా అక్కడ ఆపుతాడో....లేడో తెలియదుగా" అన్నాడు కృష్ణ.

"అలాగే చేద్దాం" అన్నారు.

"ముందు పెట్రోల్ వుందేమో చూసుకోవాలి. టాంక్ ఫుల్ చేయించుకోవటం అవసరం."

"నాది నిన్ననే ఫుల్ గా కొట్టించాను" అన్నాడు రాజు.

"సో....ఆనంద్ నీ స్కూటర్లో పెట్రోలు నింపి.... తర్వాత మనకు తిండానికి అక్కడేం దొరకవు. అందులోనూ సముద్రపు గాలికి విపరీతంగా ఆకలి వేస్తుంది.

అందుకని యేమన్నా తీసుకుపోవాలి. నారాయణా! బిస్కట్స్. ఇంకా కారాసుకుకు, కూల్ డ్రింక్స్ పాకెట్లూ వగైరాలన్నీ నువ్వే చూడాలి."

"రెండురోజులు ఉందామంటావా?" అన్నాడు నారాయణ.

"రెండురోజులు కాదు. అక్కడ ఆకలయితే ఆ రాక్షసి చేపను తింటానంటూ బయలుదేరతావ్."

"ఓ.కె. నేను వెళ్తాను" అన్నాడు.

"త్వరగా రా!" అన్నాడు.

నారాయణ్‌తో పాటు ఆనంద్ కూడా వెళ్ళిపోయాడు.

సరిగ్గా గంట తర్వాత రెండు స్కూటర్లు రాకాసి చేప పడున్న చోటుకు పరుగుతీస్తున్నాయి.

## 4

కృష్ణ మంచి ఫోటోగ్రాఫర్. అతనికి ఆ అభిరుచి కలిగాక రెండు మూడు రీళ్ళు మాత్రం చెడగొట్టాడు. అప్పటికి అతనికి అందులోని మెళకువలు కొంతవరకు తెలిసాయి. అప్పట్నుండి అతను చూస్తున్న సమాజంలో ఏమాత్రం విశేషంగా కనిపించే అంశాన్నైనా కెమెరాలో బంధిస్తున్నాడు.

అంతా స్కూటర్ల మీద అక్కడకు చేరారు. జనం పల్చగానే ఉన్నారు. ఇంకా ఈ వార్త బాగా తెలిసి వుండదు. పేపర్లోనన్నా పడితేగాని దానికి యెక్కువ ప్రచారం లభించదు.

సముద్రం ఇవతల కొండరాళ్ళ పడున్నట్లుగా వుందా చేప. జీవితంలో ప్రత్యక్షంగా అంత చేపను చూడటంతో వారికి ఒక్కసారిగా సంతోషం, ఆశ్చర్యం లాంటి

భావాలు ఏకకాలంలో కలిగాయి.

"కృష్ణా! కెమెరాలో యిది పడుతుందా? లాంగ్ షాట్ లో తీస్తే అంత క్లారిటీ రాదేమో" అన్నాడు ఆనంద్.

"డోంట్ వర్రీ భాయ్. నేను జూమ్ లెన్స్ తీసుకొచ్చాను" అంటూ కెమెరాకు జూమ్ లెన్స్ తగిలించాడు.

సరైన ఏంగిల్ చూసుకొని ఆ తిమింగలం ఫోటో తీశాడు. అప్పుడు జనమంతా వారిదగ్గరకు చేరటం ప్రారంభించారు.

మిత్రులందరూ కలిసి, విడివిడిగా దాని కొంతన నిల బడితే కృష్ణ ఫోటోలు తీశాడు. అంతా సరిచేసి కృష్ణ వెళ్ళి నిలబడితే ఆనంద్ క్లిక్ చేశాడు.

చూడటాని కొచ్చిన కొద్దిపాటి జనం తప్పితే పల్లె కార్లు యెవరూ కనపడటంలేదు. ఈ వార్త యింకా ప్రభుత్వాధికారులకు అందిందో లేదో.... ఓ వేళ అందినా వారు నిద్ర నుండి మేల్కొవాలి కదా.

"మనం గవ్వలు యేరుకుందాం" అన్నాడు రాజు.

"పదండి" అన్నాడు కృష్ణ మెడలో కెమెరా వేసుకొని.

సముద్రతీరం వెంట ఒక్కసారిగా పరుగుతీశాడు రాజు.

"స్కూటర్స్ ఇక్కడే వుంచుదామా?"

"లాక్ చెయ్యండి" అన్నాడు కృష్ణ.

దూరంగా కొన్ని గుడిసెలు కనిపిస్తున్నాయి జూమ్ లెన్స్ లో నుండి అక్కడ ఆరేసిన వలలు సైతం కన్పించాయి.

"కమాన్!" అంటూ పరిగెత్తారు ఆనంద్, నారాయణ.

కృష్ణ నవ్వుతూ అనుసరించాడు.

"నారాయణా! ఎవరి పాకెట్ వారే తెచ్చుకోవాలి" అన్నాడు ఆనంద్.

రాజుకు రెండు ముత్యపుచిప్పలు కనిపించాయి. ఆ మాత్రానికే వాటిని చూపి ఎగిరి గంతేశాడు.

"ఒరేయ్....ముత్యం దొరికినంత సంబరపడిపోతున్నావు. అలాంటివి ఈ తీరం పొడుగునా దొరుకుతుంటాయి" అన్నాడు ఆనంద్.

"అవునూ....ముత్యం అంటుంటారు అవెలా వుంటాయి? నేను చూడలేదు" అన్నాడు రాజు.

"తెల్లగా మెరుస్తుంటాయి. ఈ ముత్యపుచిప్పల్లో వానచినుకు పడితే అదే ముత్యంగా మారుతుంది" అన్నాడు ఆనంద్.

"నువ్వు వీటిని తీసిపారేస్తున్నావుగానీ మద్రాసులో అయితే చిన్న పగిలిన పెంకు కూడా దొరకదు. వీటితో ఎంతో అందమైన బొమ్మలు తయారుచేస్తారు. వాటి ధర సామాన్యంగా వుండదు."

"నిజమే మనవాళ్ళింకా ఆ టెక్నిక్ నేర్చుకోలేదు. పైగా అదేమో బీచ్. రోజూ వేలాదిమంది వస్తుంటారు. ఇక్కడ కవరేస్తారు" అన్నాడు ఆనంద్.

"జాగ్రత్తగా చూడరా. సముద్రం ఏదీ దాచుకోదు. అన్నింటిని బయట పారేస్తుంది. బంగారం దొరికినా దొరుకుతుంది" అన్నాడు నారాయణ.

టక్కున ఆగిపోయాడు రాజు.

"బంగారమా...." అనుమానంగా అన్నాడు.

"అవునురా! వజ్రాలు కూడా. సముద్రంలో అప్పు డప్పుడు ఓడలు మునిగిపోతుంటాయి. వాటిలోని వస్తువు లన్నీ బయటకు రావలసిందే. ఏమో నీ అదృష్టం బాగుండి నాలుగు వజ్రాలు దొరికాయనుకో" అన్నాడు నారా యణ.

"య్యా!" అంటూ గాల్లోకి లేచాడు రాజు.

"బంగారం దొరుకుతుందో లేదో గాని ఆ స్విపంజ రాలు కూడా కొట్టుకరావచ్చు" అన్నాడు కృష్ణ.

అంతా ఒక్కసారిగా నవ్వారు.

వారలా మాటలు చెప్పుకుంటూ ముందుకు పోతూనే వున్నారు.

ఎక్కడినుండో గాలి దూసుకొస్తోంది. ఆ గాలి శబ్దం సర్రున కోస్తున్నట్లుగా వుంది. సముద్రతీరాలు అందంగా ఉంటాయి. గాలికి ఎగిరిపడే రేణువులు ఇసుకతిన్నెలుగా మారతాయి. వాటి నునుపుదనం చూస్తే మనసెక్కడికో వెళ్తుంది. కృష్ణను కదిలించిందదే.

దూరం నుండి చూస్తుంటే ఆ ఇసుకతిన్నెలు పదహారేళ్ళ పడుచుపిల్లలా కనిపిస్తున్నాయి. ఆ ఎత్తుపల్లాలు.... తెల్లటి ఆ తిన్నెల నడుమ ఇసుపరజను పారసల్లగా.... ఎంతో మనోహరంగా ఉందా దృశ్యం.

"నారాయణా! నువ్వెళ్ళి ఆ గుట్టలమీద పడుకొని ఆ అందాల్ని ఆస్వాదిస్తున్నట్లుగా చూస్తుండు. మిత్తం గుట్టల్ని కవర్ చేస్తూ నేనో స్నాప్ తీస్తాను" అన్నాడు కృష్ణ.

నారాయణ వెళ్ళి పడుకున్నాడు.

"కొంచెం ఆ కళ్ళలో ప్రేమని ఎక్స్‌ప్రెస్ చెయ్‌రా" అన్నాడు.

నారాయణ కళ్ళు ఆ భావాన్ని నింపుకున్నాయి.

క్లిక్‌మంది కెమెరా.

రాజు వాళ్ళు మరో గుట్ట ఎక్కబోతున్నారు.

"ప్లీజ్! ఆ అందాల్ని చెడగొట్టొద్దు" అరిచాడు కృష్ణ.

"తిరిగి ఎంతసేపు. ఆ గాలికి మరలా మామూలే" అన్నాడు ఆనంద్.

"అది కాదురా! నాకు నిలువు లోతున పాతేసినట్లు ఫోటో తీయించుకోవాల నుంది" అన్నాడు రాజు.

"ఓ పని చెయ్యరా....నిన్ను మొత్తం పూడుస్తాం. చెయ్యి మాత్రం బయట పెట్టు" అన్నాడు ఆనంద్.

"ఈలోపు నేను చస్తే? వెధవ ప్రయోగం. నన్ను పూర్తిగా ఇసుకతో కప్పెయ్యండి. నా తల మాత్రం కనపడాలి. నా కళ్ళల్లో మృత్యుభయాన్ని క్లిక్ చెయ్యరా" అన్నాడు.

"సినిమాల కేనన్నా ట్రై చేద్దామనా?" అన్నాడు నారాయణ.

"కాదు, అదో కోరిక అంతే."

రాజు పడుకొన్నాడు. అందరూ కలిసి ఇసుక పొయ్యటం ఆరంభించారు. పది నిముషాల్లో తల తప్పించి అంతా ఇసుక అడుగున కప్పబడింది.

"ఎలా వుందిరా?" అన్నాడు ఆనంద్.

"నా గుండెలమీద బండ పెట్టినట్లుగా" అన్నాడు రాజు.

"మాట్లాడకు ఇసుక జారిపోతుంది."

కృష్ణ కెమెరా నుండి చూశాడు.

రాజు పడుకున్న దృశ్యం బాగుంది.

అతని కళ్ళలో ....

"ఫంటాస్టిక్" అన్నాడు కృష్ణ.

కెమెరా క్లిక్‌మంది.

కృష్ణ యింకా తేరుకోలేదు ఆలానే చూస్తున్నాడు

"ఇంక లెగవరా బాబూ" అన్నారెవరో.

రాజు ఇంకా అలానే పడుకున్నాడు.

ఆనంద్ ఇసుకని ప్రక్కకు నెట్టేశాడు.

"ఏమిటిరా ఏమయింది?" అన్నాడు నారాయణ కదుపుతూ.

"ఎవరో మనల్ని గమనిస్తున్నారు" అన్నాడు రాజు మెల్లగా.

అందరూ ఒక్కసారిగా వెనక్కి తిరిగారు.

అన్నీ ఇసుకతిన్నెలు!

రాజు కళ్ళలో భయం తొంగిచూస్తోంది.

"పిరికి ఊహించుకొన్నావేమో" అన్నాడు ఆనంద్.

నారాయణ పరిగెత్తాడు గుట్టలమీదకి.

ఆనంద్ కూడా అనుసరించాడు.

కృష్ణ బాధగా చూస్తూ డిపోయాడు.

వారి పాదాల తాకిడికి ఆ గుట్టలన్నీ అందం కోల్పోయాయి.

నాలుగయిదు గుట్టలు చూశాక తిరిగొచ్చారు.

"నీ దంతా భ్రమ! యెవరూ లేరు" అన్నారు.

"లేదురా నల్లటి కళ్ళు రెండు కన్పించాయి" అంటూ ఆగిపోయాడు.

"మనిషిని పూర్తిగా చూశావా?"

"లేదు, గుట్టక్రింద నుండి చూశారు. ఆ కళ్ళు విక్ర

తంగా మెరిశాయి."

"పిడ్ని గొంతునిండా కష్టేవసరికి నిజంగానే మృత్యు దేవత కనిపించి వుంటుంది. లేకపోతే మనం అన్ని గుట్ట లెక్కాం. ఏమన్నా కనిపించిందా?" అన్నాడు నారా యణ.

"అంతే అయుంటుంది. వాడు మెంటల్‌గా ఆ క్షణంలో ఆ ఫీలింగ్‌లోకి జారిపోయాడు" అన్నాడు ఆనంద్.

"నారాయణా....రాజుది అనుమానమో, వాస్తవమో తెలియాలంటే నువ్విలా పరిగెత్తకూడదు" అన్నాడు కృష్ణ.

"ఎందుకని?"

"ఓ వేళ యెవరివైనా అడుగుజాడలు పడ్డా అవి చెరిగిపోతాయి కదా!" అన్నాడు కృష్ణ.

"నిజమే" వాలిక్కురుచుకున్నాడు నారాయణ.

"ఇంతకూ యేమైవుంటుందంటావ్?"

"ఏ జంతువో అయివుంటుంది" అన్నాడు కృష్ణ.

"కరెక్ట్! వాటికళ్ళే మెరుస్తుంటాయి" ఆనంద్ అంగీక రించాడు.

"ఆకలవుతుంది" అన్నాడు.

అందరూ కలిసి బిస్కట్స్ తిన్నారు.

డ్రింక్స్ త్రాగారు.

తిరిగి అందరూ బయులుదేరారు.

సడెన్‌గా ఆగిపోయారు.

# 5

కొంచెం దూరంలో యెవరో వ్యక్తి పడున్నాడు.

ఓ అల అతనిమీద నుండి వెళ్ళింది.

నీరంతా వెనక్కి వెళ్ళిపోంది.

అతనలాగే పడుకున్నాడు.

"చచ్చాడా....బతికాడా....హారియప్" కృష్ణ పరిగెత్తాడు.

అందరూ అనుసరించారు.

వెల్లకిలా పడున్న ఆ వ్యక్తికేసి చూశారు.

మొఖంమీద సముద్రపు నురుగు కనిపిస్తూంది.

మొఖం బాగా ఉబ్బివుంది.

శరీరంమీద గాయాల్లాంటివేం కన్పించటంలేదు.

దగ్గరగా వెళ్ళబోయాడు నారాయణ.

"డోంట్ మూవ్" హెచ్చరించాడు కృష్ణ "అతను చచ్చిపోయాడు. నువ్వు చెయ్యివేస్తే వేలిముద్రలు పడతాయి" అంటూ కెమెరా సరిచేసుకొని రెండు కోణాల నుండి ఫోటోలు తీశాడు.

"ఎలా చచ్చిపోయాడంటావ్?"

"ఏమో! ఎవరు మందుకొట్టి పోయుంటాడు" అన్నాడు ఆనంద్ శవంవంక చూస్తూ.

"ముందీ వార్త గూడెంవారికి తెలియచెయ్యాలి" అన్నాడు కృష్ణ.

"పదండి పోదాం" అన్నాడు రాజా.

అతని కెందుకో ఈ ట్రిప్ అంత బాగున్నట్లుగా అనిపించటంలేదు. ఏదో జరగబోతూందని అతని మనసు హెచ్చరిస్తూంది.

"ఎవరన్నా యిక్కడ వుందామా....?" అన్నాడు కృష్ణ

"ఎందుకు?"

"మనం వచ్చేలోపు ఈ శవం తిరిగి సముద్రంలోకి

కుందేమో!"

"ఎవరన్నా ఉండిమాత్రం ఏం చేస్తారు? నువ్వేటూ శవాన్ని మూట్టలో కట్టుకొంటున్నావు" అన్నాడు నారాయణ.

"ఇంకొంచెం వోడ్డుకి నెట్టాలి. అప్పుడు నీళ్ళలోకి పోయేదేం వుండదు" అన్నాడు కృష్ణ.

"ఏమీ నెట్టొద్దు. అందరం కలిసి వారికి చెబుదాం. అతనెవరో యేమిటో వాళ్ళే చూసుకుంటారు. ఈ లోపల నీళ్ళలోకి పోయేదేం ఉండదు. పెద్ద అలలు కూడా రావటంలేదు" అన్నాడు ఆనంద్.

అందరూ ఆ నిర్ణయాని కొచ్చారు.

కృష్ణ కెమెరాని తన బాగ్ లో సర్దాడు.

అంతా చకచక నడుచుకుంటూ గుడిసెల దగ్గర కొచ్చారు.

అప్పటికి ఇంకా జనం లేరు.

గుడిసెల్లో కొందరు ఆడవాళ్ళు వంట చేసుకుంటు న్నారు.

ఎవరో ఇద్దరు మొగాళ్ళు కనిపించారు.

"ఇదిగో బాబూ" పిలిచాడు కృష్ణ.

వాళ్ళు దగ్గరికొచ్చారు.

"అక్కడ యెవరో చచ్చిపోయారు. మీలో యెవ రైనా అయివుంటారేమోనని చెప్పిపోవాలని వచ్చాం" అన్నాడు.

వారి కళ్ళలో భయం తొంగిచూసింది.

ఏం మాట్లాడకుండా వెనక్కి పరిగెత్తారు.

క్షణాల్లో మరికొందరు పోగయ్యారు.

"ఏడనయ్యా" అన్నాడో పెద్దాయన.

అందరూ కలిసి ముందుకెళ్ళారు.

ఇసుకతిన్నెలు దాటి ముందుకెళ్ళారు.

సముద్రతీరం తప్పితే ఏమీ కన్పించటంలేదు.

"ఏదయ్యా?" అన్నాడు తిరిగి.

కృష్ణకు ఆ ప్రాంతం బాగా గుర్తు.

"ఇక్కడే.... ఇక్కడే ఉండటం చూశాం" అని చూపించాడు.

అక్కడ శవం లేదు.... అది పడున్న జాడ కైతం లేదు.

సముద్రతీరంలో గుర్తులు చెదిరిపోతుంటాయి!

"ఏమైపోయింది" అన్నాడు ఆనంద్.

"ఓ వేళ తిరిగి లోపలకు వెళ్ళిపోయిందేమో" అన్నాడు రాజు.

"అందుకే కొంచెం వొడ్డుకు లాగుదామంది" అన్నాడు కృష్ణ.

"భలేవాడివే. అతనెలా చనిపోయాడో మనకేం తెలుసు. మన చేతుల్లో ఎలా పెట్టడం?"

"చూడండి. మేం ఇక్కడ ఓ శవం చూశాం. అతని ముఖం బాగా ఉబ్బివుంది. మాకయితే బాగా తాగున్న మనిషిలా కన్పించాడు. ఆ మైకంలోనే నీళ్ళలో పడి పోయుంటాడు."

అక్కడకు వచ్చినవారంతా ఒకరి ముఖాలు ఒకరు చూసుకొన్నారు.

ఎవరూ ఏం మాట్లాడలేదు.

"ఇంతకూ శవం తిరిగి సముద్రంలోకి పోయే అవకాశం వుందంటారా?" అన్నాడు కృష్ణ.

పెద్దాయన తలూపాడు.

"వో త్తంటయితే బాబు. మీరు కంగారడ్డాయి" అన్నాడు.

మిగతావారేం మాట్లాడలేదు.

రాజు యేదో చెప్పబోయాడు.

కృష్ణ కళ్ళతో నే వారించాడు.

"మీ మనిషేమో చెప్పాలని వచ్చాం. సరే ఇప్పుడా సమస్య లేదు. మేం కొంచెం సేపు సముద్రం చూసి వెళ్తాం" అన్నాడు కృష్ణ

వాళ్ళు మాట్లాడకుండా వెనక్కి తిరిగారు.

"ఏమయిపోయింది శవం?" టెన్షన్ ఆపుకోలేక మెల్లగా అన్నాడు నారాయణ.

"సమ్థింగ్ రాంగ్. ఏదో జరుగుతోంది. వాళ్ళంతా యేమన్నా మాట్లాడారేమో చూడు. వాళ్ళని వెళ్ళనివ్వండి మనం జాగ్రత్తగా గమనిద్దాం" అన్నాడు.

కొంచెం సేపు గవ్వలు యేరారు.

వారంతా కనుమరుగయ్యాక పిలిచాడు కృష్ణ.

శవం పడున్న చోటు వెతికారు.

ఆ చుట్టుపక్కల ప్రాంతిలో ఎవరివో కాలిముద్రలున్నాయి.

"మీరు కొంచెం అడ్డం నిలబడండి" అన్నాడు.

అందరూ నిలబడ్డారు.

కృష్ణ తన బ్యాగ్ నుండి కెమెరా తీసి వాటిని ఫోటో తీశాడు.

అవలా గుట్టల వెనకాలకు కెళ్ళిపోయాయి.

"నా అనుమానం ఏమిటంటే రాజు ఎవరినో చూశాననటం నిజమే అయింటుంది. ఓ మనిషి చచ్చిపోయాడంటే వారిలో ఆదుర్దా కనిపించిందేమో చూడు

అన్నాడు నారాయణ.

"ఇంకా నయం. మనం ఆ శవాన్ని ఫోటో తీసేమనే సంగతి నోరు జారుతారేమోనని భయపడ్డాను. అనుమానం లేదు. ఆ శవాన్ని యెవరో మాయం చేశారు. నా కెందుకో అనుమానంగా వుంది. ఏదో కుట్ర జరుగుతోంది. అది మాత్రం ఖాయం. అదెందుకో తెలుసుకోవాలి. మనం ఇలా ప్రొసీడ్ అయ్యేకంటే పోలీసుల సహాకారం తీసుకుంటే బాగుంటుంది" అన్నాడు కృష్ణ.

"ఇప్పుడేం చేద్దాం?" అన్నాడు రాజా.

"ఏం లేదు. వెంటనే వెళ్ళిపోదాం. ఆ శవాన్ని ఏ గుట్టల క్రిందో కప్పేసి వుంటారు. వాటన్నింటినీ మనం వెతికలేం. పైపెచ్చు మనమీద దాడి జరిగినా ఆశ్చర్యం లేదు. ముందు సిటీకెళ్ళి ఈ గిల్ ఎక్స్‌పోజ్ చెయ్యాలి. ఆ తర్వాత పోలీసుల్ని కలవాలి."

"ఎందుకురా లేనిపోని తలనొప్పి...." అన్నాడు రాజా.

"భలేవాడివే. ఓ మనిషిని నిలువునా హత్య చేస్తే చూస్తూ ఊరుకొంటామా? ఇలా పిరికిగా ఉండబట్టే ఈ దేశం ఇలా వుంది" అన్నాడు కృష్ణ.

"నువ్వేం భయపడకురా" అన్నారు మిగతా ఇద్దరు.

అందరూ వెనక్కి తిరిగి బయలుదేరారు. రాకాసి చేప అలానే పడుంది. దానికంక చూస్తున్నారు కొద్దిమంది.

స్కూటర్లు స్టార్టు చేసుకొని బయలుదేరారు.

కృష్ణ మొఖం సీరియస్‌గా ఉంది.

వారు వెళ్తుంటే ఎదురుగా వస్తుందో కారు.

"నెంబర్ నోట్ చేసుకో" అన్నాడు కృష్ణ.

అది వేగంగా దూసుకుపోయింది.

"వీలు కాలేదురా" పెదవి విరుస్తూ అన్నాడు ఆనంద్.

"ఫర్వాలేదులే" అన్నాడు కృష్ణ.

ఆ కాయిన్ నల్లటి తెరలు వ్రేలాడుతున్నాయి.

# 6

రెండుగంటల తర్వాత పోలీస్ స్టేషన్‌లో వున్నారు.

సి. ఐ రవి తన ముందున్న ఫోటోలు పరిశీలిస్తున్నాడు.

"అదీ సార్ జరిగింది. అది హత్యా, ప్రమాదవశాత్తూ జరిగిందా అనేది తెలవదు. కానీ ఆ శవంలో ఏదో మిస్టరీ వుంది. మరో విషయం. మేం వచ్చేముందు ఓ నల్లటి కారు వెళ్ళింది."

"వాళ్ళు కూడా చేపను చూడాలని వెళ్ళారేమో."

"కావచ్చు. కానీ మా కెందుకో అనుమానంగా వుంది."

"మీ కెందుకంతగా అనుమానపడుతున్నారు?"

"నాకు టెక్నికల్‌గా పూర్తి వివరాలు తెలియవు. ఈ తిమింగలాల నుండి "అంబర్" అనే విలువయిన పదార్థం లభిస్తుంటుంది. దానికి విపరీతమైన డిమాండు. కిలో నే లక్షల్లో పలుకుతుంటుంది. ఆ నడుమ ఎక్కడో ఇలాంటి వార్తనే విన్నాను సార్! ఎవరో వల్లో ఇలాంటి అరుదైన పదార్థం దొరికింది. దాన్ని కారుచౌకగా కొని విదేశాలకు పంపించారు."

రవి తల పంకించాడు.

"ఇంట్రెస్టింగ్!"

"దానికున్న విలువ వారికి తెలియదు. ఇలాంటి సమయాల్లోనే స్మగ్లర్స్ బయలుదేరుతుంటారు. వాటాలు

కదరకో, మరో కారణంతోనో అవి పేపర్లోకి వచ్చే ముందే విశేషాలకు చేరిపోతాయి."

"నిజమే" అన్నాడు రవి.

"అందుకే మేం ఈ విషయాన్ని ఈజీగా తీసుకున్నట్లు నటించాం. మీరు వెంటనే రంగంలోకి దిగాలి. నిజంగా అంబర్ కోసమే ఇదంతా జరుగుతుంటే ఆ స్మగ్లింగ్ ని నిరోధించాలి."

"ఎలా?"

"ఏముంది? వెంటనే వెళ్ళి థర్డ్ డిగ్రీ ప్రయోగిస్తే అసలు విషయం బయటపడుతుంది" అన్నాడు రవి తేలిగ్గా.

"మీ రేసు కోసం చేస్తే ఓ సలహా. మనకు స్మగ్లర్స్ ముఖ్యం. వారిని రెడ్ హాండెడ్ గా పట్టుకోవాలి. సముద్రం మీద వేట ప్రాణాలతో పని. మీరు ఓ ట్రాప్ తయారు చేయాలి" అన్నాడు కృష్ణ.

సి.ఐ. తల ఊపుతుండిపోయాడు కొంచెంసేపు. కృష్ణ చెప్పింది కూడా వాస్తవమే. ఈ సందర్భంలో ఓ ముఠానే అరెస్టు చేయొచ్చు.

"గుడ్ సజెషన్. నేను ఇప్పుడే వర్క్ ఆరంభిస్తాను" అన్నాడాయన.

"థాంక్యూ సర్! మా పని యింతటితో అయిపోయింది. మేం వెళ్ళిరావచ్చా?"

"మీరు ఊహించినట్లుగా ఈ రాకాసి చేప వెనుక కథ వుంటే అది త్వరలోనే బయటపడుతుంది. ఈ విషయంలో మీరు అభినందనీయులవుతారు" అన్నాడాయన షేక్ హాండిస్తూ.

"మరల కలుసుకుంటాం సర్!"

"తప్పకుండా. అన్నట్లు ఆ ఫొటోస్ ఇవ్వండి."

"తీసుకోండి" అంటూ అందించాడు.

అందరూ ఆయనదగ్గర శెలవు తీసుకున్నారు. రవి ఫోటోలకేసి చూశాడు.

రాకాసి చేప భయంకరంగా వుంది!

ఆయన గతంలో ఎక్కడో సగం చేప, సగం మానవాకారం వున్న ఫోటోను చూశాడు.

ఈ కేసు సంగతెలా వున్నా ముందా చేపను చూడాలనుకున్నాడు.

వెంటనే ఆయన మనసులో ఓ ఆలోచన రూపు దాల్చటం ఆరంభించింది.

# 7

ఇన్‌స్పెక్టర్ రవి తన బృందంతో అక్కడికి వెళ్లాడు. అందరూ మఫ్టీలో వున్నారు. అప్పటికే అది మధ్యలోకి కోయబడివుంది. అయినా ఆ రాకాసి చేప తన గాంభీర్యాన్ని కోల్పోలేదు. రవి యిచ్చిన సూచనల ప్రకారం అక్కడ జనాన్ని ఆ పరిసర ప్రాంతాన్ని ఓ కంట పరిశీలించటం ప్రారంభించారు.

ఆ ప్రాంతాల్లో కొంతమంది జాలరులు సైతం కన్పించారు. రవి ఓ జాలరిని కదిలించాడు.

"బాబూ యిక్కడ టీ లాంటిది దొరుకుతుందా?"

"దొరకదండయ్యాగోరు" అన్నాడు.

"పోనీ తింటానికేమైనా దొరుకుతాయా?"

"గూడెంలో సిన్న కొట్టుందయ్యా. ఆయి తింటారో, తినరో."

"ఫర్వాలేదు. బాగా ఆకలిగా వుంది. కొంచెం తెచ్చి,

అ కొట్టు చూపిస్తావా?" అన్నాడు రవి.

"పదండయ్యా" అంటూ దారితీసేడు.

"ఎలా వచ్చిందిది బయటికి" దారిలో అడిగాడు.

"మావోల్లు ఏటాడుతుంటే అగపడిందయ్యా.... తాల్లు యిసిరి లాగేసినారు" అన్నాడతను.

"ఎలాంటి చేపలు ఎక్కువ పడుతుంటాయా."

"ఎప్పుడూ దొరకవండి. ఇట్టాగే...."

"సముద్రంలో మీరేం వేటాడుతుంటారు."

"చేపా, రొయ్యండి."

"ఎక్కడమ్ముతారు వాటిని."

"ఊడికే వొచ్చి ఎత్తుకెల్తారండయ్య. అయిసులో పెట్టి పంపిత్తారు గదండయ్యా."

"అలాగా" అన్నాడు.

"నీ పేరేంటి."

"పోశిగాడండి"

"మీ గూడెం పెద్ద ఎవరు?"

"యీరయ్యండి."

"ఆయనున్నాడా?"

"అయ్"

"ఏమిటిక్కడ ఎవరిదో శవం కొట్టుకొచ్చిందంటున్నారు."

"నాకు తెల్దండి" అప్పటిదాగా ఉత్సాహంగా చెప్పుకుపోతున్న పోశిగాడిలో భయం తొంగిచూసింది.

"అది కాదయ్యా. ఏమన్నా తగాదాలు జరిగాయా?"

"నేదండయ్యా"

రవి జేబులో నుండి ఏభై రూపాయల కాయితం తీశాడు.

"త్రిపుతో"

"దేనికండయ్యగోరు"

"నువ్వు నేనడిగినవాటికి సరిగ్గా సమాధానం చెప్తే యింకో ఏభై ఇస్తాను."

"మీ రెవరండయ్యా"

"నాకు కొంచెం పనుంది"

"పోలీసొల్లా బాపూ"

"పిచ్చివాడా పోలీసులు డబ్బులిచ్చి అడగరు. కర్ర తోనే అడుగుతారు" అన్నాడు నవ్వుతూ.

"ఏటండయ్యగోరు" అన్నాడు అప్పటికి ధైర్యం వచ్చి.

"ఈ గూడెంలో ఎవరైనా పోయారా?"

"మీ రెవరికీ సెప్పనని పెమానం సెయ్యండి"

"సరే చేస్తున్నాను. చెప్పు"

"అవునండయ్యా పోలిగాడు పోయాడంటున్నా రయ్యా."

"ఎట్లా పోయాడు?"

"ఆడెప్పుడూ తాగుతుంటడయ్యా. గూడెపోల్లెవరినీ సెక్క సేయడు. ఆడు తాగి అందరినీ బూతులు తిడతా డయ్యా. ఆడు ముత్తె లాటాడయ్యా. ఆ వొక్క సెడ్డ గుణా తప్పితే బంగోరంలాంటోడు."

"అతనెందుకు చచ్చిపోయాడు. ఎవరన్నా చంపారా?"

"లేదండయ్యా, ఆడు బాగా తాగేసి పడవేసుకెల్లా డంట. నీళ్ళలో పడిపోయాడంటన్నారయ్యా."

"మరా శవాన్ని ఏం చేశారు?

"నాకు తెల్దండయ్యా. ఆ యిసయం వోరూ మాట్లాడ

గూడదని గూడెం అన."

రవి మరో ఏభై కాయితం అందించాడు.

"నిజం చెప్పు"

"ఎందుకండయ్యా ఇయన్నీ" అన్నాడు భయంగా.

"నేను వ్యాపారం చేస్తున్నాను. అది మరో కంటికి తెలియకూడదు. పోలిగాడు నిన్న నా కా రహస్యం చెప్పాడు" అన్నాడు రవి మెల్లగా.

"మీకండయ్యా"

"అవును"

"ఏంటండయ్యా" అన్నాడు కుతూహలంగా.

"అంబర్ గురించి"

పోశిగాడి కళ్ళలో మార్పు వచ్చింది.

"ఓయ్ బాబోయ్. ఆడప్పుడే సెప్పేశాడా?" అన్నాడు అంతలోనే.

"చెప్పటం కాదు. నాకలాగైనా అమ్మేటట్లు చేస్తానన్నాడు. మీ గూడెం వాళ్ళకి చెప్పి వుంచు. నేను డబ్బుతో వస్తానన్నాను. ఈలోపే ఎవరో అనుకుంటుంటే వచ్చాను" అన్నాడు రవి.

"అట్టనా" అన్నాడు పోశిగాడు.

"అవును. మరి చెప్పు"

"యీరయ్యతో మాటాడుకోండయ్యా."

"సరే తీసుకెళ్ళు" అన్నాడు రవి.

జేబులో వందరూపాయలున్నాయన్న ఉత్సాహం కల్లు ముంతల్ని గుర్తుకు తెస్తున్నాయి. ఎంతసేపూ ఈయన్నెలా వదిలించుకోవాలా అనే ఆలోచనలో వున్నాడు పోశిగాడు. త్వరత్వరగా వెళ్ళి వీరయ్యను కలుసుకొని ఏదో చెప్పాడు.

"శర్మానందయ్యగారూ" అంటూ వెళ్ళిపోయాడు.

"ఏం కావాలయ్యా" అన్నాడు వీరయ్య.

"మనం కొంచెం ఒంటరిగా మాట్లాడాలి"

వీరయ్య అనుమానంగా చూశాడు.

"వ్యవహారాలు నలుగురిలో మాట్లాడటం బాగుండదు"

అతడు మాట్లాడకుండా ముందుకు నడిచాడు. ఇద్దరూ కొంచెం దూరం వెళ్ళి కూర్చున్నారు.

"నాకో విషయం పోలిగాడు చెప్పాడు" అన్నాడు రవి.

"పోలిగాడెవడు....పోశిగాడా?" అన్నాడు వీరయ్య తొణక్కుండా.

"పోశిగాడు కాదు, పోలిగాడు" కంఠం కత్తి పలికింది.

"ఆ దెవడూ లేడే"

"అవును. ఇప్పుడు లేడు. బూడిదగా మారాడో.... ఇసుక గుట్టల క్రింద వున్నాడో" కొంచెం కటువుగా అన్నాడు.

"ఓరు మీరు" కంగారుగా అన్నాడు.

రవి జేబులో నుండి ఫోటో తీశాడు.

"ఇత నెవరో మీకు తెలుసా?"

వీరయ్య కొయ్యబారిపోయాడు.

"కంగారుపడకు. నేను పోలీసువాడ్ని కాదు. వ్యాపారస్థుడ్ని. నాకు అంబర్ గురించి పోలిగాడు చెప్పాడు. ఉందా? అయిపోయిందా?"

"ఆడు తాగుబోతు ఎదవ. ఎర్రికబుర్లు"

"చూడు వీరయ్యా. ఎర్రికబుర్లు పోలిగాడివి కాదు, నీవి. అడివి ఎర్రికబుర్లయితే బతికే వుండేవాడు. వాడు

నిజం చెబుతాడు కాబట్టే ఎందుకూ కాకుండా పోయాడు. నిన్న తిమింగలంతో పాటు అంబర్ కూడా దొరికింది. అది అమ్మటంలో మీరు వాదులాడుకున్నారు.

"ఈ విషయం పోలిగాడికి తెలిసింది. వాడీ విషయం తాగాక అల్లరి చేస్తాడని, ఈ సంగతి బయటకు పొక్కుతుందనీ మీకు తెలుసు. అందుకే ఎలాగో వాడిని బాగా తాగించారు. వాడిని స్పృహలేని స్థితిలో సముద్రంలోకి నెట్టేశారు. అడు చచ్చిపోయాడు. ఆ శవం బయటకు కొట్టుకొచ్చింది. తిమింగలాన్ని చూడటానికొచ్చిన కుర్రాళ్ళు ఆ శవం చూశారు. మీతో ఆ విషయం చెప్పటానికి రాగానే ఈలోపు మాయం చేశారు. ఈ విషయంలో మీరెవరూ నోరెత్తలేరు. కారణం ఆ రహస్యం బయట పడుతుంది. ఎవరి వాటాలు వారికందుతాయని ఎవరూ మాట్లాడలేదు.

కానీ మీకు తెలియని విశేషం మరొకటుంది. ఆ కుర్రాళ్ళు మీ దగ్గర కొచ్చేముందు ఆ శవాన్ని ఫోటో తీశారు. తర్వాత శవం తీసుకువెళ్ళిన వారి అడుగుజాడలు తీశారు. మీకా విషయం తెలియదు. ఇప్పుడు చెప్పా. ఎవరివి వ్రేలికలుర్లు. ఈ విషయం నేను పోలీసులకు చెబితే ఏమవుతుంది. మీ గూడెం వాళ్ళందరినీ అరెస్టు చేస్తారు."

వీరయ్య నిలువెల్లా వణికిపోతున్నాడు.

"మీకు దాని విలువ తెలియదు. వాళ్ళింతిస్తే అంతకు అమ్మకుంటారు. అదే మీ దగ్గరున్న అంబర్ కు నేను లక్షరూపాయలిస్తాను. అంటే "వంద వేలు" అర్థమవుతుందా?" అన్నాడు రవి.

ఈసారి ఆశ్చర్యంతో మాటరాలేదు వీరయ్యకి.

"నేను చెప్పేది నిజం. దాని కలాంటి విలువ వుంది. నువ్వు సరేనంటే చాలు, నేను ఆ ఏర్పాట్లు చేస్తాను. డబ్బు తెప్పిస్తాను. వెంటనే చెప్పు. అదుందా? అమ్మేసారా?"

వీరయ్య అప్పటికీ అనుమానంగా చూస్తున్నాడు.

"నీకేదో అనుమానంలా వుంది. ఇదుగో అడ్వాన్సు" జేబులో నుండి వందరూపాయల కట్ట బయటకు తీశాడు.

"పదివేలు. నువ్వు మాటిస్తే మిగతావి ఏర్పాటు చేస్తాను."

"కానీ బేరమయిపోయింది గదయ్యా" అన్నాడు వీరయ్య.

"అప్పుడే అయిపోయిందా?" నీరసంగా అన్నాడు.

"అవునండయ్యా పాతిక వేలిత్తమన్నరు. మేవు ఏభై అన్నం. నలభై అన్నరు. మేవు వూ అనలే. మల్లా వొత్తమంటూ ఎల్లారు. గోరెపోల్లందరికీ కల్లు పోయించుంద్రు" అన్నాడు వీరయ్య.

రవి కొంతవరకు సంతోషించాడు. ముత్తామీద పట్టుదలతో నిలబడ్డారు. ఆ కొనేవారు వీరి అమాయకత్వాన్ని అడ్డం పెట్టుకొని చాలుచౌకగా కొంటానికి ప్రయత్నం చేస్తున్నారు. ఈ విషయంలో పెద్ద హస్తాలున్నా....దళారులే బేరాలు సాగిస్తుండవచ్చు. వారి సలహాకోసం వెళ్ళివుంటారేమో....!

"ఇంతకూ సరుకెక్కడుంది"

"అది చెప్పకూడదు. గూడెంమీద ఆన"

"సరే నా బేరానికి అంగీకరించినట్లేనా?"

"గొడవలవుతాయేమో నయ్యాగారు"

"నీకు భయంలేదు. మేమున్నాం. మాకు బలగముంది.

ఎలాంటి వారొచ్చినా కాల్చి అవతల పారేస్తాం"
అన్నాడు రవి.

"సర్లెండయ్యా మీ కే ఇష్టం" అన్నాడు వీరయ్య ఎటకెలంగా.

"అయితే మా వాళ్ళకు డబ్బు తెమ్మని కబురు చేస్తాను."

"ఎళ్ళొత్తవా" అన్నాడు వీరయ్య.

"అవసరం లేదు. వాళ్ళే వస్తారు" అంటూ జేబులో నుండి పాకెట్ రేడియోలాంటి సాధనం తీసి.

"రవి హియర్ ....రవి హియర్ ....ఓవర్" అన్నాడు!

అటునుండి సమాధానం వచ్చింది.

"బేరం కుదిరింది. వెంటనే డబ్బుతో రండి. ఓవర్"

.... .... ....

"మామూలుగానే రండి. విత్ అమ్యూనిషన్ .... ఓవర్"

తిరిగి సాధనం లోపలకు పెట్టేశాడు.

"ఏంటండయ్యా అది" అన్నాడు వీరయ్యె అర్థం కాక.

"మా మనుషులికి ఫోన్ చేశాను" అన్నాడు రవి.

# 8

అంబర్ అనేది అరుదుగా లభించే పదార్థం. దీని విలువ అపారం. ఒక కిలోనే లక్షల్లో పలుకుతుంది. ఈ విషయం పల్లెకార్లకు తెలియదు. తెలిసినా మరో కంటికి తెలియకుండా సొమ్ము చేసుకునే విధానం అంత కంటే తెలియదు. దీనినే 'అంబరం' 'చేప పియ్య' అని కూడా పిలుస్తుంటారు. రాకాసి చేపలు తీసుకునే ఆహారంలో మిగిలిపోయిన పదార్థం అంతా గుండె ప్రక్కకు

చేరుతుండట. అదే ఈ అమూల్యమైన పదార్థంగా రూపొందుతుంది. ఈ పదార్థాన్ని ఓ ప్రత్యేక సమయంలో అవి కక్కేస్తుంటాయి. ఆ పదార్థం వేటగాళ్ళ వలలోకి చిక్కోవటంగాని, లేక మామూలుగా సముద్రం బయటకు విసిరేసిన వస్తువుల్లా ఒడ్డుకు రావటంగాని జరుగుతుంది.

ఆరేబియా సముద్రంలో ఈ రాకాసి చేపలు ఎక్కువగా సంచరిస్తూంటాయుంటారు. అందుకే ఆ ప్రాంతాల్లో ఈ పదార్థం అప్పుడప్పుడు లభించే అవకాశాలున్నాయి. బంగాళాఖాతంలో మాత్రం మార్చి, ఏప్రిల్ నెలల్లో ఈ పదార్థం కోసం పల్లెకార్లు చూస్తుంటారు. వారు ఉదయాన్నే లేచి సముద్రతీరంలో వెతుకుతుంటారు.

అంబర్‌ను సుగంధద్రవ్యాల్లో విని మోగిస్తారు. విదేశాల్లో విపరీతమయిన గిరాకీ వుంది. అసలు మన చేపలూ రొయ్యలకే విదేశాల్లో గొప్ప డిమాండ్ వుంది. అంబర్ అరుదుగా లభించినా జాలర్లకు అందుకు లభించేది చాలా తక్కువ. వందల్లోనే అది చేతులు మారిపోతుంటుంది. దాని ఆకారం పేడలా నల్లగా వుంటుందంటారు.

క్షణాల్లో అది ఎక్కడకు చేరాలో అక్కడకు చేరిపోతుంది. అంతా అయిపోయాక ఈ విషయాలు పత్రికల్లో వస్తుంటాయి. అందుకు ప్రధాన కారణం వాటాలు సరిగ్గా కుదరకపోవటం. రెండోది వారి బలహీనతలమీద ఆడుకోవటం. వారికి తమ పొరపాటు గుర్తొచ్చిన క్షణంలో ఈ వార్తలు వెల్లడయ్యేది.

జాలర్ల జీవితమే విచిత్రంగా వుంటుంది. వారికి ఎంత డబ్బు యిచ్చారనేది సమస్య కాదు. వారికి తగినంత కల్లుగానీ సారాయి గాని పోయిస్తే వారిపట్ల యెంతో నమ్మ

కంగా వుంటారు.

సోమవారంనాడు వేటకు బయలుదేరుతారు శని వారం సాయంకాలానికి తిరిగివస్తారు. నడుమ ఉండేది ఒక్క ఆదివారం. ఆ రోజే తాగినా, నిండుగా బట్ట కట్టినా! ఆ వారంరోజుల వేటమీద వచ్చిన డబ్బులు తాగటానికి, బట్టలకి, తిరిగి తిండికి సరిపోతాయి. ఒక్కో సారి అప్పులు....

తిరిగి తొలిపొద్దుతోనే సముద్రంలోకి ప్రయాణం వలలు.... చేపలు రొయ్యలు....గోచీగుడ్డ కాల్చిన ఎండుచేప....సముద్రం నుండి వారు వెలికితీసే సంపద వారినుండి చేతులు మారి మారి విదేశాలకు చేరేనాటికి దాని విలువ వారికిచ్చే విలువకు అనేక రెట్లు....

## 9

వీరయ్య గుడిసెదగ్గర కొచ్చారిద్దరు వ్యక్తులు.

“వీరయ్యా!” పిలిచారు.

“వొత్తన్నా!”

బయటకొచ్చి చూశాడు.

“ఏటండి.”

“ఏటంటేంటి? నువ్వడిగినట్లుగానే ఏభై వేలు తెచ్చాం. సరుకు తీసుకురా. త్వరగా.”

“పైకలెయ్యి”

“ముందు సరుకు తీసుకురా. అయ్యగారు కార్లో కూర్చున్నారు.”

“అది లక్షరూపాయలిక్కె వోగేసినానండి!”

ఒక్కక్షణం నిర్ఘాంతపోయారు.

“లక్షరూపాయలా?”

“అయ్యా!”

"ఎవరికి?" తేరుకున్నాక అడిగాడు.

"ష.శో మీ అనుకుంటారే."

"సరుకిచ్చేశావా?"

"లేదు. పైసలు తెచ్చేదుండాది..." అన్నాడు వీరయ్య.

వారిలో ఒకతను సైగ చేశాడు.

"సరే ఇప్పుడే వస్తాం" అంటూ వెనక్కు తిరిగారు.

"వీడు చెప్పేది ఎంతవరకు నిజం. సరుకు నిజంగా అమ్మేశాడంటావా?"

"అనుమానమే. అయినా యే పార్టీ రావటానికి అవకాశం వుంది."

"ఎవరయినా రావొచ్చు. ముందు సరుకు మాయం కాలేదు. అది నయం."

"అందుకే మనవాళ్ళని యిక్కడ వుంచమని చెప్పాను.

"చెప్పావనుకో. వాళ్ళిక్కడ తిరుగుతుంటే లేనిపోని అనుమానాలు వస్తాయి."

"వాడు నాటకం వేస్తున్నాడేమో ననుకుంటా. ఎవడూ వచ్చుండడు. అసలు ఏభై వేలంటేనే గుండె పగిలిపోతుంది. కొడుకులికి కల్లు పోయిస్తే పారేసేవారు. తెలివి మీరిపోయారు. నాకు తెలిసినంతవరకూ ఇంత ధర ఎప్పుడూ పలకలేదు."

"మరి వాడెవడో లక్షకు కొంటానంటాడు."

"ముందు గురువుగార్కి చెబితే యేం చేయాలో ఆయనే చెబుతాడు."

"ఇద్దరూ కారు దగ్గర కెళ్ళారు.

వెనక సీట్లో ఓ పెద్దమనిషి కూర్చుని పేపర్ చదువు

కొంటున్నాడు. ఆయన ఖద్దరు పంచె, లాల్చీ ధరించాడు. వేళ్ళకు ఉంగరాలు మెరుస్తున్నాయి. వాళ్ళని చూడ గానే—

"ఏమిటి రెడ్డీనా" అన్నాడు.

"వాడు పేచీ పెడుతున్నాడు సార్!" అన్నా డొకతను.

"పేచీనా? దేనికంట?"

"లక్షరూపాయల కెవరో కొంటారన్నారట."

"ఆ దెవడు?"

"ఏమోనండి!"

"సరుకుందా లేదా?"

"ఉంది సార్!"

ఆయన కొంచెం రిలీఫ్ ఫీలయ్యాడు.

"ఏం చేద్దామంటారు?"

"ముందు వాడ్నిక్కడికి పిలుచుకు రండి" కంగున మోగింది ఆయన కంఠం.

"అలాగే!"

ఇద్దరూ వెనక్కి వెళ్ళారు, వీరయ్య వారితో పాటు వచ్చాడు.

కారులో వున్న వ్యక్తిని చూడగానే—

"దండాలండయ్యా" చేతులెత్తి నమస్కరించాడు.

"ఈ దండాలదేముంది. మాకు దండం పెట్టబోక" వ్యంగ్యంగా అన్నాడు.

"ఏటండయ్యా"

"అవునయ్యా, నువ్వు ఏభై అని చెప్పావు. సరే మేం వెళ్ళి డబ్బు తెస్తామంటూ నా మనుషులొచ్చారు. ఈలోపు ఎవరో లక్షకు కొన్నారంటున్నావు. ఇదేంటి

వ్యాపారమా? తల్లకాడా?" అన్నాడు కోపంగా.

"సగం కోసేసివారు కదండె."

"నువ్వడిగిందెంత? ఏభై. మేం నలభై అన్నాం. నువ్వు కాదన్నావ్, సర్లే డబ్బు తెస్తాగన్నాం. ఈలోపు ఎవడో దొంగమాటలు చెబితే నమ్మటమేనా? ఇంకో పదివేలిస్తాను. సరుకు పట్రా" అన్నాడు.

"ఆయనగోరు పదేలిచ్చిండయ్యా ...... పైసల్దేటా కెళ్ళిండు."

"పదివేలిచ్చాడా? నువ్వేలా తీసుకుంటావయ్యా? నాకు బేరం ఇచ్చినాక నేను కాదంటే అప్పుడు ఇంకొకరికి చెప్పాలి. అదేం కుదరదు. మర్యాదగా చెబుతున్నాను. సరుకు నాకిచ్చావా సరే లేదంటే మొత్తం మీ అందర్నీ జైల్లో తోయిస్తాను."

"దేనికండయ్యా."

"అది మన అబ్బగాడి ముల్లెకాదు లక్షలకమ్ముకు దొబ్బటానికి. గవర్నమెంటుకు చేరాలి. నీకు మంచిగా చెబుతున్నా. దురాశ మంచిదికాదు. ఆ సరుకు ఇక్కడి నుండి తీసుకెళ్ళటం.... వెకి పంపించటం...ఇదేమన్నా ఆషామాషి వ్యవహారమనుకున్నావా? నువ్వు ఎక్కువసేపు ఆలోచించావంటే నీ నోట్లో దుమ్మే....చివరిసారిగా చెబుతున్నా ఇంకో పది.... మొత్తం దెభై. డబ్బిదిగో" అంటూ సూట్ కేస్ తెరిచాడు.

అందులో వరసగా పేర్చున్నాయి వందరూపాయల కట్టలు.

అంత డబ్బుచూసి కళ్ళు తేలేసాడు వీరయ్య.

అంతలో నై పోలిగాడి ఫోటో గర్తొచ్చింది.

"మీకు తెల్దండయ్యా. గొడవయిపొద్ది"

"ఏం గొడవవుతుందట" అన్నాడాయన సూట్ కేస్ మూస్తూ.
"పోలిగాడిసయ్యం ఆళ్ళకు ఎరికయినాదండి."
"వాడెవడయ్యా" చిరాగ్గా అన్నాడు.
"ఆయనెవరో తెల్దండి. పోలిగాడి పటం సూపించిండు."
"అడి పటం ఏమిటి?"
"ఆడు సచ్చి వొడ్డున పడున్న పటమయ్యా."
"వాడ్నెవరు తీశారయ్యా" అన్నాడు అర్థంకాక.
"మొన్న సూడెంటు కుర్రాల్లొచ్చి ప్రతీసారం దయ్యా."
"ఏమిటయ్యా ఇది" అన్నాడు తన మనుషుల్ని.
"అదీ... ఆ పోలిగాడు డేంజర్ ఫెలో సార్. వాడు నోరు తెరిస్తే ఈ విషయమంతా గబ్బు గబ్బు. అందుకని వాడికి బాగా తాగించారు. తాగి తాగి పడిపోయాడు. ఇప్పుడే లేవడు కదాని మనవాళ్ళు సముద్రం వొడ్డు కెళ్లారు. ఈలోపు వాడెప్పుడు లేచాడో, ఎలాపోయాడో సముద్రం వొడ్డున తేలాడు. వాడి శవాన్ని చూసి మన వాళ్ళే అక్కడినుండి తెచ్చేశారు" అన్నాడు.
"అయితే."
"అంతకుముందే ఆళ్లు పటమెత్తింది."
"తీసుకోని. ఇంతకూ వాడ్నేం చేశారు?"
"దహనం చేయించాం."
"వాడికెవరూ లేరా?"
"నేరండయ్యా .... ఆడమ్మ సిన్నప్పుడే పోయింది. ఆడయ్యా....అన్నలూ ఏటకెళ్ళి కొట్టుకపోయినారు."
"పీడా వదిలింది. ఇందులో నువ్వేం భయపడాల్సిన

అవసరం లేదు. ఆడెవడో తాగి నీళ్ళలో పడి చచ్చాడు. వాడిన్ని దహనం చేశారు దీనికి ఎవరూ ఏం చెయ్యలేదు. మీ కేమన్నా జరిగితే నేను లీడర్ని పెడతా అర్థ మయిందా?"

"అయ" అన్నాడు సందేహంగా.

"వాడు నిజంగా డబ్బులిచ్చాడా?"

"ఇచ్చిండయ్యా."

"వాడెవడో మీకు టోకరా ఇవ్వటానికి చేశాడు. సరే ఇంక ఆలశ్యం చెయ్యకు. సరుకు తీసుకురా ముందు."

"మరి గూడెపోళ్ళందరికీ లక్షరూపాయలని సెప్పాం గద ఆళ్ళంతా నామీద పడతరు."

ఇంక ఆయనలో సహనం నశించిపోయింది.

తన అనుచరులకు సైగ చేశాడు.

"నీకు మర్యాదగా చెబితే వినవు" అన్నాడు.

అప్పుడు చూశాడు వీరయ్య.

ఆ ఇద్దరి చేతుల్లో నిగనిగలాడుతున్నాయి రివాల్వర్లు.

"అరిచావా, కుక్కను కాల్చినట్లు కాల్చిపారేస్తాం. మాట్లాడకుండా ముందుకు నడువ్. వెంటనే సరుకు మాకి వ్వాలి నిన్నే కాదు. మొత్తం నీ గూడెమంతా బాంబుల్తో ధ్వంసం అవుతుంది. వ్యాపారమంటే పరా చికాలనుకున్నావా?"

జీప్ తెరిచి క్రిందకు దిగాడు.

"పద" అన్నాడు.

వీరయ్యకు భయంతో నోటివెంట మాట రాలేదు.

వీపుకు రివాల్వర్ గుచ్చుకుంటోంది.

మాట్లాడకుండా నడుస్తున్నాడు.

"దారిలో మీ వాళ్ళతో యేమన్నా మాట్లాడినా,

సైగ చేసినా, అదే నీ చివరి క్షణం. మర్యాదగా దెబ్బ తెలిస్తామని చెబితే, కథలు చెబుతున్నావు. మిమ్మల్ని తాటతియ్యాలిరా” పళ్ళు పటపట కొరికాడాయన.

వీరయ్య మాట్లాడకుండా సరుకు దాచిన చోటు కెళ్ళాడు.

అంబర్ ను చూసేటప్పటికి ఆయన కళ్ళు వికృతంగా మెరిసాయి.

“మీరన్నంతయినా ఇవ్వండయ్యా” వీరయ్య ప్రాధేయపడ్డాడు,

“సామ్మా? నీకు దురాశవద్దురా అని చిలక్కి చెప్పినట్టు చెప్పా. నీకూ తేరగా వచ్చిందేగా. అంత తాపత్రయం దేనికి? నువ్వు మాట్లాడకుండా నడువ్ ... ఒక్క ముక్క మాట్లాడవా....తలకాయ పేలిపోతుంది. ఒక్క బాంబు విసిరే ఈ గూడెం మొత్తం మసి” అన్నాడు క్రూరంగా.

వీరయ్యకు తెరలు తెరలుగా దుఃఖం వచ్చింది.

తమ పరిస్థితి ఇంత అన్యాయం అవుతుందని అతనూహించలేదు.

“బాపూ....మా పెళ్ళాం బిడ్డల్ని గన్నయా సెయ్యకండి” అంటూ కాళ్ళమీద పడ్డాడు.

“ఛీ....ఛీ.... లేస్తావా? ఛస్తావా?” ఉరిమాడు.

ప్రాణభయం!

వీరయ్య చటుక్కున లేచాడు.

తిరిగి కారు దగ్గరకు ప్రయాణం ఆరంభమయింది.

కారులోకి వెళ్ళాకకూడా వీరయ్య భయంగా చూసుండిపోయాడు.

డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడో వ్యక్తి.

మరో వ్యక్తి చేతిలో రివాల్వర్‌తో కూర్చున్నాడు.

వీరయ్య భోరున ఏడుస్తున్నాడు.

కారు స్టార్టయింది.

గాల్లో ఎగిరొచ్చిందో కట్ట.

వీరయ్య కాళ్ళముందు పడింది.

గాలికి వందరూపాయలు రెపరెపలాడుతున్నాయి.

వీరయ్య వంగి ఆ కట్ట అందుకున్నాడు.

కారు టర్నింగ్ తీసుకొని ముందు కురికింది.

అప్పటిదాకా భరించిన ఆవేశం, దుఃఖం, అన్ని భావాలు ఒక్కసారిగా బరస్టయ్యాయి. అప్పటిదాకా ఉన్న ప్రాణభయం కూడా అదృశ్యమైంది.

"రేయ్.... బాడ్కో" పెద్దగా అరుస్తూ....పరిగెత్తి కళ్ళ చేతిలోని వందకట్ట కారుమీదకు విసిరేడు....

"ధన్"మంటూ తగిలి క్రిందపడింది.

వీరయ్య నోరు తెరిచాడు అరుస్తూ... ఏడుస్తూ.

గూడెంనుండి ఎవరెవరో పరిగెత్తుకొస్తున్నారు.

కారులోనుండి చెయ్యి బయటకొచ్చింది.

రివాల్వర్ ఒక్కసారిగా ఉరిమింది.

బులెట్ దూసుకొచ్చి తొడల్ని రాసుకుంటూ ఇసుకలో దిగబడింది.

వీరయ్యకు నిప్పుతో కాల్చినట్లయింది.

రక్తం....రక్తం....!

కెవ్వున అరిచి పడిపోయాడు.

ఎవరో వీరయ్య తలను తొడమీద పెట్టుకున్నాడు.

దూసుకెళ్తున్న కారు వంక చూస్తున్నారు మిగతా జనం!

# 10

వేగంగా దూసుకెళ్తున్న కారులో వారికి ఎదురుగా కనిపించిందో దృశ్యం!

రోడ్డుకు అడ్డంగా పోలీస్ వాహనం.... కవర్ చేస్తూ పోలీసులు అప్పటికే దగ్గరగా వచ్చారు.

"ఏం చేద్దాం సార్."

"మొత్తం ఎంతమంది ఉంటారు."

"పదిమందిదాకా."

"అలానే వెళ్తే."

"కష్టం సార్."

"షూట్ చెయ్యి. దారిస్తారు."

కారు వేగం తగ్గలేదు.

"ధన్"మంటూ బులెట్ దూసుకుపోయింది.

ఒక్కసారిగా అందరూ చెల్లాచెదురయ్యారు.

రోడ్ ఖాళీ వెళ్ళొచ్చు.

"వాళ్ళ టైర్లకు గురిచూడు" సూట్‌కేసులోనుండి రివాల్వర్ తీస్తూ అన్నాడు.

కారును చాకచక్యంగా రోడ్డు క్రిందకు తిప్పి, వెంటనే రోడ్డుపైకి టర్న్ చేశాడు.

"ధన్"మంటూ వెనక అద్దం బ్రద్దలయింది.

భళ్ళున అద్దం పెంకులు మీద పడ్డాయి.

మరో బులెట్ ఫ్రంట్ అద్దాన్ని బ్రద్దలు చేసింది.

"హారియప్" సీటు క్రిందనుండి అరిచాడు.

ఒక్కమాటు కారు పెద్ద కుదుపుతో ఆగిపోయింది.

వెనక రెండు టైర్లూ తూటాల్తో నిండిపోయాయి.

డ్రైవర్ భుజంలో దూరిందో బుల్లెట్.

"మర్యాదగా లొంగిపొండి" పైకునుండి వినపడు

తురదో స్వరం.

"ఏం చేద్దాం సర్."

ఆయ నేం మాట్లాడలేదు.

"కాల్చేస్తారేమో?"

రెండు చేతులూ ఎత్తి దిగాడాయన.

మిగతా యిద్దరూ దిగారు.

పోలీసులు వారిని చుట్టుముట్టారు.

సి.ఐ. రవి బేడీలతో ముందుకు నడిచాడు.

"నేనెవరో తెలుసా? బేడీలు వేస్తే ఆ తర్వాత విచారిస్తావు" అన్నాడాయన.

ఈడ్చి గుద్దాడు కడుపులో.

"అమ్మా" అంటూ కడుపు పట్టుకు కూర్చున్నాడు.

"వీడ్ని వాన్‌లోకి విసరండి" ఆజ్ఞ ఇచ్చాడు.

వాన్‌లోకి అందర్నీ ఎక్కించాక కదిలింది.

లాకప్ రూం నుండి సి.ఐ. అరగంట తర్వాత బయటకొచ్చాడు.

"యూ హెల్ పే ఫర్ దిస్" రక్తం తుడుచుకుంటూ గొణుక్కుంటున్నాడా పెద్దమనిషి.

అతని పంచె పీలికలయిపోయింది.

వంటిమీద చొక్కా లేదు.

జుట్టు చిందరవందరగా వుంది.

అచ్చంగా వేటకెళ్తున్న జాలరిలా ఉన్నాడు.

ఆ పట్టణంలోని ఓ ప్రముఖ గ్యాంగ్ స్థావరాలమీదకు మరో అరగంటలో దాడి చేయబోతున్నాడు రవి!

* * *

"కంగ్రాట్యులేషన్స్ యంగ్ బాయ్స్. మీలా

యువకులు ముందుకు రావాలి" అన్నాడు కృష్ణ బృందాన్ని అభినందిస్తూ ఇన్‌స్పెక్టర్ రవి.

"ఒక్ థింగ్ సర్. మేం చెప్పింది విని మమ్మల్నే అరెస్ట్ చెయ్యకుండా ప్రొసీడ్ అయినందుకు మీకు ధన్యవాదాలు చెప్పుకోవాలి" అన్నాడు కృష్ణ.

"ఓ" అంటూ నవ్వేసాడు రవి.

"సర్ ఈ కేసులో పొలిటికల్ ప్రెషర్."

"ఐడోంట్ కేర్" అన్నాడు తేలిగ్గా రవి!

—:అయిపోయింది:—

# కుంభాకార కటకం

## చంద్రశేఖర అజాద్

శేఖర్ చేతిలో పెద్ద భూతద్దం వుంది.

అతని ప్రక్కన శామ్యూల్ ఉన్నాడు.

శామ్యూల్ దగ్గర కుంభాకార కటకం వుంది.

వాటినంత దగ్గరగా చూస్తుంటే వారిచుట్టూ వున్న వారందరికీ ఎంతో ఆశ్చర్యంగా వుంది. వారెప్పుడూ కుంభాకార కటకాన్ని అంత దగ్గరగా చూడలేదు. లాబరేటరీలో మాత్రమే అది వుంది. ఒకటి రెండుసార్లు సైన్స్ టీచర్ చూపించినా ఇంత దగ్గరగా చూపించలేదు. అందుకే వారంతా యెంతో ఆరాటంగా చూస్తున్నారు. వారికలా చూపించటంలో శామ్యూల్, శేఖర్ ఇస్తున్న భంగిమలు తమ తమ అభిమాన హీరోల్ని ప్రతిబింబిస్తున్నాయి.

"ఓరేయ్ ఈ అద్దం యెంత పవర్‌ఫుల్. అంటే ఇప్పుడు యెవరైనా సిగరెట్ ఇస్తే వెలిగిస్తాను" అన్నాడు శేఖర్.

. శేఖర్, శామ్యూల్ పదో తరగతి చదువుతున్నారు. అక్కడ వున్న అందరూ ఆ తరగతికి చెందినవారే. వారికా సమయంలో ఇంగ్లీష్ పిరియడ్ జరగాలి. టీచర్ గారు రాకపోవడంతో అందరూ గ్రౌండ్ మీద పడ్డారు.

ఆ స్కూలుకు పెద్ద గ్రౌండ్ వుంది. ప్రతిరోజూ ప్రేయర్ జరిగేచోట జెండా ఎగురవేయటంకోసం ఓ పోల్ నిర్మించారు. పోల్ చుట్టూ గుండ్రంగా మెట్లు నిర్మించారు. ప్రత్యేక సందర్భాలలో జెండా ఎగరేస్తుంటూరు. పిల్లలంతా ఆ మెట్లమీద కూర్చుని కబుర్లు చెప్పుకుంటుంటారు.

సూర్యుడు నడినెత్తిమీదకొస్తున్నాడు.

"సిగరెట్ వెలిగించటం కష్టం. కాయితం అయితే కాలుతుందేమో" అన్నారెవరో.

"ఏడ్చావ్. ఇది అర్థరూపాయి సరుకు కాదు. సిగరెట్టివ్వు ఒకే క్యాం సిగరెట్ ఇలా ఇవ్వరా" అన్నాడు శేఖర్.

చార్మినర్ సిగరెట్ అందించాడు శామ్యూల్.

శేఖర్ స్టైల్ గా అందుకున్నాడు.

ఎడంచేత్తో దాన్ని పట్టుకొన్నాడు. కుడిచేత్తో భూతద్దాన్ని సిగరెట్ మీదకు ఎయిమ్ చేశాడు, క్రమంగా దాని నీడను చిన్నదిగా చేస్తూ ఓ పాయింట్ దగ్గర ఆపేశాడు. అందరూ ఊపిరి బిగబట్టి చూస్తున్నారు. సూర్యకిరణాలు సూటిగా పడుతున్నాయి. ఆకాశం రంగులో స్పాట్ కనిపిస్తూంది.

క్రమంగా సన్నగా పొగ మొదలయింది. మరికొంచెం సేపు అలానే వుంచాడు. సిగరెట్ అంచువారగా కాలింది విజయగర్వంతో సిగరెట్ శామ్యూల్ కందించాడు.

శామ్యూల్ సిగరెట్ నోట్లో పెట్టుకొని ఓ దమ్ము లాగాడు. అతని నోటినుండీ, ముక్కునుండీకూడా పొగ రావటం అందరూ చూశారు.

"నిజంగానే వెలిగించాడు" అన్నారెవరో.

కొంతమంది సంతోషం భరించలేక చప్పట్లు కొట్టారు.

"ఎక్కడిదిరా" అన్నాడు మనోహార్.

"కొంటే వస్తుందిరా. శామ్యూల్ గాడి దగ్గర కుంభాకార కటకంలో నుండి నిన్ను చూస్తే ఎలా ఉంటావో తెల్సా?"

"ఒరేయ్....ఒరేయ్ ఒక్కసారివ్వరా చూసిస్తాను" ప్రతిమలాడతను.

"నీకా? ఇదేమన్నా తోలుబొమ్మనుకున్నావా? కుంభాకార కటకం! శ్యామ్ గాడి బాబాయి అర్మీనుండి తెచ్చాడు. ఇలాంటి కుంభాకార కటకాల నుంచి చైనావాళ్ళను చూసి ఓ గుండేసినాడంటే ఫినిష్. ఏం బాబాయి?" అన్నాడు శేఖర్.

శామ్యూల్ సిగరెట్ దమ్ములాగి చిద్విలాసంగా నవ్వాడు.

"ఒక్కసారివ్వరా" తిరిగి ప్రతిమాలాడతను.

"జాగ్రత్త. పగిలిందా వందరూపాయలు కట్టిపో" అన్నాడు. మనోహార్ యెంతో జాగ్రత్తగా అందుకొని చూశాడు. ఆ కటకంలోనుండి చూసింది. అతని జీవితంలో అదో అద్భుత దృశ్యం.

"అబ్బా భలేగుందిరా" అన్నాడు.

శేఖర్ గర్వంగా చూశాడు.

శామ్యూల్ నవ్వుతుంటున్నాడు.

అక్కడున్న వారందరికీ ఆశ్చర్యంగానూ, అసూయ

గానూ వుంది.

"నాక్కూడా ఇవ్వరా" అన్నాడు ఇంకో మిత్రుడు.

"ఓకేయ్. మీరంతా అలా కొట్టుకున్నారంటే ఎవడి చేతినుండో జారి పడిపోతే వాళ్ళ బాబాయి కాల్చేస్తాడు. ముందు అందరూ లైన్లో నిలబడండి. ఒక్కొక్కరే చూడండి. రెండేసి నిముషాలు. తిరిగి హిందీ క్లాసుకు టైమవుతుంది" అన్నాడు శేఖర్.

నవ్వుకుంటూ అందరూ లైన్లో నిలబడ్డారు. ఒక్కొక్కరి చేతిలోకి అది మారుతోంది. ఆకాశాన్ని, చెట్లనూ, శేఖర్ని. శామ్యూల్ని అంతా చూస్తున్నారు.

ఓ సూర్యకిరణం ఏటవాలుగా దానిమీదపడి రిఫ్లెక్ట్ అయి యెదురుగా వున్న ఓ గదిలోనుండి దూసుకుపోయి ఓ గోడమీద పడింది.

ఆ గది ఎన్.సి.సి. ఆఫీసర్ కృష్ణగారిది!

ఆయన కూర్చొని యేదో రాసుకుంటున్నాడు. ఓ క్షణం ఏం జరిగిందో అర్థంకాలేదు. తిరిగి కాయితంమీద కలం పెట్టబోయాడు. తిరిగి గోడమీద మెరుపు. కలం ప్రక్కన పెట్టాడు. వెనక్కి తిరిగి చూశాడు. దూరంగా పోల్ దగ్గర ఓ గుంపు కనపడింది.

"ఎవరన్నా కొట్టుకు ఛస్తున్నారా" అనుకున్నాడు.

సరిగ్గా ఫ్లాష్ అప్పుడాయన ముఖంమీద పడింది.

"వ్వాట్" అనుకుంటూ లేచాడు. మెల్లగా గది బయటకు వచ్చి తలుపు దగ్గరగా లాగాడు. మెయిన్ గేటునుండి బయటకొచ్చాడు.

అందరూ ఆనందించారు.

ఇంకొక్కడి వంతు మాత్రం వుంది. అతను కూడా చూసేడు.

"ఇంకెటివ్వ"

ఉలిక్కిపడి తలెత్తారు.

ఎదురుగా కృష్ణ మాస్టారు!

అందరూ ఒక్కసారిగా బిగిసిపోయారు.

ఎన్.సి.సి. ఆఫీసర్ అంటే అందరికీ హడల్. కృష్ణ ఆరడుగుల పైన వుంటాడు. కళ్ళు తీక్షణంగా ఉంటాయి. ఆయన ఈ ఊరికి వచ్చి నాలుగు సంవత్సరాలు కావస్తోంది. మొదటి సంవత్సరమయితే మొత్తం స్కూలంతా ఆయనంటే వణికిపోయేది. 'క్రమశిక్షణ' దేశానికి అవసరం అని ఆయన గట్టిగా అభిప్రాయపడేవాడు.

స్కూల్లోనే గాక బయటకూడా ఆయన అందరిమీద ఓ కన్నువేసి వుంచేవాడు. సిగరెట్లు త్రాగినట్లు కనిపించినా క్లాసు ఎగ్గొట్టి సినిమాలకు వెళ్ళినా అలాంటి వారందరినీ క్లాసులో పేరు పేరునా పిలిచి వాయించేసేవాడు.

అలాగే కొంతమంది ఊరవతల కాలువ దగ్గరకు వెళ్ళి ఈతలు కొడుతుండేవారు. ఆయన అకస్మాత్తుగా సైకిల్‌తో అక్కడ ప్రత్యక్షం అయ్యేవాడు. అప్పుడు చూడాలి వారి పరిస్థితి. కొంతమందయితే అతడి గుడ్డల్లోనే పరుగు. మరికొందరు కొంచెం సేపు నీళ్ళలోనే వుండటానికి ప్రయత్నం చేసేవారు.

క్రమంగా అలాంటివారి సంఖ్య తగ్గింది.

ఈ నడుమ కాలంలో ఆ ప్రమాణాలు తగ్గాయి.

"మాస్టారు సిగరెట్లు కాల్చటం నేను చూశాను" అనటం ప్రారంభించారు కొంతమంది. అయినా సరే ఆయన కమాండింగ్ పవర్ పూర్తిగా తగ్గిపోలేదు.

"ఎవరిదిరా ఇది" గంభీరంగా అన్నాడు.

"శామ్యూల్‌ది సార్" అందించారు.

ఆయన దాన్ని పరిశీలిస్తూ "నీ కెక్కడిదిరా" అన్నాడు.

"మా బాబాయి తెచ్చాడు సార్."

"ఏ బాబాయి."

"ఆర్మీలో పనిచేస్తున్నాడు సార్."

"ఏమిటి మీరందరూ ఎండలో తిరుగుతున్నారు."

"ఇంగ్లీష్ టీచర్ రాలేదు సార్."

"రాకపోతే ఇలా గ్రౌండ్లో తిరగాలా? వెంటనే వెళ్ళి క్లాసులో కూర్చోండి" గద్దించాడు కృష్ణ.

అందరూ ఒక్క సారిగా కదిలారు.

"ఒరేయ్. నువ్వు నాతోరా" అంటూ ముందుకు నడిచాడు కృష్ణ.

"అది కాదురా ఇంత ఖరీదయిన వస్తువు ఇలా తేవచ్చా. మీ బాబాయితో చెప్తానుండు. నీకు రోజు రోజుకూ డిసిప్లిన్ తగ్గిపోతూంది. ఎవడి చేయన్నా జారితే యేమవుతుంది?" అన్నాడు మళ్ళీ.

"ఊరికే చూసి నేర్చుకుందామని తెచ్చాను సార్."

"ఏమిటి నువ్వు చూసి నేర్చుకునేది యూస్‌లెస్ ఫెలో. ఏంరా శేఖర్ క్లాసుకు రోజూ వెళుతున్నావా?"

"వెళుతున్నాను సర్" అన్నాడు వినయంగా.

"ఏం వెళుతున్నావో మీ ఇంటి దగ్గర బడికిమాత్రం పంపిస్తున్నారు. వాళ్ళకి మీరు యేం చదువుతున్నారో, ఛస్తున్నారో తెలిస్తేకదా? మీరేం చెబితే అది వేదం. అవునా?"

శేఖర్ మాట్లాడలేదు.

"ఓరేయ్ శ్యాం.... నెక్స్ట్ పిరియడ్ యేమిటి?"

"హిందీ సార్."

"సరే సాయంకాలం వచ్చి ఇది తీసికెళ్ళు. ఈసారి

ఎగ్జిబిషన్ పెట్టాకంటే వాయించేస్తాను. అర్థమయిందా?"

"అలాగే సార్" అన్నాడు శ్యామ్.

అప్పుడే గంట మ్రోగింది.

"సరే టైమయింది. క్లాసుకు వెళ్ళిరండి" తన గది లోకి నడుస్తూ అన్నాడు కృష్ణ మాస్టారు!

## 2

హిందీ మాస్టారు క్లాసులోకి అడుగుపెట్టాడు.

"గుడ్ మార్నింగ్ సార్" అంటూ అందరూ ఒక్క సారిగా లేచినిలబడ్డారు.

"నమస్తే బైఠీయే" అన్నాడాయన కళ్ళజోడు నుండి అందర్నీ చూస్తూ.

ఆయన కళ్ళజోడుకు చెందిన అద్దాలు చాలా మందంగా వుంటాయి.

"వీడికి యింత పెద్ద సైటో. సోడాబుడ్డంత లావు పాటి అద్దాలు" అని శేఖర్ ఓసారి కామెంట్ చేశాడు.

అది విని అందరూ ఆనందించేరు.

ఒక్క రజబ్ ఆలీ మాత్రం దొరికావురా అనుకొన్నాడు.

రజబ్ ఆలీ హిందీ మాస్టారి దగ్గర ట్యూషన్ చదువు తున్నాడు. మాస్టారు హిందీ పేపరు దిద్దుతున్నప్పుడు ఈ విషయం ఆయన చెవిన పడేశాడు. వెంటనే ఆయన జోళ్ళు సర్దుకొని "ఎవడ్రా వాడు" అన్నాడు.

"శేఖర్ సార్."

"సన్నగా, వెనక బల్లల దగ్గర చేరి గొడవ చేస్తుం టాడు, వాడేగా?"

"అవును సార్."

"సర్లే" అన్నాడు.

మరుసటి రోజు క్లాసుకి వెళ్ళాక కళ్ళజోడునుండి

శేఖర్ హాజరయ్యాడనే విషయం గ్రహించాడు.

పాఠం చెప్పటం మొదలయింది.

కొంచెం సేపయ్యాక శేఖర్‌ను నిలబెట్టి ప్రశ్నలడిగాడు.

శేఖర్ సమాధానం చెప్పలేకపోయాడు.

“బల్లెక్కు.”

శేఖర్ బల్లెక్కాడు.

“ఏడి మొఖం చూడండిరా. అలంకారానికొస్తాడు. దేశంమీద వదిలేశాడురా మీ బాబు. నువ్వెలాగోలా పదో తరగతి గట్టెక్కితే ఓ పాతిక, డిగ్రీ పూర్తిచేస్తే ఏభై. ఎందుకు మా ప్రాణం తియ్యటానికి రావటం. హిందీ రచనా కొన్నావా?” అన్నాడు.

“కొనలేదండి.”

“ఎందుకని?’

“డబ్బుల్లేవండి.”

“నీ దగ్గరా! మొన్న ‘లవ్ ఇన్ ఆంధ్రా’ సినిమా దగ్గర మీ గ్యాంగంతా కనపడిందిగా. మీ దగ్గర డబ్బు లేకపోవటం యేమిటి? హిందీ అంటేనూ, హిందీ మాస్టారంటేనూ మీకు బొత్తిగా విలువలేకుండా పోయింది. క్లాసయ్యేంతవరకూ బల్లెక్కే వుండు.”

“కాళ్ళు నొప్పులు సార్” అన్నాడు శేఖర్.

“అయితే ఏం చేస్తానంటావ్.”

“వెళ్ళిపోతాను సార్.”

“ఓహో, హాజరయ్యిందిగా. వెంటనే ఆ పని చెయ్యి నాయనా” అన్నాడాయన.

వినయంగా బల్లదిగి పుస్తకాలు తీసుకుంటున్నాడు శేఖర్.

"నేనుకూడా వెళ్తాను సార్" అంటూ లేచాడు చంద్రం.

ఒక్కసారిగా క్లాసంతా ఘొల్లుమంది.

చంద్రానికి ఓ కాలు అవిటిది.

"ఎందుకనోయ్" అన్నాడు.

"నాకూ పాఠం రాలేదు సార్."

"పోనీ విను."

"శేఖర్ వెళ్ళిపోతున్నాడుగా సార్."

"నువ్వు 'రచనా' కొన్నావా?"

"లేదు."

"ఏ నీక్కూడా డబ్బుల్లేవా?"

"మా నాన్న ఊళ్లో లేడు సార్."

"సరే, వెళ్ళిరా బాబు" అన్నాడు.

క్లాసంతా ముసి ముసి నవ్వులు నవ్వుతుండగా వారిద్దరూ బయటికెళ్ళిపోయారు.

'హిందీ రచనా' అనే పుస్తకం ఆయనే స్వయంగా రాశాడు. దాని ఖరీదు రెండురూపాయలు. ఆయన బడి ప్రారంభమయిన నాటినుండి ఆ పుస్తకం కొనమని అందర్నీ వత్తిడిచేస్తున్నాడు. మంచి విద్యార్థులంతా ఆ పుస్తకం కొనేశారు.

శేఖర్ లాంటివారు మాత్రం ఆ పుస్తకం ఖరీదు 'అయిదురూపాయలు' తెచ్చుకొని భోంచేశారు.

హిందీ మాస్టారికి తన 'రచనా' యెవరెవరు కొనలేదో బాగా గుర్తు. వారందరినీ అవకాశంకోసం చూస్తున్నాడు.

ఆయనకు ఒక్క రజబ్ అలీ అంటేనే ప్రాణం.

అతనొక్కడే మరి తన ట్యూషన్ చదువుతుంది.

హిందీ మాస్టారుకేదో పేరున్నా అందరికీ ఆయన

హిందీ మాష్టారే. అటెండెన్స్ వేయటం ఆరంభించాడు. శేఖర్, చంద్రం, శామ్యూల్ లాంటి వారి విషయంలో వారిని చూడందే ప్రెజెంట్ మార్కు చెయ్యడు.

'రజబ్ అలీ' ఆయనకు చెప్పకుంటే మాత్రం వాళ్ళలో యెవరు రాకపోయినా బదులుగా మరొకరు "ప్రెజెంట్ సార్" అంటారనే విషయం ఆయనకు తెలిసి వుండక పోను.

అటెండెన్స్ పూర్తయింది.

"ఈరోజు ప్రోగ్రెస్ కార్డులు తెమ్మన్నాను. తెచ్చారా?"

"తెచ్చాం సార్" అన్నారంతా.

"ఒక్కొక్కరే పట్రండి" అన్నాడాయన.

అందరూ తీసుకెళ్ళి అందించారు.

అందులోనుండి రెండు కార్డులు మాత్రం ప్రక్కన పెట్టేడు.

"నాయనా చంద్ర శేఖరులూ బల్లెక్కండి" అన్నాడు.

ఇద్దరూ బల్లెక్కారు.

"ఏమోయ్ శేఖర్ నీకు యేభై ఒక్క మార్కు లొచ్చాయ్. చంద్రం బాబుకు నలభై ఆరే. ఏం నాయనా అరవై నాలుగు మార్కులు వేసుకోపోయావా? చూడండి బాబూ ఇక్కడ వెర్రి వెంగళప్పలు ఎవరూ లేరు. మొన్నె కదటోయ్ అందరిముందు అయిదుమార్కులొచ్చి నువ్వు, ఆరు మార్కులొచ్చి వాడు బల్లెక్కారు. ఇంటి దగ్గర మీ మార్కులుచూసి ఆనందించి వుంటారు. ఇంతకీ ఈ సంతకాలు మీ బాబులవేనా?"

"మా నాన్నదే సార్" అన్నారిద్దరూ.

"ఏదన్నా తప్పు చెయ్యాలన్నా తలకాయుండా

లోయ్. ఎక్కువ మార్కులు వేసుకున్నారనుకో. వాకిచ్చేటప్పుడయినా తుడిచేసి ఇవ్వద్దటోయ్" అన్నాడు.

"మర్చిపోయాం సార్."

"ఫర్వాలేదు. ఆ విషయం నేను చూసుకుంటాను కదా. అది సరే ఎడంచేత్తో వాడికి నువ్వూ, నీకాడూ సంతకాలు చేశారా?"

"లేదండి "

"మంచిది. హిందీ అంటే మీ కెవ్వరికీ లెక్క లేకుండా పోయిందోయ్. పదిహేను మార్కులొస్తే చాలు కదా. ఏదో హాస్యకథరాస్తే మాష్టారు మార్కు లేస్తాడనుకుంటున్నారు. చక్కగా భాష నేర్పుతాను 'రచనా' కొనండర్రా అంటే మీ దగ్గర డబ్బుండదు. ఈ వయసుకే మార్కుల షీట్లు మార్చేస్తున్నారు. పెద్దయితే తలరాతలే మార్చేట్టున్నారు" బల్ల దిగండి" అన్నాడు కోపంగా.

"హిందీ రచనా కొంటాం సార్" అన్నారిద్దరు.

"నిజంగానా?" ఆశ్చర్యంగా అడిగాడు మాష్టారు.

"అవునండి."

"ఆ విషయం హెడ్ మాష్టారికి చెప్పండి. పదండి" అన్నాడాయన.

క్లాసంతా ఒక్కసారిగా నవ్వుల్తో నిండిపోయింది. శేఖర్, చంద్రం వదనాలు ఒక్కసారిగా మాడి పోయాయి.

హెడ్ మాష్టారు చండశాసనుడు.

ఆయన పేరు ఆంజనేయప్రసాద్.

ఇలాంటి వేషాల్ని యేమాత్రం అంగీకరించడు.

క్లాస్ తదితరులందరికీ తక్కువ మార్కులే వచ్చినా

వారెవరూ ఈ పని చెయ్యలేదు. శ్యామల కొంచెం ఆందోళనగా వుంది. మాటిమాటికి కృష్ణ మాస్టారు, కుంభాకార కటకం, బాబాయి గుర్తొస్తున్నారు. లేని పోనిది ఈ రోజు అది తీసుకొచ్చాను కదా అని మధనపడుతున్నాడు.

హిందీ మాస్టారు ఆంజనేయ ప్రసాద్ గారి ముందు వినయంగా ప్రోగ్రెస్ కార్డులుంచేడు.

"ఇతనికి అయిదు మార్కులూ, అతనికేమో ఆరూ వచ్చాయి. అవేమో ఈ కార్డుల్లో యేభై ఒకటి, నలభై ఆరు అయ్యాయి. ఆ సంతకాలుకూడా కేవలం వీరే పెట్టి వుంటారని నా నమ్మకం సార్" అన్నాడు.

ఆయన కోపంగా చూసి కార్డులందుకున్నాడు.

అందులో స్పష్టంగా మార్కులు దిద్దినట్లుగా వుంది.

"క్లాసులో యేవాడూ సరిగ్గా కూర్చోడు. వీడ్ని బయటకు పంపిస్తే వాడూ వెళ్తానంటాడు. ఒక్క ఎక్స్‌ట్రా పైజ్ చెయ్యరు. ఇతనున్నాడు చూశారు చదువుచెప్పే మాస్టర్లకు పేర్లు తగిలించడంలో మహానైపుణ్యం కల వాడు. మరి ఇతనికి ఒక కాలే వుంది. ఆ రెండో కాలు కూడా ఉంటే దేశాన్ని బతకనిచ్చేవాడు కాదు."

హెడ్ మాస్టారు తలూపాడు.

"తమరి దృష్టికి తెచ్చాను. మరి నేను క్లాసుకు వెళ్తాను."

"వెళ్ళండి. నేను మాట్లాడతాను" అన్నాడు హెచ్.ఎమ్.

"ఎవరబ్బాయిరా నువ్వు" అన్నాడు శేఖర్‌ను చూస్తూ.

చెప్పాడు.

"కన్నాలు వేసుకొని బ్రతకరామా! నీకు చదు వెందుకు?"

శేఖర్ తల వంచుకున్నాడు.

"ఈ పుస్తకం నువ్వు పెట్టావా?"

"లేదు సార్."

"చంపేస్తాను. వెధవా .... పోలీసు రిపోర్టిస్తాను ఫోర్జరీ చేశావని. ఇప్పుడే సస్పెండ్ చేసి పారేస్తాను. ఒక్క ముక్క "డిబార్" అంటూ రాశానంటే మీ జీవితాలు నాశనమైపోతాయి. దున్నపోతుల్లా వున్నారు. సరిగ్గా చదువుకు చావలేరూ."

"తప్పయిపోయింది సార్."

"తప్పా.... వెధవల్లారా మీ నాన్నల్ని తీసుకొచ్చే దాకా స్కూలుకు రాకండి" అరిచాడాయన.

అప్పుడే కృష్ణ మాస్టారు గదిలోకి అడుగు పెట్టాడు,

"నమస్తే సార్" అన్నాడాయన.

"రండి" అన్నాడు హెడ్మాస్టర్.

"వాట్ హాపెండ్ సార్" అన్నాడు వాళ్ళను చూస్తూ.

ఆయన వివరించాడు.

"వెధవల్ని సస్పెండ్ చేస్తున్నాను" తిరిగి అరిచాడాయన.

తల వంచుకు నిలబడ్డ వారిద్దరినే చూశాడు కృష్ణ.

"ఏరా శేఖర్, నీకేమయింది. ఇలా చేస్తున్నావు?"

"వాడు మీకు తెలుసా?"

"తెలుసండి. వీడి ఫాదర్ ఈ రోజుకి పొలంవెళ్ళి కష్టపడుతుంటాడు. చాలా మంచివాడు."

"అందుకన్నమాట ఇలా తయారయింది. సాయంకాలం

కల్లా మీ నాయన్ని వెంటపెట్టుకురా."

శేఖర్ తలూపాడు.

"వీళ్ళ సంగతి నాకు వదిలెయ్యండి సార్. నేను చూసుకుంటాను. వీళ్ళ యింటి దగ్గర రిపోర్టు చేస్తాను" అన్నాడు కృష్ణ.

హెడ్ మాస్టారికి కృష్ణగారంటే ప్రత్యేకాభిమానం వుంది.

శేఖర్, చంద్ర మొఖాల్లో నెత్తురుచుక్క లేదు.

"ఇదే చివరి వార్నింగ్. ఈసారి పిచ్చి వేషాలువేస్తే టి.సి. ఇచ్చి పంపేస్తాను. వెళ్ళండి" అన్నాడు హెచ్.ఎమ్.

"వెళ్ళి నా రూమ్ దగ్గరుండండి" అన్నాడు కృష్ణ.

వాళ్ళిద్దరూ తలుపు తీసుకొని వెళ్ళిపోయారు.

పదినిమిషాలు మాట్లాడాక తన రూమ్ దగ్గరికి వచ్చాడు కృష్ణ.

అక్కడే నిలబడ్డ వాళ్ళిద్దరినీ చూశాడు. లోపలకు పిలిచాడు.

"హెచ్ ఎమ్.గారు చాలా సీరియస్‌గా వున్నారు. సస్పెండ్ చేయాలంటున్నారు. మీకు తెలుసుకదా ఆయ నిలాంటివి సహించరు. వెంటనే మీ నాన్నల్ని పిలుచుకు రావాలి. తప్పు చేసి ప్పుడు ఇవన్నీ సహజమే. తిడితే తిడతారు. ఇంకెప్పుడూ ఇలాంటి పనులు చేయకండి. అర్థమయిందా?" అన్నాడు.

తలలూపారు ఇద్దరూ.

"వెళ్ళిరండి" అన్నాడు.

ఇద్దరూ బయటకొచ్చారు.

"ఏం చేద్దాంరా" అన్నాడు శేఖర్.

"మా బాబుకు తెలిస్తే కాళ్ళిరగగొడతాడు" అన్నాడు చంద్రం.

"పోనీ పీడావదులుద్ది. ఒక్క కాలుండి ఉపయోగం యేముందిలే."

"విధవా—ఎగతాళా? నాకేం ఫర్వాలేదు. మా బాబాయిని తీసుకొస్తా. ఆయన్ని కాకాపడితే చాలు."

"ఈ కృష్ణగాడు మా అయ్యని తెచ్చేదాకా ఊరుకునేటట్లు లేడు. ఏం చెయ్యాలి?"

"రెండు రోజులు బడికి రావటం మానేస్తే ఈ విషయం వాళ్ళే మరిచిపోతారు" అన్నాడు చంద్రం.

"రెండు రోజులుకాదు రెండు నెలలు మానేసినా ఆయన మరిచిపోడు. అసలు సోడా బాబాయి ఛస్తే మర్చిపోడు. మనం యేదో ఒకటి చేయాలి. లేకపోతే సస్పెండ్ చేసినా చేస్తాడు. ఈ విషయం ఛస్తే మా ఇంటిలో తెలవకూడదు" అన్నాడు శేఖర్.

"ఏం చేస్తానంటావు" అన్నాడు చంద్రం.

శేఖర్ మనసులోకి వెంటనే ఓ ఆలోచన వచ్చింది.

"నేను గురుడ్ని కాకాపడతాలేరా?" అన్నాడు.

"సర్లే. నేను వెళ్తా" అంటూ చంద్రం వెళ్ళాడు.

"ఏమిటిరా మళ్ళా వచ్చావు" అన్నాడు శేఖర్ని చూస్తూ కృష్ణ.

"సార్. మా ఇంటిదగ్గర ఈ విషయం తెలిస్తే చంపేస్తారు" అన్నాడు దీనంగా.

"నన్నేం చెయ్యమంటావురా" అన్నాడు కుంభాకార కటకం పరిశీలిస్తూ.

"హెడ్మాస్టర్ కి యేదోఒకటి సర్ది చెప్పాలి సర్."

"ఏం చెప్పమంటావ్?"

"మా నాన్న మీతో మాట్లాడాడని, ఇంకెప్పుడూ ఇలాంటి పనులు చెయ్యవని."

"మీ నాన్నను నా దగ్గరకు రానీ."

"ప్రామిస్ సార్. ఇకనుండి బుద్ధిగా వుంటాను."

"నాకు నమ్మకంలేదు" అన్నాడాయన.

"లేదు సార్. నేను మారిపోతున్నాను సార్" అంటూ అటూ ఇటూ చూశాడు.

"ఏమిటిరా" అనుమానంగా అడిగాడు.

"మీకో రహస్యం చెప్పాలి సార్" అన్నాడు మెల్లగా.

కృష్ణ భృకుటి ముడిపడింది.

కుంభాకారకటకం చేతిలోనికి తీసుకున్నాడు శేఖర్.

"ఇది శామ్యూల్ బాబాయి తెచ్చింది కాదండి" మెల్లగా అన్నాడు.

ఉలిక్కిపడ్డాడు కృష్ణ.

"మరి."

"అది రహస్యం సార్."

"ఫర్వాలేదు. నేనెవరికీ చెప్పను."

"ఈ విషయం నేను చెప్పినట్లు తెలిస్తే గొడవలయి పోతాయి సార్."

"పిచ్చివాడా. కూర్చో. ఈ విషయం మరో కంటికి తెలియదు. ఏమిటి? యేమయింది?" అన్నాడు.

శేఖర్ చెప్పటం ఆరంభించాడు....

కృష్ణ మొఖంలో రంగులు మారిపోతున్నాయి.

"గుడ్. మంచి ఇన్ఫర్మేషన్ ఇచ్చావు."

"మరి మా నాన్న విషయం."

"ప్రస్తుతం ఆ విషయం గురించి మరిచిపో."

రాత్రి పదకొండు గంటలవుతోంది.

ఆకాశంలోకి చంద్రుడు ఇంకా రాలేదు. బాగా చీకటిగా వుంది.

హైస్కూలు గ్రౌండ్లో అక్కడక్కడా యేవాటి వృక్షాలో కనిపిస్తున్నాయి' అవి విశాలంగా ఎదిగిపోయి వున్నాయి. మెయిన్ రోడ్డుకు కలుపుతూ స్కూల్లోకి ఓ రోడ్డు వుంది.

ఆ స్కూలు భవనం బ్రిటీష్ కాలంలో కట్టింది. చాలా దృఢంగా వుంటుంది. వాటి గట్టితనాన్ని అప్పుడప్పుడు కృష్ణగారు పరిశీలిస్తుంటారు. ఆయన తుపాకిని గోడకు యెయిమ్ చేస్తే చిన్న పెచ్చు లేస్తుందంతే విశాలమైన ఆ స్కూలు ఆవరణలోనే జూనియర్ కాలేజి త్వరలో యేర్పాటవుతుందంటున్నారు.

బహుశా రాష్ట్రం మొత్తంలోనే ఇలాంటి ప్లేగ్రౌండ్ కల స్కూల్స్ అరుదుగా వుంటాయి. రాత్రిపూట అనేక మందికి అనేక విధాలుగా ఈ స్థలం ఉపయోగపడుతుంటుంది. ఒక్కోసారి ఉదయం పిల్లలు క్లాసుల్లోకి రాగానే నలిగి పడిపోయిన పూలు కన్పిస్తుంటాయి.

ఆ మొత్తం భవనాలన్నింటికీ ఒకడే వాచ్ మెన్. అతని ఇల్లుకూడా అక్కడకు దగ్గరగా వుంటుంది. నైట్ వాచ్ మెన్ యెప్పుడూ అక్కడకు పోడు. సాయంకాలం బడి అయిపోగానే అన్ని గదులూ మూస్తాడు. అంతే.

ఆ భవనానికి రెండు అంతస్థులున్నాయి. వెనకాల ఓ పెద్ద హాలు. దాని ప్రక్క చిన్న బిల్డింగ్. మూడో అంతస్థుమీద గదులేం వుండవు ఆ స్కూలు యేర్పడటానికి డబ్బు డొనేట్ చేసినాయన పేరు వుంటుంది.

ప్రత్యేక సందర్భాలలో జెండా ఎగరవేయటానికి ఓ పోల్ వుంటుంది. మరో ప్రక్క ఓ గంట నిర్మించబడి వుంది.

రెండో అంతస్తునుండి పైకి వెళ్ళటానికి మెట్లు లేవు. అయితే ఓ ఖాళీ ప్రదేశం మాత్రం వుంటుంది. బహుశా మెట్లు కట్టాలని తలంచి అలా యేర్పాటు చేసి వుంటారు. కానీ కట్టలేదు. ఆ ఖాళీభాగంలో ఓ నిచ్చెన నిలబెట్టబడి వుంటుంది. ముఖ్యమైన ఫంక్షన్లప్పుడు పైకి వెళ్తారు. అక్కడ ఓ జెండా యెగరెయ్యటం క్రింది వరకూ తోరణాలు కట్టడం చేస్తారు.

ఆ భవనం గదులకు అద్దాలు బిగించబడి వుంటాయి. వాటిలో చాలా భాగం పగిలిపోయి వుంటాయి. అప్పుడప్పుడు వాటిని మారుస్తుంటారు. అయినాసరే క్రింద నుండి పైకి రాళ్ళు విసరటంలో తమ ప్రావీణ్యం ప్రదర్శిస్తుంటారు. ఎవరెన్ని అద్దాలు పగలగొడితే అంత గొప్ప!

ఆ భవనాలకు చెంది అనేక రకాల కథలు ప్రచారంలో ఉన్నాయి.

చీకటిపడితే ఆ ప్రాంతమంతా నిర్మానుష్యంగా వుంటుంది ప్రధాన రహదారిమీద ఒకరో, అరో నడుస్తుంటారు. విశాలంగా యెదిగిన వృక్షాలు భయంకరంగా కన్పిస్తుంటాయి, వాటి వంక చూడటానికే చాలామంది భయపడుతుంటారు. కొంతమంది ఆ చెట్లవరకూ వస్తారు. స్కూలు భవనంలోకి వెళ్ళటానికి సాహసించరు. కారణం ఆ భవనంలో ఓ దెయ్యం తిరుగుతుందని ప్రజలు అనుకుంటూ వుంటారు. కొంతమందయితే తాము చూశామని కూడా చెబుతుంటారు.

ప్రస్తుతం ఆ గ్రౌండ్‌లో చల్లటి ఇసుకమీద మొత్తం

యేసుగురు చూస్తున్నారు. అందులో శామ్యూల్ కొంచెం నిరాశగా వున్నాడు. శేఖర్ కి భయం భయంగా వున్నా ఏం మాట్లాడలేదు.

వాళ్ళంతా ఒకచోట ట్యూషన్ చదువుతున్నారు. ఆయనకూడా స్కూల్లో టీచర్. రాత్రిపూట ఆయన ఇంటిలోనే పడుకుంటారు. వారంతా తెల్ల వారిఝాములో లేచి చదువుతారని ఇంటి దగ్గర భావిస్తుంటారు.

రాత్రి పదిగంటలు దాటితే అక్కడ వుండరు. ఒక్కొక్కరే బయటికి వచ్చేస్తారు. అక్కడినుండి కార్య క్రమం ఆరంభమవుతుంది. రెండో ఆట సినిమాకెళ్ళటమా మరేదైనా చెయ్యటమా అనేది వారి చర్చల్లో వుంటుంది.

వారికి అంతగా డబ్బుల సమస్య యెదురవదు. ఎవరో ఒకరు యేర్పాటు చేస్తారు వారి పనులు చాలా చిత్రంగా వుంటాయి. గౌడ్ అనేవాడు పగటిపూట యేమాత్రం తీరిక దొరికినా ఊరంతా తిరుగుతాడు. ఏయే ఇళ్ళలో కొబ్బరి చెట్లున్నాయో .... ఏవి కాపుకొచ్చాయో గుర్తు పెట్టు కుంటాడు.

రాత్రివేళ అందరూ కలిసి బయలుదేరుతారు. అందరూ నిద్రపోతుంటారు. గౌడ్ డ్రాయర్ మీదుంటాడు. చక, చక చెట్లు ప్రాకటంలో అతను గొప్ప నేర్పరి. అతని చేతిలో కత్తిలాంటిదికూడా వుండదు. కాయల్ని మెలి త్రిప్పి తెంచుతాడు. వారితోపాటు ఓ దుప్పటి తెస్తారు. నలుగురూ నాలుగు ప్రక్కల పట్టుకుంటారు. అందులోకి విసురుతాడు. పెద్ద శబ్దంకాదు.

అలా వారు కావాల్సినంత కొబ్బరికాయలు కోసుకున్నాక గ్రౌండ్ లోకి వెళ్తారు. రాళ్ళతో మూతలు

పగలగొట్టి నీళ్ళు తాగి పారేస్తారు.

అలా దొంగతనంగా కొబ్బరికాయలు తాగటం వారికి ఆనందాన్నే కాదు కలిగించేది - అది వారి దృష్టిలో గొప్ప వీరోచిత కార్యం. ఆ అనుభవాన్ని తలుచుకొని విపరీతంగా సంతోషిస్తారు.

ఊళ్లో పోలీసుల నిఘా అంతగా వుండదు. ఎక్కువగా ఈ పనులకు అమావాస్య రోజుల్నే ఎన్నుకొంటారు. ఒక్కోసారి గొడవ జరుగుతుంది. పారిపోయి వస్తుంటారు.

తరచుగా ప్రాంతాలు మార్చటం. దొంగతనానికీ దొంగతనానికీ నడుమ కొంత గ్యాప్ వుండేలా చూడటం చేస్తారు. యువకులుగా తాము నిర్వర్తించాల్సిన మహత్తర కార్యక్రమాలు ఇంతకుమించి వేరే యేం లేవని వారి అభిప్రాయం.

"అది కాదురా, ఎట్లా చూశాడో చటుక్కున వచ్చి లాక్కున్నాడు" అన్నాడు శామ్యూల్.

"అసలు నిన్నది బడికి తెమ్మందెవరోయ్" అన్నాడు నరసింగరావు.

"ఇంతకూ యిప్పుడిస్తాడంట?"

"రెండు రోజుల్లో ఇస్తానన్నాడు" అన్నాడు శామ్యూల్.

"సర్లే. దాని గురించి కంగారేముంది - ఇప్పుడు కార్యక్రమం ఏమిటి?"

"ఏం చేద్దాం. నా దగ్గర డబ్బులేదు" అన్నాడు శ్యామూల్.

ఎవరి దగ్గరా డబ్బులేదు. అంతకుముందు రోజే రెండు డజన్ల కొబ్బరికాయలు బ్రాహ్మల ఇంటినుండి తెచ్చుకొని తాగారు.

"నిన్న కాయలే కాయల్రా. ఎంత తియ్యగా వున్నాయో!"

"పొద్దున్నే చూసుకొని తిట్టిన తిట్టు తిట్టరు."

"దొంగ ముండా కొడుకులు ఎంచక్కా కాయలన్నీ వాళ్ళ యెదాన కొట్టుకున్నారు" అభినయించి చూపాడు రాము.

"ఏం తిట్టినా అవన్నీ గాల్లోనే కలిసిపోతాయి. మనకు తగలవు."

"అది సరేరా. ఈరోజు ఓ పని చేద్దాం. పావురాలు పట్టుకుందాం" అన్నాడు నరసింగరావు.

"ఎక్కడ?"

"ఎక్కడేమిటి! మేడమీద! అడవి పావురాలు. భలే ఖరీదు."

"ఎవడు కొంటాడు?"

"అవన్నీ నేను చూసుకుంటాను. నా దగ్గర బ్యాటరీ లైటుకూడా వుంది. రామయ్య ఈ రోజు అక్కడ లేడు కదా" అన్నాడు.

"వుంటే మాత్రం యేమంటాడు. రెండ్రూపాయలిస్తానంటే సరి."

"అలా అయితే వెళ్దాం. రెండు మూడు జతలు దొరికినా నాలుగయిదురోజులు టైం పాసవుతుంది. ఉదయమెప్పుడో ఓ సిగరెట్ తాగాను" అన్నాడు నరసింగరావు.

"నేను రానురా" అన్నాడు శేఖర్.

"ఎందుకనంట."

"నాకు భయం. అక్కడ దెయ్యం తిరుగుతుందట."

"అదంతా హరికథ."

"ఏమో వాడు మాత్రం భయం."

"అదికాదురా. ఇంతమంది వెళ్తున్నాం. దెయ్యం ఏంచేస్తుందంట. ఒంటరిగా వెళ్ళినా భయపెడుతుందను కోవచ్చు."

"ఆమాటకొస్తే రోజా రామయ్య కాపలా వుండటం లేదా? అతన్నేం చెయ్యటంలేదెందుకు?" అన్నాడు గాడ్.

"దెయ్యంలేదు. పాడూలేదు. అంతా భ్రమ. ఇప్పుడా చెట్టుకేసి చూస్తుంటే నల్లగా కనిపిస్తూంది. దాన్ని నువ్వు దెయ్యం అంటావు అదే దగ్గరకు వెళ్ళి చూడు. రోజా నువ్వు చూసేదే ధైర్యం వుండాలేగాని ఇలాంటివి ఏం చెయ్యావు. నీకెందుకు మా వెనకాల వుండు. నీకేం కాదు."

"అదికాదురా. అడ దెయ్యం వుందని చెప్పుకుంటారు" అన్నాడు శేఖర్.

"అవునయ్యా ఈ స్కూలుకు డొనేషన్ ఇచ్చిన డాక్టర్ గారి కుటుంబంలో ఓ అమ్మాయి చచ్చిపోయింది. ఆయనకూడా చచ్చిపోయాడు. అసలా ఆమాటకొస్తే ఆ కుటుంబంలో మరికొందరు పోయారు. ఇంకా పోతారు. వారంతా ఇక్కడే కాపురముంటారా?" అన్నాడు నరసింగరావు.

"మరి పుకార్లు."

"నిర్మానుష్యంగా వుంటుందికదా. అందుకని జనం కథలు చెప్పుకుంటారు."

"మన స్కూల్లో కొంతమంది చూశామంటూ చెబుతుంటారు."

"అవన్నీ కోతలురా. నీకెందుకు మేమున్నాం. రా" అన్నాడు.

శేఖర్ భయం భయంగానే అంగీకరించాడు.

"ఎంతకూ పావురాలు దొరుకుతూవుంటాయా?" అన్నాడు శామ్యూల్.

"ఆనందంగా రాత్రిపూట గూటిలో హాయిగా నిద్ర పోతుంటాయి. తెచ్చుకోవటమే."

"అమ్ముదామా?"

"అవును. ఎవరికన్నా కావలిస్తే తీసుకోండి. వాటి మాంసం అంటే చాలామందికి భలే ఇష్టం" అన్నాడు నరసింగరావు.

"మాంసం యెందుకులే. ఆ అమ్మేపనేదో నువ్వే చూడు. ఎల్లుండి కొత్త సినిమా వస్తోంది" అన్నారు.

"బయలుదేరుదామా" అన్నాడు.

అందరూ ముందుకు నడిచారు.

మెయిన్ గేట్ తెరుచుకొని లోపలకు ప్రవేశించారు. అక్కడినుండి మేడమీదకు మెట్లుంటాయి. ఓ ప్రక్క నుండి మొగపిల్లలు వెళ్తే మరోప్రక్కనుండి ఆడపిల్లలు వెళ్తారు. ఆడపిల్లల మెట్లప్రక్కనే పైకి వెళ్ళటానికి నిచ్చెన వుంటుంది. మామూలుగా మెట్ల దగ్గర తలుపు వుంది. గతంలో దానికి తాళంవేసేవారు. ఆ తలుపుకో గొళ్ళెం ఊడిపోయింది.

నరసింగారావు తలుపు నెట్టాడు. కిర్రుమంటూ వెనక్కు వెళ్ళింది. శేఖర్ ఇద్దరి నడుమ వున్నాడు. మిగతా వారందరికీ భయం లేకపోయినా యేదో మూల బెరుకుగా వుంది.

నరసింగారావు చేతిలో టార్చిలైటు వుంది. అవసరమయితేగాని వేళ్ళ సందుల్లోనుండి కాంతిని బయటకు రానీడు. పావురాల్ని పట్టడం చీకట్లోనే జరిగిపోవాలి.

అందరూ పైకి వెళ్ళారు. నిచ్చెన పడుకోబెట్టబడి వుంది.

"మెల్లగా ఎత్తండి" అన్నాడు నరసింగరావు.

అందరూ కలిసి కష్టంమీద లేపి ఖాళీ ప్రదేశంలో నిలబెట్టారు.

"ముందు నేను పైకి వెళ్తాను. గార్డ్ నువ్వు ఆఖరకు రా. మధ్యలో శేఖర్‌ని పంపండి" అన్నాడు.

ముందుగా నరసింగరావు పైకి వెళ్ళాడు. బ్యాటరీ లైటు కాంతిలో అందరూ పైకి వెళ్ళారు. శేఖర్ గుండెలు టక్కు టక్కు మంటున్నాయి. ఆ ప్రాంతమంతా కటిక చీకటి. క్రిందనుండి ఎదిగివచ్చిన వృక్షం తాలూకు కొమ్మలు గాలికి ఊగుతున్నాయి.

ఎప్పుడో ఓసారి పగలు పైకొచ్చాడు శేఖర్. పైన అంతా నల్లగా వుంది. గోడలనిండా నాచు పట్టివుంది. నరసింగరావు అనుభవం వున్న వ్యక్తిలా ముందుకు వెళ్ళి గూట్లో చెయ్యిపెట్టి పావురాల్ని తీస్తున్నాడు. ఓ జత దొరికింది. మరో జత పావురాలు చీకట్లోనే రెక్కలు కొట్టుకుంటూ యెగిరిపోయాయి.

కీచుమంటూ అరుస్తూ గదిలో యెగురుతున్నాయి.

వాటి రెక్కల చప్పుడు వింటుంటే భయం కలుగుతూంది శేఖర్‌కు. గార్డ్‌ని గట్టిగా పట్టుకున్నాడు. అక్కడినుండి మరో గదిలోకి వెళ్ళారు. ఇంకో జత దొరికాయి.

శేఖర్‌కు వున్నట్టుండి మనసులోకి ఓ వెర్రి ఆలోచన వచ్చింది.

"ఇప్పుడు.... ఇప్పుడెవరన్నా ఆ నిచ్చెన తీసేస్తే."

ఆ ఆలోచన రావటంతో శరీరం జలదరించింది. ఎటూ చూడాలనిపించటంలేదు. ఎటు చూసినా చీకటి,

భయం.... భయం. నరసింగరావు పెుుత్తంమీద మూడు జరల్ని పట్టుకోగలిగాడు.

"ఇక పోదాం" అన్నాడు.

శేఖర్ కిందుకో వెన్నులో వణుకు.

ఏ క్షణం దెయ్యం దాడిచేస్తుందో!

అందరూ నిచ్చెన దగ్గరకు నడుస్తున్నారు.

ఇంక ఆపుకోలేక "నిచ్చెన వుంటుందా" అనడిగాడు.

"వుండక యేమవుతుంది" అన్నాడు గౌడ్.

"ఏంలేదు. ఊరికే అడిగాను" అన్నాడు.

శేఖర్ కు నిచ్చెన కనపడగానే గుండె దడ తగ్గింది. ముందు నరసింగరావు దిగాడు. అందరూ దిగాక దాన్ని పడుకో బెట్టారు. మెల్లగా మెట్లు దిగి వెళ్ళిపోయారు.

క్రిందకు వెళ్ళాక వెనక్కి తిరిగి చూశాడు నరసింగరావు.

"ఏం శేఖర్ దయ్యాలున్నాయంటావా?" అన్నాడు.

"ఏమో మనందరం వెళ్ళాం కదా."

"అలాగా నన్నొక్కడినే పైకి వెళ్ళి రమ్మంటావా?"

"వెళ్ళగలవా?"

"ఛాలెంజ్. ఎవరైనా పందెం కడితే."

"నువ్వు వెళ్ళావో లేదో మాకెలా తెలుస్తుంది?"

"మేడమీద గంట వుంది కదా. అది మ్రోగిస్తాను. చాలా?" అన్నాడు.

కొంచెంసేపు నిశ్శబ్దం చోటుచేసుకుంది.

"నీ దగ్గర మంత్రాలున్నాయా?" అన్నాడు శేఖర్.

"కాదు ధైర్యం వుంది."

"మనం వెళ్దాం" అన్నాడు శేఖర్.

# 4

ఎన్.సి.సి. కృష్ణ హెడ్‌మాస్టార్ని కలిశాడు. అతను ఒక్కో విషయం చెబుతుంటే దిగ్భ్రాంతితో వింటుండి పోయాడు హెచ్.ఎమ్.

ముగించి ఆయనకేసి చూశాడు కృష్ణ.

కొంచెం సేపటికిగాని ఆయన తేరుకోలేదు.

"హారిబుల్" అన్నాడు ఆ తర్వాత కంపించిపోతూ.

"పిటీ యేమిటంటే మనవైపునుండి యే రెస్పాన్స్ లేదు."

"యూ మీన్."

"ఈ విషయం వారు చెప్పేంతవరకూ మన స్పృహలో లేదు. ఇది ఖచ్చితంగా మన అసమర్థత."

హెచ్.ఎమ్. బెల్ నొక్కాడు.

"అయ్య" అంటూ అటెండర్ వచ్చాడు.

"రాధాకృష్ణ మాస్టారుని పిలుచుకురా."

"చిత్తం."

రాధాకృష్ణ సైన్స్ టీచర్.

లోనికి ప్రవేశించాడాయన పదినిమిషాలయ్యాక.

"బీ సీటెడ్" అన్నాడు హెచ్.ఎమ్.

కూర్చున్నాడాయన.

"విత్ ఇన్ టూ డేస్ ఐ వాంట్ యువర్ ఎక్స్‌ప్లనేషన్."

రాధాకృష్ణ ముఖం మాడిపోయింది.

"ఏ విషయంలో సార్."

"మొత్తంగా మీ లాబరేటరీ విషయంలో పూర్తి ఇన్ఫర్మేషన్ వెంటనే నాకు సబ్‌మిట్ చెయ్యండి" అన్నాడు.

"యస్ సర్" అన్నాడాయన లేస్తూ.

అతనికిదంతా అయోమయంగా వుంది.

హెచ్.ఎమ్. తన సీట్లో కూర్చోలేకపోతున్నాడు.

"ఈ దేశం యేమైపోతుందంటావ్ కృష్ణా" అన్నాడు తల పట్టుకుంటూ.

కృష్ణ జవాబుగా ఓ చిరునవ్వు నవ్వి "వస్తాను సార్" అన్నాడు.

"ఎనీ హౌ కంగ్రాచ్యులేషన్స్. యు హావ్ డన్ ఎ గుడ్ జాబ్. మొత్తం రిపోర్ట్ అందాక ఏం చేయాలో నిర్ణయించుదాం."

"అలాగే సర్."

కృష్ణ తన గది దగ్గరకు నడిచాడు.

రాధాకృష్ణ వచ్చి కలిశాడు. "ఏంటయ్యా గొడవ" అన్నాడు.

"ఏమైనా అవుతుంది. మీరంతజాగ్రత్తగా వుంటున్నారు."

"చంపక విషయం చెప్పు."

కృష్ణ చెప్పటం ప్రారంభించాడు.

రాధాకృష్ణ నోరు తెరిచి వింటుండిపోయాడు.

కృష్ణ చెప్పటం పూర్తికాగానే రాధాకృష్ణ ఇంకేం మాట్లాడకుండా లేచి పరిగెత్తాడు.

వారం రోజులు గడిచాయి.

ఆ రోజు ఫ్రేయర్ జరుగుతూంది.

మధ్యలో మాధవరావు మాస్టారు వచ్చాడు.

"చిన్న ఎనౌన్స్‌మెంట్" అంటూ ఓ కాగితంతీశాడు.

"నరసింగరావు, శేఖర్, శామ్యూల్, రవీంద్ర, శ్రీరామచంద్రమూర్తి, గౌడ్, రాము — వీరందరూ

ఒక్క సారి బయటకు రావాలి."

అందరూ ఒకరినొకరు చూసుకుంటూ బయటకొచ్చారు.

"అందరూ వరసగా నిలబడండి" అన్నాడు.

వరసగా నిలబడ్డారు.

ఇప్పుడు మొత్తం విద్యార్థులందరికీ అభిముఖంగా వారున్నారు.

"డియర్ స్టూడెంట్స్ ఇప్పుడు మీ ఎదురుగా నిలబడ్డ వీరంతా మన లాబరేటరీ తాళాలు పగలగొట్టి అందులోని వస్తువుల్ని దొంగతనంగా తీసుకెళ్ళారు. అందుకని వీళ్ళందరూ ఈరోజు నుండి సస్పెండ్ అవుతున్నారు. వీళ్ళని మీ అందరూ పరిశీలించాలని మీముందు నిలబెట్టాం."

కాలి క్రింద భూమి తొలుచుకు పోతుందా అనిపిస్తూంది.

అందరూ తలలు వంచుకున్నారు.

మొత్తం పెరేడ్‌లో పిన్ డ్రాప్ సైలెన్స్.

ఎలా? ఎప్పుడు? ఏ విధంగా జరిగింది?

జవాబు లేని ప్రశ్నలు!

"పదండి బాబూ కాయితాలు తీసుకుందురుగాని" అన్నాడు మాధవరావు మాస్టారు.

శేఖర్ కు తను చేసిన తప్పేమిటో అప్పుడుగాని అర్థం కాలేదు.

అందరూ వెళ్ళి సంతకాలు చేసి కాయితాలు అందుకున్నారు.

రాము, శ్రీరామచంద్రమూర్తి భోరున యేడ్చేశారు. ఇంటిదగ్గర జరగబోయే గొడవకంటే విద్యార్థులందరి ముందు తమకు జరిగిన అవమానానికే వారు కదిలిపోయారు

మిగతావారు మాత్రం ఒకందుకు సంతోషించారు.

'ఆ కాగితాలు నేరుగా తమకే అందించారు.'

కానీ వారికి తెలియని విషయం ఒకటుంది.

“అవి అంతకుముందే పోస్టుకాడ్డాయి.”

## 5

అందరూ సమావేశమయ్యారు.

“ఇప్పుడేమిటిరా చెయ్యటం” అన్నాడు గౌడ్.

అంతా నరసింగారావుకేసి చూశారు.

“అసలిదంతా శామ్యూల్ గాడు చేశాడు. ఆ కుంభాకారకటకం స్కూలుకు తేకపోతే ఇంతవరకూ వచ్చేది కాదు” అన్నాడు నరసింగరావు.

“తెచ్చి ఊరుకున్నాడా! ఆ శేఖర్ గాడూ వీడూ కలిసి జనాన్ని కూర్చోబెట్టి ప్రదర్శన మొదలు పెట్టారు. ఈలోపు ఆ కృష్ణగాడు చూడనే చూశాడు.”

“వాడికెలా కనపడిందిరా?”

“ఏమో! మామూలు కళ్ళే అవి!”

“అయినా మీకీ వెధవపని చేసి వుండకపోతే ఈ విషయమే యెవరికీ తెలిసివుండేదికాదు.”

“నేను మా బాబాయి ఇచ్చాడని చెప్పారా” అన్నాడు శామ్యూల్.

“అవునోయ్ మీ బాబాయికి కుంభాకార కటకంతో ఏం పని. పైగా మిలిట్రీలో పనిచేసి వచ్చాడటావ్” అన్నాడు నరసింగరావు.

“ఏడ్చావులే. అసలు దీనికి మూలకారణం నువ్వు. తమ నాయకత్వంలోనేగా మేమంతా వెధవ పనులు చేస్తుంది” అరిచాడు శామ్యూల్.

అంతా నిశ్శబ్దం!

ఎవరూ మాట్లాడలేదు.

వారికి ఈ దొంగతనం యే విధంగా జరిగిందో గుర్తుకొచ్చింది.

ఆ రోజు....

అందరూ గ్రౌండ్లో సమావేశమయ్యారు.

మూడు నెలల పరీక్షలు అయిపోయాయి. సెలవులిచ్చారు.

ఉదయం ఒకరిద్దరు క్లర్కులు రావటంమించి స్కూలంతా బోసిపోయినట్లు వుంటుంది. హైస్కూలుకు చెందిన ప్రధాన భవనంతోపాటు ఇటీవల కాలంలో వేరే మరో భవనం నిర్మించారు. అది ప్రత్యేకంగా సైన్స్ తరగతులకు కేటాయించారు. అందులోనే ఓ గది లేబరేటరీకి కేటాయించారు.

విచారించవలసిన విషయం యేమిటంటే పదో తరగతి వారికి మాత్రం యెప్పుడైనా కొన్ని ప్రయోగాలు చేసే అవకాశం వుంటుంది. అంతకుమించి వాటిని యెప్పుడూ ఉపయోగించరు.

ఆ భవనం ముంగిలిలో అప్పుడప్పుడు యెవరెవరో చేరి బీభత్సం చేస్తుంటారు. లాబరేటరీ గదికి యెప్పుడూ ఓ తాళంకప్ప వ్రేలాడుతుంటుంది.

నరసింగరావు ఓసారి తాళంకప్పను పరిశీలించాడు.

వెంటనే పిన్నీసుతో ఆపరేట్ చేశాడు.

వెంటనే "క్లిక్"మంటూ తెరుచుకుంది.

అదీ లాబరేటరీ పరిస్థితి.

తిరిగి తాళం వేశాడు నరసింగరావు. తిరిగివస్తుండగా ఓ ఐడియా వచ్చింది.

"ఓరేయి, మన లాబరేటరీ ఎంత దరిద్రంగా వుందను

వున్నావు. మొన్నో రోజు నేను లాగితే వచ్చేసింది" అన్నాడు నరసింగరావు.

"నిజంగానా?"

"పట్టిచెత్త తాళంకప్ప వేశారు" అంటూ "ఈ రోజు మనం లాబరేటరీలోకి వెళ్తున్నాం" అన్నాడు.

"అమ్మో ఎవరైనా చూస్తే ఇంకేమైనా వుందా?" అన్నాడు శ్రీరామచంద్రమూర్తి.

"ఈ రోజు రాత్రికి వెళ్దాం. యెవరూ చూడరు."

"రాత్రిపూట యెవరైనా అక్కడ పడుకుంటున్నారేమో?"

"ఎవరూ పడుకోవటంలేదు. నేనన్నీ గమనించాను గదా" అన్నాడు నరసింగరావు.

"వెళ్ళి ఏంచేద్దామనుకుంటావు?" అన్నాడు రాము.

"నీకు యేం కావాలంటే అది తీసుకో. నాకేం కావాలంటే అది తెచ్చుకుంటాను."

"దొంగతనమా?" అన్నాడు రాము.

"భలే చెప్పావే. కొబ్బరికాయలు తాగటాన్ని యేమంటారు?" అన్నాడు నరసింగరావు.

అందరూ నవ్వారు.

"ఏమోరా నాకయితే లాబరేటరీ చూడాలని చాలా కాలంగా వుంది" అన్నాడు శ్రీరామచంద్రమూర్తి.

"నిజమేరా. ఆ కోరిక యెప్పుడు తీరుతుందోననుకునే వాడిని. ఒక్కసారి మాత్రం అస్థిపంజరాన్ని చూశాను. సినిమాల్లో పెద్ద పెద్ద గాజు సీసాలూ, ద్రవాలూ చూపిస్తారు. అవన్నీ మన లాబరేటరీలో వుంటాయా? నరసింగరావుగాడి పుణ్యమా అంటూ అన్నీ చూడాలి"

అన్నాడు శేఖర్.

రాత్రి చీకటి పడింది.

నరసింగరావు ముందు నడిచాడు.

అందరూ అనుసరిస్తూ లేబరేటరీముందు కెళ్ళారు.

తాళం క్లిక్ మంటూ తెరుచుకుంది.

నరసింగరావు శబ్దం కాకుండా తలుపు గడియతీశాడు.

అందరూ లోనికెళ్ళారు.

నరసింగరావు చేతిలో బ్యాటరీలైటు యెదురుగా పడింది.

"అమ్మో" అరిచాడు శేఖర్.

అంతా ఒక్కసారిగా ఉలిక్కిపడ్డారు.

"ఛత్ వెధవా" అరిచాడు నరసింగరావు.

లైటు వెలుగులో అస్థిపంజరం తల మెరుస్తూంది!

క్రమంగా క్రిందకు దిగింది. గుంట కళ్ళు, ఎముకల గూడు, వ్రేలాడిన చేతి, మరియు కాలి యెముకలు!

"అది స్కెలిటన్. సడన్ గా చూసేటప్పటికి భయం కలిగింది. ఇంకెప్పుడూ ఏది చూసినా అరవకు" అన్నాడు నరసింగరావు.

అందరూ కొంచెం తేరుకొన్నారు. కాంతి గది నలు మూలలకు ప్రసరిస్తోంది పరీక్షనాళికలు, పెద్దసీసాలు, ఏసిడ్స్, కుంభాకార కటకాలు, కొన్ని పగిలిపోయి, ఇంకా యేవేవో గాజువస్తువులున్నాయి. ఆ చీకట్లో వారి కళ్ళలో ఓ వింత ఆనందం మెరిసింది.

ఇంకా ముందుకెళ్ళాడు నరసింగరావు. జేబులోనుండి మడత పెట్టిన సంచి తీశాడు. తనకు కావలసింది ఒక్కొక్కటి సంచిలోకి సర్దుకోవటం ప్రారంభించాడు.

"ఏంటిరా?" అన్నాడు శామ్యూల్.

"ఇది శంభాశారకటకం. బాగుంటుంది తీసుకో" అందించాడు.

"ఎవరికేం కావాలో అవి తీసుకోండి" అన్నాడు నరసింగరావు.

"మా ఇంట్లో ఇవన్నీ చూస్తే చంపేస్తారు" అన్నాడు రాము.

"అయితే యేం తీసుకుంటావు?"

"ఏమీ వద్దులేరా!"

"వట్టి చేతుల్తో యెలారా పోవటం."

రాము దృష్టి రంగు రంగుల చాక్ పీసులమీదపడింది.

"నేను నాలుగు చాక్ పీసులు తీసుకుంటాలే."

"నీ ఇష్టం ఈ లాబరేటరీ నీది" అన్నాడు నరసింగరావు.

అందరూ నవ్వుకున్నారు.

దాదాపు రెండుగంటలు లాబరేటరీలో వున్నారు. ప్రతి అంగుళం తడివిచూశారు. వారి జీవితంలో అలాంటి తృప్తి యెప్పుడూ పొందవు డరు.

ఒక్క నరసింగరావు మాత్రమే యెక్కువగా సర్దుకున్నాడు.

మిగతావారు చిన్న చిన్న వస్తువులు తీసుకున్నారు. వారితో పాటు శాస్త్రి మాష్టారబ్బాయి వున్నాడు! శాస్త్రిగారు సీనియర్ టీచర్!

అతను అప్పటికే సిగరెట్లు కాలవటంలోనూ, ఈతలు కొట్టడంలోనూ మంచి నిపుణుడయ్యాడు. ఈ నడుమ ఇంట్లో డబ్బులు యెవరుతీస్తున్నారో ఓ నిర్ణయానికి రాలేక పోతూంది వాళ్ళమ్మగారు.

అందరూ బయటపడ వచ్చారు.

తిరిగి తాళం వేశాడు నరసింగరావు.

"ఈ విషయం యెవరికీ చెప్పకూడదు."

"చెప్పం."

"ఒట్టేయండి."

అందరూ నరసింగరావు చేతిలో చెయ్యేసి "ఒట్టు" అన్నారు.

సెలవులయిపోయి బడి మొదలయింది. రెండు నెలలు కావస్తున్నా ఈ విషయం యెవరికీ తెలీదు!

"అది కాదురా మన పేర్లన్నీ చదివాడు బాగానే వుంది. తాళం పగలగొట్టామంటారేమిటి?" అన్నాడు.

"అచ్చుతిప్పులేరా" అన్నాడు శామ్యూల్.

"అది సరే. శాస్త్రి గారి గురించి మీరాలోచించటం లేదు. ఆ రోజు మనతో వాడూ వున్నాడు."

"అవును రోయ్" అన్నాడు నరసింగరావు.

"దొంగతనం వద్దురా అన్నాను, విన్నారా?" అన్నాడు రాము.

"పిచ్చివాడా! దొంగతనం నేరం కాదురా. శాస్త్రి గారబ్బాయిగా పుట్టకపోవటం నేరం. వాడు మాత్రం మనతో రాలేదంటావా?"

వాడి పేరు మరిచిపోయారేమో."

"ఎలా మరిచిపోతారు" అంటూ ఆగిపోయాడు నరసింగరావు.

అతని మెదడులో యేదో ఆలోచన తళుక్కుమంది.

"అవునూ. మనం ఈ విషయం యెవరికీ చెప్పనని ప్రమాణం చేశాంకదా. మనలో ఎవరో ఒకరు చెప్పందే అందరి పేర్లూ ఎలా తెలుస్తాయి? మర్యాదగా వాడెవడో చెబితే బాగుంటుంది. ఒట్టు వేశాక వాడి జీవితమే నాశన

మవుతుంది" అన్నాడు నరసింగరావు.

శేఖర్ కు సాటి మిత్రులంటే బహు ప్రాణం.

"నేనే చెప్పారా. ఎవరికీ చెప్పనన్నాడు" అన్నాడు శేఖర్.

"ఛీయ్. కొడుకా ఇదంతా నీ పనా? మరాడి పేరెందుకు చెప్పాలా? మర్చిపోయావా?"

"లేదురా చెప్పాను."

"రాజకీయమన్న మాట. అయినా నిన్ను యెవడు చెప్పమన్నాడు."

"ఆ హిందీ మాస్టారూ...."

"ఛీ.... వెధవా....నీ సంగతి సుబ్బిగాడికి చెబుతా నుండు" అన్నాడు నరసింగరావు.

"సుబ్బిగాడెవడురా" అన్నాడు శామ్యూల్.

"అదురా కిరాణాకొట్టు సుబ్బిగాడు. ఈనాకొడుకేం చేశాడో తెలుసా? నేనూ వీడూ ఆ కొట్టుకెళ్ళాం. బాగా రష్‌గా వుంది. అయిదు కిలోల మంచినూనె పొయ్యమని డబ్బాయిచ్చాం. వాడు పోసి ప్రక్కన పెట్టాడు. అది నాకందించాడు. కొంచెంసేపయ్యాక తెల్లం పెట్టి చుకొని వచ్చేశాడు. ఇప్పుడా సుబ్బయ్యకు చెబితే ఆరు కిలోల నూనె పిండేస్తాడు" అన్నాడు నరసింగరావు.

"ఛీ.. ఛీ....ఛీ....ఒక్క మంచి పనిలేదు కదా" అన్నాడు రాము.

అందరూ నవ్వుకున్నారు.

"మా నాన్న చంపేస్తాడురా" ఏడ్చాడు శ్రీరామచంద్రమూర్తి.

అందరికీ జాలి వేసింది.

"ఏడవకురా. ఇంటి దగ్గర తిడితే తిట్టారు. పోనీ కొట్టనీ మీ నాన్న వాళ్ళని తీసుకరావడం చేత రేపు పబ్లిక్ పరీక్షల్లో కూర్చోకుండా చేస్తాడు" అన్నాడు నరసింగ రావు.

శ్రీరామచంద్రమూర్తి వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు!

# 6

"శాంతమ్మగారూ మీకో లెటర్" అందించాడు పోస్టుమాన్.

శాంతమ్మగారు శేఖర్ తల్లి.

ఆమె కవర్ వంక ఆశ్చర్యంగా చూసింది. వారి కప్పుడూ కార్డులూ, ఇన్‌లాండ్ కవర్లూ తప్ప, ఎన్వలప్స్ రావు.

ఆమె కవర్ చించింది. అందులో ఇంగ్లీష్‌లో టైపు చెయ్యబడ్డ కాయితం వుంది. అది చూడగానే ఆమెకు సంతోషం కలిగింది. తన కుమారుడికి చెందిన విశేషం యేదో అయి ఉంటుందనుకొని గర్వంగా ప్రక్కింటి కెళ్ళింది. ఆమె ఎయిడెడ్ స్కూల్లో టీచర్‌గా పని చేస్తూంది.

"ఈ ఉత్తరం కొంచెం చదివి పెట్టమ్మా" అంది.

ఆమె అందుకొని చదివింది.

"ఏం రాశారు? ఎవరు రాశారు?"

ఆమె కొంచెం ఇబ్బందిగా చూసింది.

"ఏంటమ్మాయ్" అంది అనుమానంగా.

"మీ అబ్బాయిని సస్పెండ్ చేశారు,"

"అంటే"

"బడికి రాకదన్నారు."

"ఎందుకని?"

"మీ అబ్బాయి మరి కొంతమంది కలిసి లాబరేటరీలో

దొంగతనం చేశారంట."

చెళ్ళున చరిచినట్లయింది.

అవమానంతో కొంచెంసేపు అలానే నిలబడిపోయింది.

అంతలోనే కళ్ళవెంట నీళ్ళు వచ్చాయి.

"వాడికి యేం తక్కువ చేశామని ఇలాంటి వెధవ పనులు" ఏడుస్తూ అంది.

అంత మనిషి యేడుస్తుంటే టీచర్ కు ఏం చేయాలో అర్థంకాలేదు.

"ఊరుకోండి శాంతమ్మగారూ" అనునయించింది. "నలుగురు పిల్లాళ్ళు కలిస్తే కొంటె పనులు చేస్తుంటారు."

"దొంగతనం కొంటెపనేంటమ్మా ఈడికీ బుద్ధులు యెక్కడనుండి వచ్చాయి. అసలింక బడికి రానీరా."

"రానిస్తారు. రేపు మీటింగు పెట్టారు. బాబాయిగా వెళ్ళాలి" అంది కాయితం అందిస్తూ.

ఆమె కొంగుతో కళ్ళు తుడుచుకుని కాయితం తీసుకుని ఇంట్లోకెళ్ళింది. ఆమెకు బాధతో యే పనీ చేయాలనిపించటంలేదు. ఈ ఉత్తరంలో అలాంటి విషయం వుంటుందనుకుంటే అసలు చూపించకపోను. ఇప్పుడు ఊరంతా తెలిసిపోతుంది. అందరూ 'ఫలానావారబ్బాయ్'ని వేలెత్తి చూపిస్తారు. ఆ విషయం తలుచుకుంటేనే సిగ్గువేస్తోంది. ఆమె ఇంక బయటకికూడా వెళ్ళలేదు.

శేఖర్ వచ్చాడు.

"అమ్మా అన్నం" అన్నాడు రాగానే.

"రా బాబు" అంది.

అమాంతం పీటవాల్చుకుని కూర్చున్నాడు.

"కాంచెం కాళ్ళూ చేతులన్నా కడుక్కోకూడదా."

"ఆకలి, చేతులు కడుక్కుంటాలే" అంటూ గ్లాసులో నీళ్ళు చేతిలో పోసుకున్నాడు.

శాంతమ్మగారు అన్నం వడ్డించింది. తృప్తిగా తినటం ఆరంభించాడు. గడ్డ పెరుగులో ఆవకాయ పచ్చడి కలిపి తిన్నాక నెయ్యి కడిగాడు. అప్పుడడిగింది శాంతమ్మగారు.

"ఏంటి నీకీ మధ్య ఆకలి పెరిగిపోయింది."

"ఆకలిగా వుందే" అన్నాడు నవ్వుతూ.

"మరి దొంగతనంగా దోచుకొస్తున్న డబ్బంతా ఏం చేస్తున్నారు?"

"దోచుకోవటం యేమిటి?" అన్నాడు శేఖర్.

కాయితం విసురుగా మొఖానికి తగిలింది.

"ఎందుకురా మా కడుపున చెడబుట్టావ్. మా ఇంటా వంటా లేవు ఇలాంటి పాడు బుద్ధులు. ఏం నీకు తక్కువైందని. మేం యేమివ్వటంలేదు. ఎప్పుడూ పుస్తకాలనీ, ఫీజులనీ, నీ బాందనీ పగలూ రాత్రిలూ తీసుకుపోతూనే వున్నావు. అవన్నీ నీ యెదాన కొట్టుకుంటుంది చాలక దేశంమీదకి బరితెగించావ్. దొంగతనం మొదలు పెట్టావ్. రేపు కొంపలకు కన్నాలేస్తావు. ఎందుకురా పుట్టావు. నీ బతుకు చెడ .... తూ ... నాలుగుకంచాలు తినమంటే తింటావ్ ....ఛీ....నీ ముఖం నాకు చూపించకు" శాంతమ్మగారికి ఆయాసంవచ్చి నేలమీద కూర్చుండిపోయింది.

అప్పుడే లోపలకు వచ్చాడు శేఖర్ తండ్రి.

"ఏంటే గొడవ" అన్నాను.

"అదే అడుగు" అందామె.

"ఏంటిరా?"

శేఖర్ మాట్లాడలేదు.

"ఏంటి మాట్లాడవు" గద్దించాడు.

"ఆదేం మాట్లాడతాడు. దొంగతనాలు చేస్తే బడి నుంచి పంపేసారు" అంది శాంతమ్మగారు.

క్షణంలో ఆయన కళ్ళు ఎరుపుగా మారాయి.

"ఛెళ్"మన్న ధ్వని వినపడింది.

శేఖర్ గజం దూరంలో పడ్డాడు.

చెంప బుసబుస పొంగింది.

అదే సమయంలో....

లీడర్ హనుమంతరావుగారు తన కొడుకు శ్రీరామచంద్రమూర్తికేసి రౌద్రంగా చూస్తున్నాడు.

శ్రీరామచంద్రమూర్తి యేడుస్తూ వెలుతున్నాడు.

రాము యేడుస్తూనే బెల్టు దెబ్బల్ని చూసుకుంటున్నాడు.

"చావు. స్కూలు మానేసి గొడ్లు కాసుకో. రేపు మీటింగుకి రాను. నీ దినానికీ రాను" అన్నాడు రాము నాన్న.

తలవంచుకున్న రాముతో "ఇంకేం చేశారు?" అన్నాడు.

రాము తలెత్తాడు.

"నాకేం తెలియదు, అందరితో పాటు నేనూ వెళ్ళాను. ఒక వస్తువు కూడా తేలేదు. అయినా నన్నూ సస్పెండ్ చేశారు" అన్నాడు నరసింగరావు వాళ్ళ నాన్నతో.

"కుంభాకార కటకం మా ఫ్రెండ్ దని చెప్పావు, ఇదా కథ" శామ్యూల్ నెత్తిన మొట్టాడు వాళ్ళ నాన్న.

మరుసటి రోజు సమావేశం మొదలయింది—

హెడ్ మాస్టారు ఆంజనేయప్రసాదుగారి రూంలో

అందరూ కూర్చున్నారు. ఆయన ఈ విషయంలో చాలా సీరియస్‌గా వున్నాడు. ఒక సందర్భంలో అయితే వాళ్ళని పరీక్ష రాయకుండా ఆపు చేయాలని భావించాడు.

ఈ విషయంలో కృష్ణగారు ఆయనకు నచ్చచెప్పాడు. ఈ కేసులో ప్రముఖుల పిల్లలున్నారు. ఆ తర్వాత అనేక రకాల గొడవలు రావొచ్చు. కాబట్టి పిల్లల తల్లిదండ్రుల నుండి స్పష్టమయిన హామీ పొందాక వారిని తిరిగి చేర్చుకోవచ్చంటూ సూచించాడు. ఆయనకు ఈ సలహా పూర్తిగా అంగీకారం కాకపోయినా, ఆవేశం తగ్గాక ఆలోచిస్తే అదికూడా సబబే అనిపించింది.

ఆయన గొంతు సవరించుకున్నాడు.

"ఈ సమావేశం ఎందుకు యేర్పాటుచేశామో మీ అందరికీ తెలుసు. కొంతమంది పిల్లలు కలిసి లాబరేటరి తాళాలు తీసి అందులో వస్తువులు తీసుకువెళ్ళటం జరిగింది. వారిలో కొంతమంది పిల్లల ప్రవర్తన చాలా అభ్యంతరకరంగా వుంది. స్కూల్ ఎగ్గొట్టడం, టీచర్ల మీద కామెంట్లు చేయటం, పేర్లు పెట్టడం, క్లాసుల్లో అల్లరి చిల్లరి వ్యవహారాలు రకరకాలుగా వున్నాయి. మొత్తం స్కూలుకే ఈ దొంగతనం సిగ్గుచేటైన విషయం.

పిల్లల నేరంలో మన బాధ్యత కూడా వుంటుంది. పిల్లల్ని బడికి పంపించటంతోనే మీ బాధ్యత తీరిపోయిందని భావించకూడదు. చెక్ చేసుకోవాలి. ఎలా ప్రవర్తిస్తున్నాడు యెలా చదువుతున్నాడు అనేది చూసుకోకపోతే ఎలా? చదువుతున్న స్కూలులోనే దొంగతనానికి పూనుకున్నారంటే వాళ్ళెంత దారుణంగా తయారయ్యారో అర్థమవుతుంది. అంటే మీ కంట్రోల్ యేమాత్రంలేదు. మీ పిల్లలు యేం చేస్తున్నారో మీరు

గమనించకపోవటం యేమిటి చెప్పండి.

ఈ విషయంలో మనందరం సిగ్గుపడాలి. పోలీసు రిపోర్టు ఇవ్వవలసిన క్రైమ్ అయినా మేం ఆలోచించాం. మీతో సంప్రదింపులు జరిపాక ఓ నిర్ణయానికి రావాలనుకున్నాం. మీ పిల్లల కాండక్టు విషయంలో మీరంతా బాధ్యతవహిస్తూ భవిష్యత్‌లో ఇలాంటివి జరగవని హామీ ఇవ్వాలి" అన్నాడాయన.

ఆయన మాట్లాడుతున్నంత సేపూ తలవంచుకున్నారందరూ.

హనుమంతరావుగారి మొఖంలో రంగులు మారిపోయాయి.

ఆయన ఆవేశాన్ని ప్రయత్నంమీద కంట్రోల్ చేసుకున్నాడు.

ముందు ఆయనే మాట్లాడాడు.

"మా పిల్లలు చేసిన ఈ సిగ్గుమాలిన చర్యలకు మేం చాలా విచారపడుతున్నాం. ఈ చర్యను తీవ్రంగా ఖండిస్తున్నాం కూడా. అందుకు ప్రధాన బాధ్యత మామీదే వేసుకుంటున్నాం. ఈ దొంగతనం యెప్పుడు జరిగింది?"

"శెలవుల్లో" అన్నాడు హెచ్.ఎమ్.

"మూడు నెలల పరీక్షల శెలవులకా?"

"అవును."

"మరి ఎలా తెలిసిందండి."

"వాళ్ళలో ఓ కుర్రాడు చెప్పాడు."

"చెప్పేదాక మీరు గుర్తించలేదన్నమాట."

"అఫ్‌కోర్స్" అన్నాడాయన.

అప్పటికిగాని తనను లాయర్ గారు క్రాస్ ఎగ్జామ్

చేస్తున్నాడనే విషయం ఆయనకు లీలగా స్ఫురించలేదు.

"మీ వాచ్ మన్ లేడా సార్."

"ఉంటాడు. మొత్తం రెండు బిల్డింగ్స్‌కు ఒక్కడే కదా?"

"దొంగతనం ఎలా జరిగింది. తాళం బ్రద్దలు కొట్టారా?"

"లేదు. తెరిచారు."

హనుమంతిరావుగారు ఊపిరి పీల్చి వదిలాడు.

"ముందుగా నేను స్పష్టం చేయాల్సిందేమిటంటే మా పిల్లల తప్పులు నేను సమర్థించలేదు. ఇక్కడ నేరం జరిగింది. అందరూ అంగీకరించాల్సిందే. మేం మా పిల్లల్ని బడికి, ట్యూషన్‌లకు పంపించి వదిలేశాం. వాటిమీద అజమాయిషీ లేదు. మేం ఆ ట్యూషన్ టీచర్ని విశ్వసించాం. అది వేరే విషయం. ఇక్కడ నేరం ఎందుకు జరిగింది, ఏ పరిస్థితుల్లో జరిగింది ఆ మొత్తం చిత్రం మనం చూడందే ఈ పిల్లల్ని అర్థం చేసుకోవటం, మంచి మార్గంలో పెట్టడం కష్టం.

నేరం జరిగిన మూడు నెలలుదాకా మీ టీచర్లకూ, ఉద్యోగులకూ తెలీదు. ఆ విషయాన్ని ఓ కుర్రాడు చెప్పిం తర్వాత మీరు రంగంలోకి దిగారు. అంటే మీ లాబరేటరీ వ్యవహారాలు ఏవిధమైన స్టేజిలో వున్నాయో ఊహించవచ్చు. ఆ కుర్రాడు మీకు ఈ విషయం తెలిపిన వారం రోజులదాకా మీకు పూర్తి సమాచారం అందలేదు.

అంటే బహుశా లాబరేటరీ ప్రారంభమయిన తర్వాత మొట్టమొదటిసారిగా రిపోర్ట్ తయారుచేసి వుంటారు. యే వస్తువులుండాలో, యేవి పోయాయో మీకు తెలియ

టానికి వారం రోజులు పట్టింది. ఇంత విచారకరమైన పరిస్థితుల్లో వున్న లాబరేటరీ నిర్వహిస్తున్న వారిమీద చర్య తీసుకోవటం మీ ఇంటర్నల్ వ్యవహారమైనా ఏ చర్య తీసుకున్నారని నేను ప్రశ్నిస్తున్నాను?

ఇంక రెండో విషయం. లాబరేటరీకి మీరు వేసిన తాళం అది పిన్నీసుతో తీస్తే వస్తుంది. లక్షరూపాయల భవనానికి, వేలాది రూపాయల లాబరేటరీకి మీరు వేసిన తాళంకప్ప పరిస్థితి అది. పైగా యేనాడూ కాపలా వాడుండడు. అలాంటప్పుడు వీళ్ళుకాకున్నా మరొక రయినా దొంగతనం చెయ్యటానికి అవకాశం వుంటుంది. అలాంటి అవకాశం మీరు కలిగించారు. మీ దగ్గర మంచి తాళంకప్ప కొనటానికి నిధులు లేవా అని నేనడుగు తున్నాను మీరు నైట్ వాచ్‌మన్‌ను వాచ్ చేస్తు న్నారా. అనేది రెండో ప్రశ్న?

మీకింకా తెలియదేమో అర్ధరాత్రి ఈ పిల్లలే మేడ మీదకెళ్ళి పావురాల్ని పైతం పట్టుకున్నారు. అంటే ఈ స్కూల్ వ్యవహారాలు యెంత హాస్యాస్పదంగా ఉన్నాయో వేరే చెప్పాల్సిన అవసరంలేదు. మీరు ఒక్క ముక్కలో వారందరినీ సస్పెండ్ చేశారు. కానీ యెందుకలా జరిగిందో ఆలోచించటానికి, వారినుండి తెలుసుకోవటానికి ప్రయత్నం చెయ్యలేదు.

నేను తెలుసుకున్నదేమిటంటే ఆ లాబరేటరీ పట్ల పిల్లలకు గొప్ప ఆకర్షణ వుంది. వారెప్పుడూ ఆ పరి కరాల్ని దగ్గరనుండి చూడలేదు. వారికి ఆ గదిలో ఓ గంట గడపటం గొప్ప అనుభూతి. ఈ నేరం జరగ టంలో ఒకరిద్దరికి నిజంగానే దొంగతనం చేయాలనే మోటివ్ ఉండివుండొచ్చు. కానీ యెక్కువమందికి ఆ

స్కెలిటన్స్, బీకర్లు, గాజుగొట్టాలు దగ్గర్నుండి చూడా లనే ఆరాటం. అంటే యే ప్రయోజనాలకోసం జనం డబ్బుతో ఈ లాబరేటరీ నిర్మించుకున్నామో అవి నెర వేరటంలేదని తెలుస్తూంది.

నా సన్ కేవలం నాలుగు చాక్ పీసులు తెచ్చాడు. అవి అలానే వున్నాయి. అయినా అది నేరమే. ఋజా యించాల్సిన పనిలేదు. అంతకంటే నేరం ఈ లాబరేటరీని 'అందని పండు'గా మార్చటం. ఇంకో గమ్మత్తు అంశం వుంది. మొత్తం ఈ నేరంలో వున్నవారందరూ ఇందులో ఇరికించబడలేదు. ఓ మాస్టారి బిడ్డని బయటకు లాగారు. ఎందుకని? ఆశ్రిత పక్షపాతం మీకుండవచ్చా?"

"నో .... నో .... అలాంటిదేంలేదు" అన్నాడు హెచ్.ఎమ్.

"ఐ నో యువ్వరిథింగ్ సర్. అది అప్రస్తుతం. ఇక్కడో నేరం జరిగింది. దానికిచెంది మనం చర్చించాలి. మీరు మామీద, మేం మీ మీద నేరాలు మోపుకుంటే ప్రయోజనంలేదు. ఇందులో రెండువైపులా అవకాశా లున్నాయి. అవి గురించమనే నేను కోరేది" అన్నా డాయన.

ఆంజనేయప్రసాద్ గార్కి వాస్తవం నిలదీస్తుంది. హనుమంతరావుగారు చెప్పినవన్నీ వాస్తవాలే. లాబ రేటరీలో యేం జరుగుతుందని తనీనాడు అడుగుతున్నాడు తప్పించి పీరియాడికల్ రిపోర్టు తెప్పించటంలేదు. దొంగ తనం జరిగిందని వారు తెలియచేశారుగానీ లేకుంటే అదెలా జరిగిందో యిప్పటికీ అర్థమయ్యేదికాదేమో? అఖరుకు పగిలిపోయిన వస్తువుల జాబితాలోకి చేర్చబడేవి. లాబ రేటరీకి వేసిన అంత బలహీనమైన తాళంకప్ప కేవలం

తమ బలహీనతే!

"మీరు చెప్పిన విషయాలతో నేను ఏకీభవిస్తున్నాను. ప్రస్తుతం మనమేం చేయాలో సూచించండి."

"ఈ విషయంలో పిల్లలు మానసికంగా ఇప్పటికే గాయపడ్డారు. వారికి అవమానంకంటే వేరే శిక్ష అవసరం లేదు. వారిని తిరిగి క్లాసుల్లోకి చేర్చుకోండి. వారి ప్రవర్తనపట్ల మేం హామీ ఇస్తాం. ఇకముందు ఇలాంటివి జరిగితే యే సమావేశాలు లేకుండానే డిశార్జ్ చేసి పారేయ్యండి" అన్నాడు హనుమంతరావుగారు.

"ఆయన చెప్పేది కరెక్టే ఇది మొదటి వార్నింగ్ గా వదిలిపెట్టండి" అన్నాడు రాము తండ్రి.

"మొత్తంమీద ఈ విషయంలో మనందరి అభిప్రాయాలు కలవటం సంతోషించదగ్గది. మేం ఏం చర్యలు తీసుకొన్నామో ఇంటర్నల్ వ్యవహారం. మా లోపాలుకూడా ఈ సందర్భంలో తెలిసాయి. అలాగే లాబరేటరీ నిర్వహణ మెరుగవుతుందని హామీ ఇస్తున్నాను. రేపు జరగనున్న ప్రేయర్లో "క్షమాపణ" చెప్పటంద్వారా అందర్నీ తిరిగి చేర్చుకుంటాం. అలాగే పోయిన సామాన్ల లిస్టు వుంది. అందరూ తలా కొంత మొత్తం ఫైన్ చెల్లించాల్సి వుంటుంది" అన్నాడు హెచ్.ఎమ్.

"దానిదేముందిలెండి. ఆ ఫార్మాలిటీస్ మీ ఇష్టప్రకారం పూర్తిచేస్తాం" అన్నారంతా.

"పిల్లల మంచి భవిష్యత్ కోసం మనం శ్రద్ధ వహించుదాం" అన్నారాయన ముగింపుగా.

"తప్పకుండా. మరి మేం శెలవు తీసుకుంటాం."

# 7

ప్రేయర్ జరుగుతూంది.

మిత్రులంతా వరసగా నిలబడ్డారు.

"చిన్న ఎనౌన్స్‌మెంట్" అంటూ ముందుకొచ్చాడు మాధవరావు మాస్టారు.

"మన లాబరేటరీ తాళాలు తీసి అందులో ఏమేం తీసుకెళ్ళారో అవన్నీ అప్పగించారు. అంతేకాదు, తమ చర్య యెంత నీతి బాహ్యమైందో వారు గుర్తించి బాధ పడుతున్నారు. వారి వయసునూ పరిస్థితుల్నీ దృష్టిలో వుంచుకొని మొదటి తప్పుగా వీరిని క్షమించటం జరిగింది. మీ ముందు 'క్షమా పత్రం' చదవడంద్వారా వారు భవిష్యత్‌లో సైతం తమ నైతిక విలువల్ని కాపాడు కుంటారని ఆశిద్దాం" అంటూ ఇవతలకొచ్చాడు.

నరసింగరావు మొదట చదవటం మొదలుపెట్టాడు.

"నరసింగరావు అనబడే నేను పదో తరగతి చదువు తున్నాను. నేను మన లాబరేటరీ తాళాలుతీసి అందు లోని కొన్ని వస్తువులు తీసుకున్నాను. ఈ చర్యపట్ల నా తీవ్ర విచారం ప్రకటిస్తున్నాను. ఇక ముందెప్పుడూ మీ ముందు 'దోషి'గా నిలబడే పరిస్థితి తెచ్చుకోననీ, మీరు నను విశ్వసించాలని వేడుకుంటున్నాను. సుసంపన్న మైన, సువిశాలమైన నా దేశ వారసత్వాన్ని పొంద డానికి ఇకనుండి తీవ్రంగా కృషి చేస్తాను."

వరసగా అందరూ చదివేశారు.

"నేరం చేయటంకంటే అది అంగీకరించకపోవటం మరీ హీనమైంది. ఈ పిల్లలు తమ పనికి పశ్చాత్తాపం ప్రకటించారు. మీరంతా మీ స్థానాల్లోకి వెళ్ళిపోండి" అన్నాడు మాధవరావుగారు.

అందరూ తమ క్లాసుల్లోకి వెళ్ళిపోయారు. అందుతో పాటు బిగ్గరగా తామూ ప్రతిజ్ఞ చేస్తున్నారు.

ఆ సాయంకాలం వారి చివరి సమావేశం జరిగింది!

"నేను ట్యూషన్ మానేస్తున్నాను. ఇంటి దగ్గరికే యెవరో వచ్చి చెబుతారు. ఇంకెప్పుడూ మనం చేసిన పనులు చేయను" అన్నాడు శ్రీరామచంద్రమూర్తి.

"పదో తరగతి పరీక్షలు యెంతో దూరంలో లేవు. పూర్తికాలం మనం చదవాలి" అన్నాడు రాము.

"ఈరోజుతో మనమందరం కలిసే అవకాశాలు మృగ్యం అవుతున్నాయి. ఈ సంవత్సరంతో మనం యెక్కడెక్కడికో వెళ్ళిపోతున్నాం. అయితే మనం ఓ ప్రతిజ్ఞ తీసుకుందాం. సరిగ్గా పదిహేను సంవత్సరాల తర్వాత మనం ఎక్కడున్నా ఇదే రోజున ఈ గ్రౌండ్లో కలుసుకుందాం" అన్నాడు శ్రీరామచంద్రమూర్తి.

"అవును తప్పకుండా కలవాలి" అన్నారంతా.

"గుడ్ బై" లేస్తూ అన్నాడు రాము.

మిత్ర బృందం ఒక్కొక్కరే సెలవుతీసుకుంటున్నారు. ఆఖరుగా శామ్యూల్, నరసింగరావులు మిగిలారు. ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకున్నారు.

"అంతా మాయలా వుంది" అన్నాడు శామ్యూల్.

నరసింగరావు నవ్వాడు.

"ఇకముందయినా మనం చదవాలి. లేకుంటే పాస్ కాం. అందుకని నాకో ప్లాన్ వుంది" అన్నాడు నరసింగరావు.

"ఏమిట్రా అది?"

నరసింగరావు జేబులోనుండి చిన్న పుస్తకం తీశాడు. అందులో సన్నటి అక్షరాల్తో జవాబులు రాసున్నాయి.

అప్పటికి అయిదు పాఠాలు రాసున్నాయి.

"ఏంటిరా ఇది?"

"గైడ్. మొత్తం గైడంతా యెక్కిస్తున్నాను."

"కాపీకోసమా?"

"అవును."

"ఇంత పుస్తకం యెలా తీసుకెళ్తావు? చెక్ చేస్తారు కదా?"

"అది రహస్యం."

"ఫర్వాలేదు చెప్పరా."

"మున్నా చేసింది చాలే"

"అది నేనా? శేఖర్ గాడు చేశాడు."

"ఈ పుస్తకాన్ని బూటుక్రింద దాచి లోపలకు తీసుకెళ్తా. చెక్ చేయటం పూర్తవగానే ప్రక్కకు వెళ్ళి తొడ దగ్గర ఎరేంజ్ చేస్తాను."

"ఎలా?" ఆశ్చర్యంగా అన్నాడు.

"తొడచుట్టూ ఓ రబ్బరు పట్టీ ఉంటుంది. ఎలాస్టిక్ పైపుది. దానిక్రింద పెట్టి యే పాఠం కావాలంటే ఆ పాఠం రాసుకుంటాను."

"చూడరా?"

"చూడరు. చూసేట్టు ఎలా రాస్తాం?"

"ఏమో నాకు భయంగా వుంది!" అన్నాడు కామ్యాల్.

"ఇది రాసేది నువ్వు కాదు. నేను" అన్నాడు నరసింగరావు.

"పట్టుకుంటే ఏం చేస్తావు?"

"ఏం చెయ్యను. నాతోపాటు మరొకడు దొరుకుతాడు."

"ఎవఁడా వాడు."

"శాస్త్రి మాష్టారబ్బాయి."

తెల్లబోయి చూశాడు శామ్యూల్.

"ఈ ప్లాను వాడిదే" అన్నాడు నరసింగరావు.

"నీ ధైర్యానికి జోహార్లు" అన్నాడు.

అందరూ కలిసిన ఆఖరు సమావేశం అదే!

• • •

పదిహేను సంవత్సరాల తర్వాత....

అదే గ్రౌండ్‌లో కలిశారు మిత్రులంతా.

అదే భవనం. బ్రిటీష్‌వారు కట్టింది. దానికి తోడుగా మరికొన్ని భవనాలు కట్టారు. ఇప్పుడు డిగ్రీ కాలేజి నైతం అందులో యేర్పాటు చేయబడింది. ఆ సమావేశానికి హాజరుకాంది "గాడ్" ఒక్కడే గాడ్ తమ గ్రామ తగాదాల్లో కత్తిపోట్లకు గురై మరణించాడు.

"నరసింగరావ్ నువ్వేం చేస్తున్నావ్."

గడ్డం సవరించుకుంటూ నవ్వాడు

"ఫారెస్టు డిపార్టుమెంట్‌లో వర్క్ చేస్తున్నాను. నిన్ననే సస్పెండ్ అయ్యాను" అన్నాడు.

"ఎందుకు."

"కలప కుంభకోణంలో నన్ను ఇరికించారు."

"శ్రీరామచంద్రమూర్తి, నువ్వు...."

"నేను సి. ఎ. పూర్తిచేశాను. హైదరాబాద్‌లో ప్రాక్టీస్ పెట్టాను."

"శామ్యూల్ నువ్వు."

"నాదేముందిరా, ఈ ఊర్లోనే కిళ్ళీ కొట్టు, సినిమా హాలు ప్రక్కన."

"రాము నువ్వు చెప్పు?"

"నేను బ్యాంక్ ఆఫీసర్ గా వర్క్ చేస్తున్నాను."

"రవీంద్ర."

"డిప్యూటీ తాసిల్దారు."

"మరి శేఖర్ గాడు...."

"మీరంతా "అనామిక్" నవల్లు చదువుతున్నారా?" అన్నాడు శేఖర్.

"ఎందుకు చదవం. హార్రర్ నవలల మూలపురుషుడు" అన్నారు.

"అందుకు ప్రేరణ ఈ స్కూలే. ఆ 'అనామిక్' నేనే" అన్నాడు శేఖర్.

"నిజమా" అన్నారంతా ఆశ్చర్యంగా....

"నీ తర్వాతి నవల యేమిటిరా?"

"పావురాల వేట."

"మరి ఇంకొక్కడు మిగి · డు" అన్నారు.

"ఎవరు?"

"శాస్త్రి మాస్టార బ్బాయి."

"వాడా! వాడు లెక్చరర్."

"ఇన్విజిలేటర్ కూడానా?"

"అవును. కాపీలు జరక్కుండా చూట్టంలో మొన గాడు."

"కృష్ణ మాస్టారు."

"ఈ ఊర్లోనే వున్నాడు. ఆంజనేయప్రసాద్ గారూ మాధవరావుగారూ రిటైరయ్యారు. అన్నట్టు శేఖర్ మా హిందీ మాస్టారు...." అంటూ ఆగాడు....

"మీ అబ్బాయిని కూడా 'ర చ నా' కొనమంటున్నాడా."

అంతా నవ్వులు! నవ్వులు!

"మనం ఓసారి మన స్కూలు గదుల్లోకి వెళ్దాం" అన్నాడు రాము.

"ఏమీ మారలేదురా. మనం కావాలంటే పావు రాళ్ళు కూడా పట్టుకోవచ్చు" అన్నాడు శామ్యూల్.

"నరసింగరావు. నువ్వు 'అడవి దొంగ' సినిమా చూశావా" అన్నాడు శేఖర్ ....

అంతా నవ్వారు.

వారు నడుస్తుంటే అకస్మాత్తుగా అందరి దృష్టి లాబరేటరీమీద పడింది.

పెచ్చులూడి .... యేవేవో రాతల్తో భయంకరంగా కనిపిస్తోందది!

—:అ యి పో యి ం ది:—

కొత్త సీరియల్ ప్రారంభం

వి.యస్.రావ్



గోడ గడియారం గంటలు కొట్టడం ప్రారంభమయింది.

కరుణాకర్ ఉలిక్కిపడి తలెత్తి చూశాడు.

పదకొండు గంటలు!

చదువుతున్న ఇండియన్ పీనల్ కోడ్ సంపుటాన్ని బల్లమధ్యకి తోసి, అలసటగా లేచి నిలబడ్డాడు. ఒళ్ళు విరుచుకుంటూ, మంచంమీద పడుకున్న భార్యవేపు చూశాడు.

నర్మద వొత్తిగిలి పడుకుని, పసిపాపలా నిద్రిస్తోంది. పసిపాప....కరుణాకర్ ఉబ్బెత్తుగా వున్న ఆమె పొట్టని ప్రేమగా చూశాడు. త్వరలో నర్మద తనకి కొడుకుని బహూకరిస్తుంది.

తనకి తప్పకుండా బాబే పుడతాడని నర్మద చాలా సార్లు అంది. తన గర్భంలో యే శిశువు పెరుగుతుందో

ఆడదానికి అంతర్గతంగా తెలుసని నర్మద ఆవేశంతో వాదిస్తుంది!

చిరునవ్వుతో భార్యను చూస్తూ మంచం దగ్గరగా కదిలాడతను. కూచోబోతూ ఆగాడు. తనా మెకి హార్లిక్స్ ఇవ్వడం మరిచిపోయాడు.

ప్రతిరోజూ పడుకోబోయేముందు ఆమెకి హార్లిక్స్ ఇమ్మన్నాడు డాక్టరు. కానీ ఈమధ్య నర్మదకి హార్లిక్స్ యెందుకో సరిపడ్డం లేదు. కల తప్పాక ఆడాళ్ళ రుచులు మారిపోతాయి! తనే బలవంతంగా ఆమెచేత హార్లిక్స్ తాగిస్తున్నాడు. నర్మద ఈ పూటా సరిగ్గా భోంచేయలేదు. హార్లిక్స్ తాగించాలి. తెల్లారితే వేవిళ్ళతో ఇంకా నీరసంగా అయిపోతుంది.

కరుణాకర్ పడగ్గదిలోంచి హాల్లోకి ప్రవేశించాడు. ఫ్లోరసెంట్ ట్యూబ్ వెలుగుతూనే వుంది. లైటు తీసేయడం మరిచిపోయింది నర్మద. కరుణాకర్ వంటగదిలోకి ప్రవేశించి తలుపు పక్కనే వున్న స్విచ్ నొక్కాడు.

డైనింగ్ టేబుల్ మీద ఫ్లాస్కు బోర్లించిన లోటా వున్నాయి. షెల్ఫులోంచి పంచదార డబ్బానీ, హార్లిక్స్ బాటిల్నీ తీసి డైనింగ్ టేబుల్ మీద పెట్టాడతను. లోటాలోకి ఫ్లాస్కులోంచి పాలు పోశాడు. హార్లిక్స్ బాటిల్ అందుకున్నాడు.

ఏదో చప్పుడు. ఎవరో తలుపుని బాదుతున్నారు. మూత తీసిన హార్లిక్స్ బాటిల్ని అప్రయత్నంగా టేబుల్ మీద పెట్టాడు. పెద్దగా చప్పుడవుతే నర్మద దడుసుకుంటుంది. అతను జోరుగా హాల్లోకి నడిచాడు. తలుపు మీద ఇంకా చప్పుడవుతూనే వుంది.

ఇంత రాత్రివేళ తనకోసం యెవరొచ్చారు? ఆలోచిస్తూ అతను గుమ్మంవైపు అడుగులేశాడు. తలుపుకొట్టడం ఆగింది. గొళ్ళెంలాగి, తలుపు తెరిచాడతను. బైటంతా చీకటిగా వుంది. ఈకోకెంగులో వీధిదీపాలు వెలగడం లేదు.

గుమ్మం ముందు, వరండాలో ఎవ్వరూ లేరు. ఆశ్చర్యపోతూ తలుపు పక్కనే వున్న స్విచ్చి నొక్కాడతను. వరండాలో లైటు వెలిగింది. కరుణాకర్ వరండాలోకి అడుగులేశాడు....

* * *

పెరటి తలుపు తోసుకుంటూ ఆ వ్యక్తి, చప్పుడు చేయకుండా లోపలికి జరిగాడు. మూడు గంటల క్రితం, యాభై రూపాయల ఖర్చుతో తను తీయించిన గొళ్ళేన్ని మళ్ళీ యెవరూ బిగించనందుకు సంతోషిస్తూ నడకమ్మట నడుస్తూ, మెరుపులా వంట గదిలోకి దూరాడు.

తను కంగారుపడాల్సిన అవసరంలేదు. తన పని పూర్తయ్యేదాకా యేదో శబ్దం అతన్ని వరండాలోనే ఉంచేస్తుంది! తనలో నవ్వుకుంటూ డైనింగ్ టేబుల్ ముందు ఆగాడతను.

పాంటుజేబులోంచీ అతని చెయ్యి ఇవతలికి వచ్చింది. లోటలోని పాలని తృప్తికరంగా చూస్తూ, చేతిలోని కవర్లో వున్న పౌడర్ని జాగ్రత్తగా పాలలోకి వేశాడు. అతని చెయ్యి మళ్ళీ పాంటుజేబులోకి వెళ్ళింది. ఖాళీ కవర్ని జేబులో వదిలేసి, తళతళ మెరుస్తున్న చాకుని ఇవతలికి తీశాడతను.

చాకుని చెంచాలా ఉపయోగిస్తూ, పాలని బాగా కలియబెట్టాడు. పౌడరు పాలలో కరిగి మాయమైంది.

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహూమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా 'రిజిష్టరు పోస్టు'లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి— దానికి మీరు అర్ధ సంవత్సర చందా రు. 84/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించ నవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. పోస్టులో పోయే సమస్య ఎంత మాత్రం లేదు. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి.

ఎడంచేతిలో వున్న గడ్డపేలికతో చావుని తుడిచే
ాడు. మెల్లిగా వెనక్కి తిరిగి చెవులు రిక్కించాడు.
గాకుని వేళ్ళమధ్య వేళ్ళాడేలా పట్టుకుని, గుమ్మం సమీ
ంచి హాల్లోకి తిరిగిచూశాడు. వీధి తలుపు తెరిచేవుంది,
వ్వుకుంటూ అతను పిల్లిలా కదిలాడు.

నాలుగంగల్లో నడకను చేరుకున్నాడు. పెరటి గుమ్మం
సమీపించి, ద్వారబంధానికి బిగించిన కొక్కెంలోకి లాగే
ాళ్ళెని పూర్తిగా ముందుకి తోసి, తన వెనకే తలుపుని
మూస్తూ పెరట్లోకి, చీకట్లోకి చేరుకున్నాడు.

ఊపిరి బిగబట్టి, చెవులు రిక్కించి, పెరట్లో మోడు
ట్టులా నిలడిపోయాడు. అవాంఛితమైనదేదైనా జరి
తే, ఎదుర్కోడానికి అతని చేతిలోని కత్తి తయారుగా
ంది....

• • •

వరండా ఈ కొసనుంచీ ఆ కొసదాకా అడుగులేసి,
టూ ఇటూ చూసి, ఎవ్వరూ లేరని నిర్ధారణ చేసుకున్న
రుణాకర్ గుమ్మందాటి హాల్లోకి ప్రవేశించాడు. ఎవ్వరూ
రు! తలుపు చప్పుడైంది. ఎందుకు? ఎవరో తట్టితే గానీ
లుపు చప్పుడు కాదు! ఆలోచిస్తూ వరండా లైటు
ర్పేసి, తలుపు మూసి గొళ్ళెం పెట్టేశాడు.

కుడివైపున చిన్నగా చప్పుడైంది.

తటాలున అతని దృష్టి కిటికీవైపు మళ్ళింది.

చిరత బిగించని కిటికీ తలుపు గాలికి కదిలింది.
రుణాకర్ నవ్వుకుంటూ వెళ్ళి కిటికీ రెక్కను మూసి,
రతని తిప్పేశాడు.

గాలికి కదుల్తూ కిటికీ తలుపు చేసిన శబ్దాన్ని తలుపు
ట్టిన చప్పుడుగా తను ఊహించుకున్నాడా? తేలిగ్గా

నిట్టూరుస్తూ అతను చకచకా నడుస్తూ వంట గదివేపు వెళ్ళాడు.

అప్రయత్నంగా అతని చూపులు వడవ అవతల వున్న పెరటి తలుపుమీద పడ్డాయి. గొళ్ళెం పూర్తిగా తోయ బడింది. కానీ, కొక్కెంలో దూరకుండా ఇవతలివైపే వుంది!

నర్మద తలుపుని పూర్తిగా తోయకుండా, గొళ్ళెం లాగేసినట్టుంది. పెరటి తలుపు గాలి తాకిడికి ద్వార బంధాన్ని కొట్టుకుంటూ చప్పుడుచేసి వుంటుంది. ఏదో ఆలోచనలో వున్న తను, సహజంగా యెవరో వీధి తలుపుల్ని తట్టుతున్నారని అపోహపడ్డాడు!

కరుణాకర్ గొళ్ళెన్ని వెనక్కిలాగి, తలుపుని బలంగా తోసి, కొక్కెంలో దూరేలా గొళ్ళెన్ని ముందుకి తోశాడు. తలుపుని లాగిమూసి, వంటగదిలోకి ప్రవే శించాడు. పాలలోకి పంచదారా, హార్లిక్సూ వేసి, చెంచాతో బాగా కలిపాడు. గ్లాసుని తీసుకుని, లైటు తీసేసి, హాల్లోకి నడిచాడు. హాల్లోని లైటునీ ఆర్పేసి పడ కగదిలోకి వెళ్ళాడు.

మంచంమీద కూచుని, నర్మద నుదుటిమీద అరచేత్తో నిమిరాడు. నునుపుదేరిన బుగ్గలు మగ్గిన జామపళ్ళలా మెరుస్తున్నాయి. ఎర్రటి పెదవులు కొద్దిగా ఉబ్బినట్టు న్నాయి. గర్భం నర్మద సౌందర్యాన్ని హెచ్చువేత చేస్తోంది.

“నర్మదా....” అతని పిలుపులో అనురాగం పలికింది, నర్మద కదల్లేదు. అతని అరచెయ్యి ఆమె బుగ్గల్ని అది మింది. మగత—నిద్రలో ఉన్న నర్మద మూలిగింది, కరుణాకర్ ఆమె జుట్టు నిమిరాడు.

